# 21

కేదారబాబుకు ఇంకా సంపూర్ణ స్వాస్థ్యం చిక్కలేదు. భోజనం చేసి వసారాలో పడక కుర్చీలో పడుకున్నాడు. వార్తాపత్రిక చదువుతూ అప్పుడే కాస్త కన్నుమూశాడు. ఇంతలో గుమ్మంముందు బండిఆగిన చప్పుడు వినిపించి కళ్లు తెరిచాడు. సురేశ్ బాబు, కూతురు, ఆమె బాబు బండి దిగారు. వాళ్లను చూడగానే ఆయనకు పూర్తిగా నిద్రమత్తు వదిలిపోయింది. వాళ్లుహఠాత్తుగా రావటానికి కారణం ఏమిటా అని ఆయన గాభరాపడ్డాడు. లేచికూర్చుని "అచలా! సురేశ్!" అంటూ ఆశ్చర్యకరంగా ఉచ్చరించి — "ఎక్కడినించి ఈ రావటం? ఏనాటి సంగతి? నాకేమీ అర్థం కావటంలేదే!" అన్నాడు

అచల లోపలికి వచ్చి తండ్రి పాదాలు స్పృశించింది. సురేశ్ నమస్కారం చెప్పి — "మహిమ్ ఇచ్చిన టెలిగ్రాం అందలేదా?" అని అడిగాడు.

"అందలేదే!" — అన్నారు కేదారబాబు ఉద్విగ్నచిత్తుడై.

సురేశ్ ఒక కుర్చీలాక్కుని కూచున్నాడు. "బహుశః టెలిగ్రాం ఇవ్వటం అతడు మరచిపోయాడో, లేక టెలిగ్రాం ఇంకా కానేవటికి [illegible]స్తుందో!" అన్నాడు.

"టెలిగ్రాం మాట సరేగాని అసలుసంగతేమిటో చప్పున చెప్పు. నువ్వు వీళ్లను ఎక్కడినించి తీసుకువస్తున్నావు?"

"నిన్నరాత్రి మహిమబాబు గృహం పరశురామప్రీతి అయింది"

"ఇల్లు తగులబడిపోయిందా? సర్వనాశనం అయిందన్నమాట! ఏమీ? ఇల్లుతగులబడిందా? మహిమ్ ఏడీ మరి? వీళ్లు నీకు ఎక్కడ దొరికారు?" — ఒకగుక్కలో ఇన్నిప్రశ్నలడిగి కేదారబాబు తిరిగి పడక కుర్చీలో కూలబడ్డాడు.

"అక్కడినించే తీసుకువస్తున్నాను. నేను అక్కడే ఉన్నానుకదూ!"

కేదారబాబు ముఖంలో అప్రసన్నత కనిపిస్తూనే వున్నది. "నీవు అక్కడ ఉన్నావా? ఎప్పుడు వెళ్ళావు? వెడతానని నాతో యెప్పుడూ చెప్పావు కాదే! సరేగాని అతడేడీ?"

"అతడు రాలేదు. అందుచేతనే—"

కేదారబాబు ముఖం నల్లబడ్డది. తల అడ్డంగా ఊపుతూ అన్నాడు—"ఇదంతా బాగాలేదు. చాల విచారకరమైన విషయం. పట్టి అన్యాయం ఇటువంటి వ్యవహారం నేను ఒక్కనాటికీ"—అంటూ ఒకసారి కూతురికేసి చూచాడు.

ఇంతసేపటినించీ అచల ఒకకుర్చీ ఆనుకుని నిల్చుంది. తండ్రిగారి అనుమానం ఆమె గ్రహించుకుని చాల బాధపడ్డది. తాము హఠాత్తుగా రావటంవల్ల ఏమి చెప్పినా ఆయన విశ్వసించలేదు. ఆమె సిగ్గుపడిపోయింది. ముఖంలో నెత్తురుచుక్కలేదు.

ఆమె ముఖ లక్షణాలను చూస్తోంటే కేదారబాబుకు అనుమానం మరీ స్పష్టమైపోయింది. పడక కుర్చీలో వెల్లకిలా పడుకుని, వార్తా పత్రిక తెరచి పట్టుకుని ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు, "సరే ఇక మీ యిష్టంవచ్చినట్లు చేసుకోండి. రేపే నేనీ యిల్లువిడిచి వెళ్ళిపోతున్నాను"

సురేశ్ ఆశ్చర్యక్రోధాలను ఆపుకోలేక అన్నాడు—"కేదారబాబూ! మీమాటలూ మీరూ ఏమీ అర్థం కావటంలేదు నాకు. ఎందుకు ఇల్లువిడిచి పోతానంటున్నారో, ఎందుకు—ఏమిటీ మీ గొడవ?" అంటూ అటు అచలకేసీ, ఇటు ఆమె తండ్రికేసీ చూచాడు. కాని ఎవరిముఖమూ అతనికి సరిగా కనిపించలేదు. కేదారబాబు జవాబేమీ చెప్పకపోవటంచేత సురేశ్ లేచి నిల్చుని—"మహిమ్ నన్ను చేయమన్న పనేమో చేశాను. తరువాత మీయిష్టం. నేనింకా స్నానం చెయ్యలేదు, భోజనం చెయ్యలేదు. ఇంటికి వెడుతున్నాను"—అంటూ గబగబా అడుగులు వేశాడు ముందుకు. కేదారబాబు లేచి కూచుని—"అరెరె, వెళ్ళటం ఎందుకు? సంగతేమిటో చెప్పు వింటాను. నిప్పు ఎలా అంటుకుంది అసలు?"

"ఎవరికి తెలుసు?" అన్నాడు సురేశ్ కఠినంగా "నువ్వు ఎప్పుడు వెళ్ళావు అక్కడికి?"

"అయిదారు రోజులక్రింద. ఇంకా నేను భోజనం చెయ్యలేదు, వస్తాలే" — అంటూ మళ్ళీ వెళ్ళిపోవటానికి సంసిద్ధుడైనాడు సురేశ్.

"అరె, కాస్త వుండవయ్యా! మీలో ఎవరూ కూడా స్నాన భోజనాలు చెయ్యనట్లు కనిపిస్తూనే వుంది. ఇదికూడా ఇల్లే. ఇక్కడా నౌకర్లు వున్నారు. అచలా! బేహారాను పిలు. అలా నిల్చున్నావేం? కూచోవోయి సురేశ్! అసలు సంగతి ఏమిటి? విశదంగా చెప్పు, వింటాను."

సురేశ్ తిరిగివచ్చి కూచున్నాడు. కాసేపుండి అన్నాడు — రాత్రి నిద్రపోతూంటే మహిమబాబు కేకలువిని లేచాను. గబగబా బైటికివచ్చి చూస్తే ఏముందీ? కొంప భగ్గు భగ్గుమని తగులబడుతోంది. పూరికొంపాయెను. ఆర్పేందుకు ప్రయత్నించీ లాభంలేదు. కాబట్టి అంతకెవరూ ప్రయత్నించనూలేదు. అంతా మండి మండి భస్మమైపోయింది. యింకేముందీ?"

"అంతా మండిపోయినట్టే? ఏమీ నక్కలేదన్నమాట! అచల సొమ్ములు మొదలైనవి —"

"అవన్నీ అతడు జాగ్రత్తగా బైటికి చేర్చాడు"

"చేర్చాడుకదా!" అని కేదారబాబు ఒక దీర్ఘ నిశ్వాసం విడిచాడు. మరికాసేపుండి — "అయినా నిప్పు ఎలా అంటుకుంది అసలు?" — అని అడిగాడు

"ఇంతవరకూ అసంగతెవరికీ తెలియరాలేదని చెప్పాను కాదూ! గ్రామంలోమాత్రం మహిమ్ మేలుకోరేవాడెవడూ మనుష్యమాత్రుడు లేడని మాత్రం గట్టిగా చెప్పగలను"

"ఒక్కడూలేడూ?"

"ఊహూ"

కేదారబాబు మరి మాటాడలేదు. చాలసేపటివరకూ మౌనంగానే కూచుని బైటికి చూస్తూవున్నాడు. చివరకు ఒక పెద్ద నిట్టూర్పు తీసి లేచి నిల్చున్నాడు. "పద, సురేశ్! స్నానం చేద్దువుగాని చాల ఆలస్యమైంది ఇప్పటికే. వంటకూడా ఇప్పుడే చేయించేస్తాను" అంటూ సురేశ్‌ను వెంట తీసుకొని లోనికి వెళ్లాడు.

భోజనాలైన తరువాతకూడా ఆయన సురేశ్‌ను వెళ్లనీయలేదు. అతడొక పడకకుర్చీలో మత్తుగా పడుకున్నాడు. అచల తనగదిలోకి వెళ్లి లోపల గడియవేసుకుంది! కేదారబాబుకుమాత్రం విశ్రాంతి చిక్కలేదు. టెలిగ్రాం

ఇప్పుడు వచ్చినా ఒకటే; రాకపోయినా ఒకటే కాని ఆయన దానికోసమే మధనపడుతూ వున్నాడు. సాయంత్రం కావస్తున్నది; ఇప్పుడు నిద్రపోవటం మంచిదికాదు కూతుర్ని పిలిపించుకున్నాడు తనగదికి.

అచల దగ్గరకు రావటంతో ఆయన అడిగాడు—"మహిమబాబు టెలిగ్రాం ఇచ్చాడని మీరన్నారు. ఏది ఆ టెలిగ్రాం? మీరేమో రై లెక్క వచ్చేశారు. టెలిగ్రాం ఇంకా రానేలేదు. ఉండు, వస్తాను"అంటూ కూతురు జవాబు అపేక్షించకుండానే స్లిప్పర్లతొడుక్కుని, గబాగబా పై టికివెళ్లాడు. మరునిమిషంలో కిందినించి ఆయనగారి ఉత్తేజిత కంఠస్వరం వినిపించింది. అచలాదేవి దాసీని ఆయన క్రాసుపరీక్ష చేస్తున్నాడు అయ మాటలకది ఆశ్చర్యపడుతూ ఎదురుచెబుతోంది—"అదేంమాటలు బాబయ్యా! నిప్పంటు కుని కొంప బూడిదై పోయింది; నేను కళ్లారాచూచాను. మీరు నిప్పుఅంటు కోలేదంటారాయె నేనేంచెప్పను? నిప్పు అంటుకోకుండానే ఇల్లు ఎలా తగలబడి బూడిద అయిపోయిందో మరి మీరే చెప్పండి"

సురేశ్ ఆమాటలన్నీ విన్నాడు తలయెత్తిచూచాడు అచల గుమ్మం గట్టిగాపట్టుకు నిల్చుంది. చెవులు నిక్కించి వింటోంది. అతడు ఒక్క నిట్టూర్పు విడిచి అన్నాడు "మీనాన్నగారి వ్యవహారం ఏమిటది. అర్థం కాకుండా ఉందే!"అచల ఉలిక్కిపడి వెనక్కితిరిగి చూచింది. "ఏమో మరి!" అని మాత్రంఅన్నది.

"ఆయనకింకా మన మాటలమీద నమ్మకం చిక్కలేదని తెలుస్తూనే ఉంది. ఇల్లు తగలబడిపోయిన సంగతి మనం కల్పించి చెప్పిన అబద్ధమని ఆయన భావిస్తున్నాడు అయినా నిజానిజాలు రేపైనా బయటపడకుండా ఉండవుగదా! ఆయన అలా సందేహిస్తూ ఉన్నప్పుడు నేనిక్కడికి రావటం పోవటం అసంభవం"

"అయితే మీరిక ఇక్కడికి రారా—?" అనిఅడిగింది అచల

సురేశ్ లేచి నిల్చున్నాడు. "బహుశః రావటమనేది సంభవించదు. నాకూ కాస్త ఆత్మగౌరవమంటూ ఉన్నది. నా మాటు కేను ఎవరి చేతికైనా ఇచ్చి తరువాత పంపి చండి"

"సరే" అన్నది అచల. అతడిక అక్కడికి రావటం, రాకపోవటం గురించి ఆమె మరేమీ ప్రస్తావించలేదు.

"రేపు ఉదయమే సూటుకేసు పంపించండి. అవసరమైన వస్తువు లున్నాయి అందులో" - అని కేదారబాబుకోసం ఉండకుండానే వెళ్లి పోయాడు.

కేదారబాబు తిరిగి వచ్చాడు. అకస్మాత్తుగా సురేశ్ వెళ్లిపోవటం ఆయనకు ఆశ్చర్యమనిపించింది. కాని అందుకాయన విచారించినట్టు కనుపించ లేదు.

ఆరాత్రి చాల పొద్దుపోయేవరకూ అచల పక్కమీద అటూ ఇటూ పొర్లుతూ నేవుంది. చివరకు లేచి కూచుంది. బైటవరండాలో నిల్చుని వీధిలో వచ్చేపొయ్యే వాళ్లనుచూస్తూ కాస్త మనస్సును ఇతర విషయాలమీదికి మరి లించుకోవాలని తలుపు తెరచుకునివరండాలో వచ్చినిల్చుంది. కింఽగదిలో ఇంకాదీపం వెలుగుతూఉంది. పనివాళ్లు పడుకోబోయేముందు దీపం ఆర్పటం మరచిపోయారేమోనని ఆమె అనుకుంది కాని రెండడుగులు ముందుకు సాగిరాగానే లోపలనించి తండ్రిగారి మాటలు వినిపించాయి. అప్పుడామె ఆశ్చర్యానికి మేరలేక పోయింది. సాధారణంగా ఆయన రాత్రి పదిగం టలయేసరికి నిద్రపోవటం ఆచారం. కాని ఇప్పుడు పదిన్నర అయింది, మరు క్షణమే ఆమెకు దాసీదాని కంఠస్వరంకూడా వినిపించింది. అది చెబుతోంది —"మృణాళిని భర్తగారు చనిపోయారంటండి ఇవాళ ఉదయమే, మరి ఆవిడగారు అత్తింట్లో తిన్నగా ఉండేవో లేదో నాకేమీ తెలవదుబాబూ! తమ అల్లుడిగారికీ ఆమెకూ ఎలాంటి సంబంధంఉందో వారికే తెలియాలి"

"హు" అనిమాత్రం శబ్దం చేశాడు కేదారబాబు.

ఇంతకుముందు చాల ప్రసంగం జరిగి వుంటుందని అచల ఊహించు కుంది. మృణాళినివిషయంలో, మహిమ్‌విషయంలో తన్నుగురించీ-అన్ని సంగ తులూ ముగిసేవుంటాయి. కాని తన విషయంలో ఏ అప్రియమైన సంగతి తన చెవులారా వినవలసివస్తుందో నన్న భయంతో వెనక్కు తిరిగిపోదామనుకుంది. కాని ఆమె కాళ్లు ఏ యినుపగొలుసులతో కట్టివేయబడినవో ఆమెకే తెలి యలేదు;

కేదారబాబు కాసేపు ఊరుకుని అడుగుతున్నాడు- "అయితే ఇద్దరికీ పొసిగిందికాదు, ఔనా?"

"ఔనండి బాబయ్యా! ఏమాత్రమూ కలవలేదిద్దరికీ. ఒక్కరోజు కూడా సంతోషంగా లేరండి"- అన్నది దాసీది.

ఈ దాసీ ఇన్నాళ్ళనించీ అమాయకురాలని అనుకుంటూండేది అచల. ఇప్పుడు తెలుస్తున్నది! ఆదికూడా తెలివితేటల్లో ఎవరికీ తీసిపొయ్యేది కాదు.

కేదారబాబు ఒక్క నిమిషం ఊరుకుని మళ్లీ అడుగుతున్నాడు. "అయితే నిన్న రాత్రి యెవరూ భోజనం చేశారు కాదన్నావు ఎందువల్లనో చెప్పు. సురేన్ అక్కడికి వచ్చినప్పటినుంచీ ఏదో ఒకరకమైన పోట్లాట రోజూ జరుగుతూ ఉండేదన్నమాట!"

దాసీదాని జవాబు అచలకు సరిగా వినిపించలేదు. కాని తరువాత తండ్రిగారన్నమాటలనుబట్టి అది ఎలా జవాబుచెప్పిందో అచల ఊహించుకుంది. ఆయన అంటున్నాడు — "ఎప్పటికైనా ఇలాజరుగుతుందని నేననుకుంటూనే ఉన్నాను. ఈకాలపు పిల్లలు తల్లిదండ్రుల మాటలు వినరు. నేనంతా ఆలోచించి ఒకచక్కని రాస్తా ఏర్పాటు చేశాను నేను చెప్పినట్టే నడుచుకున్నట్టయితే ఆమెకీనాడు ఏచింతా ఉండేదే కాదు; అని ఆయన ఒక దీర్ఘనిశ్వాసం విడిచాడు.

దాసీదికూడా ఆయన మాటలనే అనుసరించి ఇలా చెబుతున్నది — "బాగా అన్నారు బాబయ్యా! అలా అయితే చింత ఏముంది? వచ్చి వెళ్లటూ రెండు పట్టి పూటల్లు అదికూడా లేదీనాడు. అల్లుడుగారేమో — "అంటూ వాక్యం సమాప్తి చెయ్యకుండానే ఒక నిట్టూర్పు విడిచి ఊరుకుంది.

"ఎంత అమర్యాద! — అంటూ కేదారబాబు లేచి నిల్చుని — "సరే నువ్వు వెళ్లు" అని దాసీదాన్ని పంపించేసి దీపం ఆర్పి పడుకోమని చెప్పేందుకు నౌకరును పిలుద్దామని వెళ్లాడు

కాళ్లీడ్చుకుంటూ అచల తన గదిలోకి వెళ్లి పడుకుంది. తండ్రిగారి ఔదార్యాన్ని గురించిగాని ఆమెకెప్పుడూ, మంచిఅభిప్రాయంలేదు. ఒక దాసీదానితో అలా ఏకాంతంగా ఆలోచన చెయ్యవలసినంత నీచానికి పాల్పడతాడని మాత్రం ఆమె ఎన్నడూ అనుకోలేదు. ఇవాళ ఆమె మనస్సు ఎంతో చిన్నబోయింది దుమ్ములోపడి పొర్లాడుతూన్నట్టుగా ఉందామెకు. కాని తన భర్త, తండ్రి, దాసి, బంధువర్గమంతా తనలాగే ధూళిధూసరితులై ఉన్నారు. ఇక ఎవరిసహాయంతో తానా ధూళిశయ్యనించి విముక్తి పొందుతుంది? ఏమో, ఆమెకేమీ పాలుపోవటంలేదు.

# 22

కేదారబాబు ఒక మామూలు వ్యక్తి. అతనిలో సుగుణాలూ ఉన్నవి. కూతురికి వివాహం చెయ్యాలనుకున్నప్పుడు వరుడు 'డిగ్రీహోల్డరు', సంపద్వంతుడు ఐవుండాలని ఆయన కోరాడు. మహిమ్ యం. యే. ప్యాసైనాడు. వాళ్ళ ఊళ్ళో నుంచి ఆస్తి వుండివుంటుంది. కాబట్టి అతని లాంటి అల్లుడు దొరకటం తన సౌభాగ్యమనే ఆయన ప్రథమంలో భావించాడు. కాని అకస్మాత్తుగా సురేశ్ రంగంలో ప్రవేశించాడు. అతని మూలాన మహిమబాబు పేదరికం బైటపడింది. కేదారబాబు అల్లుడి పదవికి సురేశ్ కూడా ఒక అభ్యర్థియైనాడు. అతని మూగ 'అప్లికేషన్' ను ముసలాయన మంజూరు చేశాడు. సురేశ్ ధనాఢ్యుడు కదూ మరి! అదీగాక కేదారబాబుకు ప్రేమ మహాత్మ్యంలో ఏమీ నమ్మకం లేదు. ఎవరిదగ్గర దాస దాసీజన వస్త్రవాహనాది భోగసామగ్రి ఉంటుందో అతన్నే స్త్రీలు మన్మథునిగా అంటిపెట్టుకుని ఉంటారని ఆయన సిద్ధాంతం. అలంకరించుకోటానికి సొమ్ములు, ధరించేందుకు దువ్వాలువలు విరివిగా ఇవ్వగల భర్తనే వరిస్తారని ఆయన ఊహ. కూతురు సుఖపడాలనేగా తండ్రికోరేది! కాగా సురేశ్ లాంటి బంగారుపిచ్చిక దైవాద్యా చేతికి చిక్కినప్పుడు వదులుకోరాదని ఆయన నిశ్చయించుకున్నాడు. మహిమ్‌ను తోసి రాజంటానికి సిద్ధపడ్డాడు.

కాబోయే అల్లుడుకదా అని - పెళ్ళికాకముందే - సురేశ్ దగ్గిర అయిదు వేల రూపాయలు పుచ్చుకోవటం తప్పేమోనని కూడా ఆయనకు స్ఫురించలేదు. పైగా అప్పులుతీరిపోతే ఇల్లు అతనికే ఉంటుందికదా అనే ఆలోచనలో బాకీలు తీర్చవలసిన అవసరంకూడా ఉండదని సంతృప్తిపడ్డాడు.

కాని అభాగ్యురాలు అచల స్వయంగా అమృతపు గిన్నె ఒలుకబోసుకుంది. తనమాటవినలేదు. చివరకు ఆమెను మహిమ్ చేతిలోనే పెట్టవలసివచ్చినందుకు ఆయన మనస్సు క్షోభించింది. పైగా అందువల్ల సురేశ్‌బాబు అప్పు తీర్చవలసిన అవసరం ఏర్పడ్డది, రాతకోతలేమీ జరుగనందువల్ల, అంత అప్పు తీర్చే దారి ఏదన్నా కనిపించనందువల్ల, ఆయన చింత నానాటికి అధికమైంది.

అచల అత్తగారింటికి వెళ్ళింది. ఆతరువాత సురేశ్ వస్తూపోతూ ఉండటంకూడా కేదారబాబుకు ఇష్టంలేదు. తానుకూడా తరచు మిత్రులిండ్లకు

పోవటం మానుకున్నాడు. కూతురు చేసిన పాతానికి నొచ్చుకుంటూ, విచారంగా రోజులు వెళ్లబుచ్చుతున్నాడు.

అలాగే కొన్నిరోజులు గడిచాయి. ఇంతలో ఆయన జ్వరపడ్డాడు తీవ్రమైన జ్వరమే సురేశ్ వచ్చి చికిత్స చేశాడు; ఎలాగైతే నేం ముసలాయన తిన్నగా లేచుకున్నాడు. ఒకసారి ఆయనే అప్పు తీసుకున్న డబ్బును గురించి ప్రస్తావించాడు. "అది మిత్రుడికి వరకట్నంకింద ఇచ్చాను"_అంటూ సురేశ్ నవ్వుతూ విషయం మార్చేశాడు. నాటినించీ ఆయునకునికిపట్ల కేదారబాబు స్నేహం బలీయము అకృత్రిమము కాజొచ్చినది. దానితోపాటు కూతురిమీద కోపము హెచ్చింది "ఆమె ఈ రత్నంలాటి మనిషిని తిరస్కరించింది. ఎప్పటికైనా అందుకు ప్రతిఫలం అనుభవించి తీరుతుంది."_అని అనుకుంటూ ఉండేవాడు

మహిమబాబు పేరెత్తితే ఆయనకు కంటకంగా ఉంటున్నది. అయినా తనకూతురు పాతివ్రత్యధర్మానికి తిలాంజలు లిచ్చి, భర్తను విడిచి, ముఖాన కళంకముద్ర ధరించి, ఇంటికి తిరిగి రావటం ఆయనకు కిట్టదు. ఆమె అలా చేస్తుందని ఆయన కలలోకూడా అనుకోలేదు. అట్టిపాపాచరణకు ఆమెను దింపినవాడు - ఎంత గొప్పవాడైతే మాత్రం మేమి? - అతనిపట్ల ఆతండ్రి మనస్సు ఎంత క్రోధపూరితమౌతుందో ఊహించుకోవచ్చు.

అదిలో కేదారబాబుపట్ల అచలాదేవికి ఎలాంటి భావముండేదో నా ఏకైతే ఆయన ధనలోభంలో పడిపోయి, మహిమ్‌ను కాదని తన్ను సురేశ్ బాబుకు ఇవ్వాలని చూచాడో — ఉప్పుడు తీర్చేఉపాయం గాని, ఉద్దేశం గానిలేకపోయినా అతని వద్ద అంత సొమ్మును బదులుపుచ్చుకున్నాడో ఆనాడే ఆయనలో మానవత్వం బహు స్వల్ప మని ఆమె గుర్తించింది పైగా నిన్నటిరాత్రి కన్నకూతురి సంగతి సందర్భాలు తెలుసుకొనేందుకు రహస్యంగా దానీదానితో ఆలోచన చెయ్యటానికికూడా ఆయన సంకోచించక పోవటంచూస్తే ఆ ఏర్పడిన ఏహ్యభావం శతధా పెరిగిపోయింది

కాని నేడు అచలాదేవి తన హృదయాన్ని తాను చూచుకోగలిగింది. "మిమ్మల్ని నేను ప్రేమించలేను" _అని తానానాడు భర్తముఖాన్నే అని వేసింది అపన్ని వేళం తలపుకువస్తే ఆమెకిప్పుడు రోమాంచం కలుగుతున్నది. భర్తతో తనలా అనటంతో స్త్రీ పాటించవలసిన సభ్యతను మంట కలిపిందన్నమాట! అందువల్లనే భర్తముందు తానొక తుచ్ఛవస్తువై పోయింది. దాసీ

దానిదృష్టిలోకూడా నీచపడిపోయింది. సురేశ్ దృష్ట్యాకూడా తనకు విలువేమీలేదు బహుశః అతనికి తనమీదఉండే అభిమానం ఒక భోగవస్తువు మీద ఉండే ఆశవంటిదే! కాని వాస్తవికంగా అంతేనా? నిజంగా తానంత తుచ్ఛురాలేనా? ఆనాడు తన ప్రేమలో విశ్వాసం పెట్టుకుని, ప్రలోభాలకు లొంగక, విరోధ పరిస్థితులను గడిచి మహిమ్‌ను స్వీకరించింది. ఇంతలోనే నేడు మహిమ్ అదంతా మరచిపోయాడా? తన్ను సురేశ్‌తో పంపించివేసి మహిమ్ తన కబురే తెలియజేశాడుకాదు. ఈ ఉదాసీనత తనకు అవమానకరంగా లేదూ? ఆమె కారాత్రి అంతా నిద్రలేదు.

ఆమె తెల్లవారి చాల ఆలస్యంగా లేచింది. ఉదయసూర్యకిరణాలు కిటికీగుండా వచ్చి పక్కమీద వ్యాపించాయి. ఆమె పక్కమీదనుంచి లేచి తలవైపు కిటికి తెరుచుకుని మౌనంగా కూచుంది—బైటరోడ్డుమీద వచ్చే పోయేవాళ్లనుచూస్తూ—

కలకత్తా వీధుల్లో జనసమ్మర్దం బాగానే ఉంటుంది. పనిమీద వచ్చే వాళ్లు, ఇంటికి తిరిగి వెళ్లేవాళ్లు, ఉదయం పూట షికార్లు చేసేవాళ్లు —కోలాహలంగానేఉంటుంది; అటుకేసి చూస్తూ చూస్తూ ఉంటే ఆమెకు ఒక ఆలోచన తట్టింది—"నాముఖం ఎవళ్లకూ చూపకుండా ఇలా నేనే ఏకాంతవాస శిక్ష విధించుకుంటున్నాను; నేనేమి మహాపరాధం చేశానని? ఏమైనా అపరాధం చేసివుంటే ఆయన యెడల చేశానేమో! అందుకు శిక్ష ఆయనే ఇస్తారు. అన్యాయంగా ఇంకొకరు నన్ను శిక్షించవలసిన అవసరం ఏముంది? నేనెందుకు సహించాలి?"

వెంటనే ఆమెను లేచి నుంచుంది. ముఖం కడుక్కొని, దుస్తులుమార్చి బైటిగదిలో వచ్చికూర్చుంది.

కేదారబాబు పడకకుర్చీలో పడుకుని వార్తాపత్రిక చదువుకుంటున్నాడు. ఒకసారిమాత్రం తలతిప్పి ఆమెకేసి చూచాడు. మళ్లీ వార్తాపత్రికా పఠనలో మగ్నుడైనాడు.

మరికాసేపటికి బేహారావచ్చి టీసరంజామా అంతా తెచ్చి టేబిల్ మీదపెట్టాడు. కేదారబాబు స్వయంగానే ఒకకప్పు టీ కలుపుకుని త్రాగుతూ వార్తాపత్రిక చదువుకుంటున్నాడు.

అచల తలవంచుకుని కూచుంది తండ్రిగారి ఆచరణ చూస్తూనే ఉంది. తానే వెళ్లి ఆయన్ను అడ్డగించి టీ కలిపి ఇవ్వాలనిగాని, ఆయనతో మాటాడాలనిగాని ఆమెకిష్టంలేదు. సాహసించనూ లేకపోయింది.

కాని అదే గదిలో ఆయన పక్కనే మూతిముడుచుకుని గంభీరంగా కూచోలేకపోయింది. అటువంటి తండ్రితో ఆయింట్లో చాలరోజులు ఉండటం ఉచితమా కాదా? కాకపోతే ఏమిచెయ్యాలి? గత్యంతరం ఏమిటి? ఈ మొదలైన జటిలసమస్యలనుగూర్చి ఏకాంతంగా కూచుని ఆలోచించుకునేందుకు లేచివెళ్ళిపోవా లనుకుంటుంటే సురేశ్ ప్రత్యక్షమైనాడు. ఆమెకు ఆశ్చర్యం వేసింది, అసహ్యమనిపించింది. సురేశ్ లోనికి వచ్చాడు. కేదారబాబుకు నమస్కారం చెప్పాడు. ఆయన పక్కకు తిరిగిచూచి, కాస్త తల ఊపి, మళ్లీ వార్తాపత్రిక పఠనలో నిమగ్నుడైనాడు.

సురేశ్ కుర్చీ ఒకటి లాక్కొని కూచున్నాడు. టీ సామానులు తీసుకుపోయేందుకు బేహారా రాగానే సురేశ్ అతనితో — "నాసూటుకేసు ఎక్కడుంది? తీసుకువెళ్లి నా బండిలో పెట్టు. 'షేవ్' చేసుకునే సామానుకూడా అందులోనే ఉంది. ఆలస్యం చెయ్యకు, నేను వెళ్లాలి"

'చిత్తం' అంటూ బేహారా వెళ్లిపోయాడు. మళ్లీ గది అంతా నిశ్శబ్దంగా ఉంది. కానేపుండి సురేశ్ అడిగాడు — "మహిమ్ దగ్గరనించి ఏమైనా కబురువచ్చిందా?"

తలెత్తి చూడకుండానే కేదారబాబు జవాబు చెప్పాడు — "ఊహూ" అని.

"ఆశ్చర్యంగా ఉందే!" అన్నాడు సురేశ్.

మళ్లీ గదిలో నిశ్శబ్దం. బేహారా తిరిగివచ్చి — "సూటుకేసు బండిలో పెట్టాను" అని చెప్పాడు.

"అయితే వెడుతున్నాను. మహిమ్ దగ్గరనించి తెలియగానే కాస్త నాకు కబురుచెయ్యండి" — అని చెప్పి సురేశ్ లేచి పోవటానికి ఉద్యుక్తుడైనాడు కాని కేదారబాబు వార్తాపత్రికను టేబిల్ మీద పెట్టేసి — "కొంచెంసేపు ఉండు సురేశ్! నేనిప్పుడే వస్తాను" — అని చెప్పి అతనికేసి చూడకుండానే స్లిప్పర్లు తొడుక్కొని గబగబా బైటికి వెళ్లాడు.

ఇంతసేపటినుంచి అచల తలవంచుకునే కూచుంది. సురేశ్ ఆశ్చర్యపడుతూ ఆమెకేసి చూచాడు ఆమె భయం భయంగా వణుకుతూ కూచుంది. ముఖంలో కాంతిలేదు. కళ్లు విషాదసూచకంగా ఉన్నవి. "ఏమిటీ వ్యవహారం?" అని అడిగాడు సురేశ్?

అచల తల యెత్తలేదు. ఊరికే తలఊపి ఊరుకుంది.

"మీనాన్న నన్నింత నీచునిగా, పాపినిగా పరిగణిస్తాడని నేను కలలోకూడా అనుకోలేదు."

ఈసారికూడా అచల యేమీ పలకలేదు. ఇదివరకుమల్లే మౌనంగా చూస్తుంది.

"నాకు తోస్తున్న ఆలోచన ఏమిటంటే — ఇప్పుడే మహేష్ దగ్గరకు వెళ్లి —"

సురేశ్ వాక్యం పూర్తికాకముందే కేదారబాబు తిరిగివచ్చాడు. ఆయన చేతిలో ఒక కాగితం ఉంది. దాన్ని సురేశ్ ముందు టేబిల్ మీద పెట్టి అన్నాడు — "ఇంతవరకూ ఏదో అశ్రద్ధవల్ల ఆడబ్బును రశీదుకూడా ఇచ్చాను కాదు. ఇదిగో అయిదువేల రూపాయలకు ప్రోనోటు రాసి యిస్తున్నాను. వడ్డీ ఇప్పుడు నేనేమీ ఇవ్వలేను కాని యిల్లు ఉన్నదిగదా! దీనివల్ల అసలు తీరుతుంది"

సురేశ్ కనుబొమలు కుంచించుకుని క్షణకాలం అలాగే నిలబడి పోయాడు. "నేను మిమ్మల్ని ప్రోనోటు వ్రాసి ఇవ్వమనలేదు గదా కేదారబాబూ!" అన్నాడు.

"నువు అడగలేదు, నిజమే. కాని నేను ఈయవద్దూ మరి! ఇంత వరకూ ఇవ్వకుండా ఊరుకోవటం అన్యాయం. సురేశ్! నోటుతీసుకొని జేబులో పెట్టుకో. ముసలివాణ్ణి అయాను. ఎప్పుడో గుటుక్కుమన్నా నంటే ఆడబ్బునుగురించి వివాదం రావచ్చు"

సురేశ్ ఆవేగపూర్ణుడై జవాబు చెప్పాడు — "కేదారబాబూ! సురేశ్ ఎలాంటివాడని మీరనుకున్నా అడబ్బుకోసమని ఎన్నటికీ పేచీ పెట్టేవాడు కాదని మాత్రం మీరు నమ్మండి. ఆసొమ్మును నేను తిరిగి అపేక్షించటంలేదని మీరూ బాగా ఎరిగిన విషయమే. అదిగాక నేనా సొమ్మును నామిత్రుని పెళ్లివేళ కట్నంగా ఇచ్చాను."

"అయితే నీమిత్రునికే ఇచ్చుకోవలసింది. నాకెందు కిచ్చావు? సొమ్ము పుచ్చుకున్నాను. అది నాక్రింద ఖర్చయింది"

"సరే నామిత్రునికే ఇస్తాను" — అంటూ సురేశ్ టేబిల్ మీదినించి ప్రోనోటు తీసుకొని అచల ఉన్నవైపు రెండడుగులు నడిచి ఆమెముందు నిల్చున్నాడు. కేదారబాబుకు కోపం పెద్దపెట్టున వచ్చింది! కళ్లు విస్ఫారిం

గాజులు చిట్లాయి. ఛీత్కారం చేశాడు. "జాగ్రత! సురేశ్ బాబూ! నిన్నటినించీ ఎంతో అవమానం సహించి ఊరుకున్నాను. నా కళ్లముందే నువ్వు నా కూతురికి డబ్బు ఇవ్వటానికి ఉద్యమిస్తున్నావు నేనది సహించను." — అంటూ కోపంతో వణికిపోతూ తన పడక కుర్చీలో పోయి వాలాడు

మొదట సురేశ్ బాబు గాభరాపడి ఆయనకేసి అలాగే చూస్తూ నిల్చుండిపోయాడు. ఆయన కుర్చీలో కూలబడిపోయిన తర్వాత పక్కకు తిరిగి అచలకేసి చూచాడు. ఆమె ఒక్క క్షణంలో రాతిబొమ్మలా అయిపోయింది. ఎంతో ప్రయత్నం చేశాడు ఏదైనా మాటాడదామని కాని ఒక అవ్యక్త ధ్వని తప్ప కంఠంలో నించి ఒక్కమాట కూడా పెగలలేదు. మళ్లీ కేదారబాబుకేసి తిరిగి చూచాడు రెండు అరచేతుల్లో ముఖం కప్పుకుని ఆయన అలాగే పడుకున్నాడు. సురేశ్ మరేమీ మాటాడాలని ప్రయత్నం చెయ్యలేదు. జడునివలె ఒక నిమిషంసేపు స్తబ్ధుడై నిల్చియుండి చివరకు గది విడిచి వెళ్లిపోయాడు

తండ్రీ కూతుళ్లు అలాగే మౌనంగా కూచున్నారు. పైట సురేశ్ బాబు బండి వెళ్లిపోతున్న చప్పుడు తప్పితే గదిలో అంతా నీరవనిశ్శబ్దమే.

సురేశ్ బాబు బండి చప్పుడు క్రమేణా సన్నగ అయిపోయి అంతా ఆకాశంలో లీనమైపోయింది ఇంతలో బేహారా వచ్చాడు "బాబు" అంటూ కేదార బాబు అతనికేసి చూచాడు. అతడి చేతిలో ఒక కాగితం ఉంది. అదిచూచి ఆయన మండిపోయాడు. ఛీత్కారం చేశాడు. "తీసుకుపో వాకిటముందునించి వెళ్లిపో, కాపదలు తీసుకుపో"

నౌకరు. గాభరాపడి పోయాడు వెనక్కుతిరిగి చూడకుండా పరుగెత్తాడు. ఆ తరువాత కేదారబాబు కూతురికేసి అగ్నిజ్వాల వంటి చూపు విసిరి, కంఠస్వరం తారస్థాయికి హెచ్చించి అన్నాడు— "విధవ! బద్మాష్! మళ్లీ నా యింటికెప్పుడేనా రానీ చెబుతాను; పోలీసులకు ఒప్పచెబుతాను గాడిదను. నీకు ముందుగా చెబుతున్నాను అచలా!"

తన పేరు విని అచల తలెత్తి చూచింది. వ్యథిత హృదయం ఆమె మ్లాన ముఖంలో ద్యోతకమౌతున్నది. తండ్రి ముఖంలోకి అలాగే చూస్తూ ఉండిపోయింది.

"రూపాయలు చూపించి తండ్రి కళ్లలో దుమ్ము కొట్టలేవు. తెలుసునా?"— అన్నాడాయన.

అచల జవాబేమీ చెప్పలేదు. ఆయన తర్జని ఝళిపిస్తూ అన్నాడు— "ప్రోనోటు చింపిపారేసి నాకు లంచం పారేద్దామనుకున్నాడు కామాలు. ఆ పప్పులుడకవని గట్టిగా చెప్పేస్తాను. ఈ యిల్లు నా చేతులు మీదిగానే అమ్మేసి, అప్పుతీర్చి, నాయిష్టం వచ్చినచోటికి వెళ్లిపోతాను. నన్నెవరూ ఆపలేరు, చెబుతున్నాను."

ఈసారి అచల జవాబు చెప్పింది. మొదట ఆమె సంకోచించింది. కాని ధైర్యం తెచ్చుకుని విచలకంఠాన అన్నది. — "అప్పుతీర్చకండా, మీరు యిల్లు నాకిచ్చిపోవాలని నేను కోరుతున్నానా నాన్నా! నువ్వు తీర్చకపోతే నేనైనా ఈయిల్లు అమ్మి తీర్చవలసినదాన్నే"

కేదారబాబు మరీ ఉత్తేజితుడైనాడు. "మీరు చేసినపనికి నేను నలుగురిలో తలెత్తుకు తిరిగేందుకు వీల్లేకండా వచ్చింది. నీకు తెలుసును?"

"ఊహు నాకు తెలియదు మీకు అంత అవమానకరమైనపని నేను నిజంగా ఏమైనా చేసి ఉన్నట్టయితే మళ్లీ ఇలా నాముఖం చూపించేదాన్నే కాదు మీ కెవరికీ. అవ్వాళ్లో ఏమున్నా, ఏమి లేకపోయినా ప్రాణం తీసుకోటానికి బావులు లేకపోలేదు"—ఆమె కంఠం రుద్ధమైంది "నువ్వు పరిస్థితులను అపార్థం చేసుకున్నావు. అందుచేతనే నిన్నటినించీ నువ్వు పెడుతూన్న రంపపుకోతను సహించి ఊరుకున్నాను. లేకపోతే..." దుఃఖ సంరుద్ధమై ఇక కంఠం పెగల్లేదు. పైటచెరగు ముఖాన కప్పుకుని ఏడుపు అపుకుంటూ గబగబా గదివిడిచి వెళ్లిపోయింది.

కేదారబాబు విమూఢచిత్తుడైనాడు. కూతురి ప్రవర్తన నింద్యమైనదని అయన నమ్మాడు. ఆమె మూలాన్నే తనకు కోపం వచ్చింది; హృదయం గాయపడ్డది; దుఃఖం కలిగింది. కాని అతని ప్రవర్తనని ఆమె గర్హించి, తిరస్కరించి. తీవ్ర అభిమానంతో ఏడుస్తూ వెళ్లిపోయింది. ఆమె ఇలా చేస్తుందని ఆయన అనుకోలేదు అలాగే కానేపు నిల్చుని ఉండి, మెల్లిగా కూచుని, గొణుక్కున్నాడు—"ఛేవ్, ఇంకో కాండ ఆరంభమైంది"

అలాగే ఆయింట్లో ఆ తండ్రీకూతుళ్లు ఎలా రోజులు వెళ్లబుచ్చారో ఆ అంతర్యామికే తెలియాలి. ఎనిమిది పది రోజులు గడిచాయి, అచల తన

గది విడిచి బైటికి వచ్చేదికాదు. ఇంట్లో నౌకర్లకుకూడా తన ముఖం చూపించలేకుండా ఉంది. ఒకనాడు వరండాలో కూచుని వీధిలో వచ్చేపోయే వాళ్లను చూస్తూ ఉంది.

అది చలికాలం. మధ్యాహ్న సమయం. ఏదో విషాదచ్ఛాయలు పూర్తిగా ఆవరించాయి ఆమె హృదయాన్ని. కళ్లు తెరచుకునే ఉన్నా ఆమెకు ఏమీ కనిపిస్తున్నట్లు లేదు. కాని అలవాటు చొప్పున చుట్టుప్రక్కల ఏమి జరుగుతున్నదీ గ్రాహ్యంగానే ఉంది. ఇంతలో సురేశ్‌బాబు బండి తమగృహావరణలో ప్రవేశించడం ఆమె గుర్తించింది. వెంటనే ఆమెముఖం కాంతి విహీనమైపోయింది. పోలీసు కనుపించగానే దొంగ అదరాబాదరా పరుగెత్తుకుపోతాడు. అచల కూచున్నచోటనించి లేచి ఉలికిపడుతూ తన గదిలోనికి పోయింది తలుపు వేసుకుంది.

ఒక పదినిమిషాలు తరువాత అడుగులచప్పుడు వినిపించింది. "అమ్మా! అచలా! మేలుకునే ఉన్నావా?"— అంటూ తండ్రిగారి వాత్సల్యపూర్ణ కంఠస్వరం వినిపించింది బైటనించి.

అచల ఏమీ జవాబు చెప్పకపోవటంచేత ఆయన ఇంకా ప్రేమగా పిల్చాడు— "సాయంత్రం కావచ్చింది అమ్మాయి; లే సురేశ్‌బాబు బొమ్మ నిన్ను తీసుకుపోదామని వచ్చింది. మహిమ్‌కు చాల సుస్తీగా ఉందిట"

అచల వెంటనే తలుపు తెరచింది. బొమ్మ లోనికి వచ్చింది. అచల ఆమెకు పాదాభివందనం చేసింది.

కేదార్‌బాబుకూడా గదిలో ప్రవేశించి, మంచంమీద ఒక ప్రక్కన కూచుని కూతురుతో చెప్పాడు — "మీరంతా బయలుదేరి వచ్చేశాక మహిమ్‌కు పెద్దపెట్టున జ్వరంవచ్చిందట! ఇల్లు తగలబడిపోయిన చింతవల్లనో, ఆ రాత్రి అంతా మంచులో బైటఉండటంచేతనో, మితిమించిన పరిశ్రమమూలానో — ఎన్నో కారణాలవల్ల జ్వరంతగిలి ఉంటది." అంటూ సురేశ్‌బాబు బొమ్మకేసి తిరిగి అన్నాడు — "వీళ్లను ఆనాడు పంపించేసి ఏ ఖబురూ తెలుపకుండా ఇన్నాళ్లు ఊరుకున్నాడేమా అని గాభరాపడిపోతున్నాను. సురేశ్‌బాబు వెయ్యేళ్లు బ్రతకాలి. అతడువెళ్లి జాగ్రత్తగా మహిమ్‌ను ఇక్కడికి తీసుకురాక పోయినట్లయితే ఏమయ్యేదో ఆ భగవంతుడికే తెలియాలి" — స్నేహపూర్ణ — అనుతాపంతో ముసలాయనకంఠం బాష్పాకులమైంది.

అచల తలవంచుకుని నీరవచిత్రయై నిల్చుంది. అంతా విన్నది. కాని అతృప్త పడుతూ ఏమీ ప్రశ్నలడగ లేదు; చంచలత ప్రకటించ లేదు.

సురేశ్ బాబు బామ్మ అచలాదేవి బుజం మీద ప్రేమగా తడుముతూ శాంతంగా, మృదువుగా చెప్పింది—"పరవాలేదులే అమ్మాయి! రెండు రోజుల్లో నయమైపోతుంది"

అచల ఏమీ పలక లేదు. మరొకసారి ఆమెకు పాదాభివందనం చేసింది పక్క ఎత్తి బయలుదేరి పోవటానికి ఉద్యుక్త అయింది.

చలికాలం; సాయంత్రమైంది; చలిగాలి ఒళ్లు కరుస్తున్నది. అందుకు తగిన దుస్తులు వేసుకోకుండా, కాలికి జోడుకూడా లేకుండా అచల బయలు దేరింది. అది చూచి ఆమె తండ్రి హృదయం ద్రవించింది. "పద అమ్మాయి! నేనుకూడా వస్తున్నాను"—అంటూ స్లిప్పర్లు తొడుక్కుని అందరికన్నా ముందుగా మెట్లు దిగాడాయన.

# 23

అచలాదేవిని ఇప్పుడు మిక్కుటంగా బాధిస్తూన్న చింత ఏమిటంటే తాను మహిమబాబు అర్ధాంగి అయి వుండికూడా ఏనాడూ అతని మనః క్లేశాలను పంచుకోలేదు. అతని కెప్పుడూ తన సానుభూతి లభించనే లేదు. ఆ బాల్యస్నేహితుడై వుండి సురేశ్ కూడా ఇలాగే బాధపడ్డాడు. లుబ్ధాగ్రేసరుడు. తన ధనాన్నివలె మహిమబాబు తన అంతర్యాన్ని అత్యంత గుప్తంగా ఉంచుకుంటాడు. అతని కెప్పుడు ఏమీ సహాయము అవసరమో—దేని మీద అతనికి అభావమో - ఏది అతనికి బాధాకరమో - ఎవరికీ తెలియదు.

తాత ముత్తాతల కాలం నాటినించీ నివాసయోగ్యమై ఉండిన యిల్లు తగలబడి పోతూంటే మహిమ్ ఒకమూల భస్మీభూత స్థాణువలె నిల్చొని చూస్తూ ఉన్నాడు. అప్పు డతని హృదయం ఎంత క్షోభించిందో ఆమె గ్రహించుకో లేక పోయింది. అంత చిన్న తనంలో మృణాళిని అనాథ అయి పోటం మహిమ్‌కు ఎంతదుఃఖకారణమైందో అచల ఊహించుకో లేక పోయింది ఆనాడు "నేను మిమ్మల్ని ప్రేమించటంలేదు"—అని తాను నిస్సంకోచంగా చెప్పేసినప్పుడు అతని హృదయానికి ఎంత తీరని గాయం తగిలిందో కూడా

ఆమె ఊహించుకోలేకనే పోయింది ఎంత మనః కష్టం కలిగినా పైకి గంభీ
రంగా, నిర్వికారుడుగా కనిపిస్తూంటాడు కాబట్టి ఆమెకు అతని అంతర్యం
అర్థం కాలేదు. నాడు స్టేషన్‌లో ఆమె మాటిమాటికి మహిమబాబు శాంతి
పూర్ణ ముఖబింబాన్ని చూస్తూ ఆశ్చర్యపడ్డది. "ఈయన కింత సహనశక్తి
ఎక్కడిది? ఇన్ని కష్టాల్లో కూడా ఈయన గుండె ముక్కలు కాదెందు
చేత?"—అని ఇల్లు చేరేవరకూ ఆమె కదే ఆలోచన

మనశ్చింతవల్లా, శరీరపరిశ్రమవల్ల, ఏదో మామూలుగా వచ్చిన జ్వరమే
ఐవుంటుందని కేదారబాబు చెప్పినప్పుడు ఆమెలో రేగిన భావం—అది
కేవలం ఉత్కంఠే అనటానికి వీల్లేదు.

సురేశ్ బాబు రబ్బరు టైర్లబండి గబగబా దౌడుతీస్తుంది. బొమ్మ
మౌనంగానే కూచుంది ఆమెపక్కన అచల రాతిబొమ్మలా చలనంలేకండా
కూచుంది. కేదారబాబు మాత్రం బండి కిటికీ గుండా వీధిలోకి చూస్తూ అన
ర్గళంగా ఏమేమో వాగేస్తున్నాడు—సురేశ్ వంటి దయాళుడు, బుద్ధిశాలి,
కార్యవాది ఈ ప్రపంచంలో మరెవరూ లేరు అప్పటించీ మహిమ్‌బాబు హాతా
నికి సురేశ్ నొచ్చుకుంటూనే ఉన్నాడు పాపం! నా అన్నవాళ్లు లేరు,
డాక్టరంటూ లేడు—కేవలం దొంగలకూ, గండుకుక్కలకూ నివాసయోగ్య
మైన కుగ్రామంలో వెళ్లి కాపురం పెట్టినందుకు-ఎప్పటికైనా మహిమ్ మంచి
శిక్షే అనుభవిస్తాడు - అంటూ ఇలా ఏదో ప్రలాపిస్తూనే ఉన్నాడు.

అందుకు కారణం కూడా ఉంది. స్వభావతః కేదారబాబు అంత
కేలిక ప్రకృతి గల మనిషికాదు. ఇవాళ అతని హృదయంలోని నిగూఢ ఆనం
దం అవ్యాహతమై ప్రవహిస్తుంది తన పరమ మిత్రుడైన సురేశ్‌తోడి విరో
ధం - ఏకైక పుత్రికపట్ల కోపం - ఇన్నాళ్లనించీ గుండెమీద కొండలాగ
ఉండిన అవమానం అన్నీ ఈనాటితో, సురేశ్ బాబు బొమ్మ అనుకోకండా
తనయింటికి రావటంతో అంతరించి పోయినవి. మహిమబాబు జ్వరాన్ని
గురించి ఆయన గాభరా పడుతున్నదేమీ లేదు. బహుశః నాటిరాత్రి పైట
పొంచూలో తిరిగినాడేమో - కాస్త జ్వరం తగిలి వుంటుంది, రెండు మూడు
రోజుల్లో నయం కావచ్చునని బొమ్మగారు చెబుతూనే ఉండాడేమో. బహు
శః తెల్లవారే సరికి జ్వరము తగ్గిపోతుంది. మహిమ్‌బాబు జబ్బును గురించి
ఆయన ఆలోచించింది. అంతవరకే కాని—సురేశ్ స్వయంగా వెళ్లి మహి
మను ఇక్కడికి తీసుకువచ్చాడు, పైగా అచంచలం బొమ్మను కూడా పం
పించాడు. ఈవిషయాలు కేదారబాబు మనస్సును ఎక్కువగా ఆకర్షించాయి

కూతురికీ అల్లుడికీ మధ్య ఏవో మనస్పర్థలు కొంత ఉన్నాయి. దానికి చెప్పిన విషయాలు ఆయన మరిచిపోలేదు. జరిగినదంతా వారి దాంపత్య కలహాల యొక్క ఫలితం అని తెలుస్తూనేవుంది. కాగా ఊరికే ఏవో వాగుతున్నాడే గాని హృదయంలో సంకోచంగానే ఉంది. తానిక్కడికి వచ్చి నిరపరాధి, సజ్జనుడు అయిన మహిమ్‌కు తన ముఖం ఎలా చూపించగలడు?

అచల నీరసంగా కూరుని ఉంది! అంత తీవ్రమైన జ్వరమేమీ ఉండదని ఆమె ఊహించుకుని ఉంటుంది. కాని సురేశ్ ఆయన్ని ఎలా ఒప్పించి ఇక్కడికి తీసుకురాగలిగాడో ఆమెకు దురూహ్యంగా ఉంది

చీకటిపడింది వీధుల్లో మునిసిపల్ దీపాలు వెలిగాయి. బండి సురేశ్ బాబు భవనం ముందు ఆగింది. కేదారబాబు ముఖం బైటికి పెట్టి చూచి— "ఇంకా రెండు బండ్లు ఆగివున్నాయే ఇక్కడ!" అని ఉద్విగ్నచిత్తుడై పలికాడు.

అచలకూడా చూచి చకిత అయింది. అటువైపు ముంగిలివద్ద సురేశ్ మరొక ఆంగ్లేయ వేషభాషల్లోఉన్న వ్యక్తితో మాటాడుతూ ఉన్నాడు. ఆయన ఎవరో డాక్టరు అయివుంటాడని తెలుస్తూనేవుంది. చివరకాయన వెళ్లిపోయాడు. సురేశ్ అక్కడే నిలబడివున్నాడు కేదారబాబు కేకపెట్టాడు— "మహిమ్‌కు ఎలావుంది సురేశ్ బాబూ! జ్వరమేమిటి? చప్పున చెప్పు"

"వచ్చారూ! రండి" అన్నాడు సురేశ్.

కేదారబాబు మరీ ఆతృతగా అడిగాడు— "ఏంజ్వరం అదీ?"

"జ్వరంపేరు చెప్పినంతమాత్రాన మీకు అర్థంకాదు. ఉష్ణం బాగా వుంది. శ్లేష్మం ఎక్కువైంది. బండిదిగిరండి మరీ! వాళ్లను దిగనీయండి"

కేదారబాబు బండిదిగే ప్రయత్నమేమీ చెయ్యకుండానే — "కాస్త శ్లేష్మం ఎక్కువైందీ? ఆమాత్రానికి నువ్వే చికిత్స చేయలేకపోయావా? నేను కుర్రవాణ్ని కాదు సురేశ్! ఇద్దరు డాక్టర్లు కావలసివచ్చింది. అందులో పెద్ద ఆంగ్లవైద్యునికూడా పిలిపించావు. అంత యెక్కువ..." అంటూ ఆయన కంఠస్వరం కంపించింది.

సురేశ్ దగ్గరకువచ్చి చెయిపట్టుకుని ఆయన్ని బండీ దించాడు. "బొమ్మా! అచలను నువ్వు లోపలికి తీసుకుపో. నేనూ వస్తున్నాను" అన్నాడు.

అచల ఇంకేమీ ఏమీ అడగలేదు. ఆ చీకటిలో ఆమె ముఖం ఎవరికీ కనిపించలేదు. [illegible] నడిచి వస్తున్నప్పుడు ఆమె పాదాలతో పాటు [illegible] మనస్సు కూడా ముద్దైపోయి బొమ్మ వెనకాల ఇంటోకి వెళ్లింది.

[illegible] నిముషాలకు ఆమె రోగి ఉన్న గదిలోనికి వచ్చింది. [illegible] విషయాలు కామాలు మహిమ్ [illegible] పేలుతున్నాడు, అమాటలు [illegible] అది జ్వర తీవ్రత చేతనైన అర్థరహిత ప్రలాపమనీ [illegible] మంచివచ్చినవనీ ఆమెకు అర్థమైంది. ఒక నిమిషంసేపు మనస్సుని [illegible]పట్టుకుని తిన్నగా స్థైర్యం తెచ్చుకుంది.

ఇంతసేపటినుంచీ రోగికి తలవైపున కూర్చుని అతని నుదుటిమీద మృదువుగా మంచుగడ్డల సంచీ అద్దుతూన్న యువతి అచలను చూడగానే సాంత్వనపూర్వకంగా లేచివచ్చి ఆమెకు నమస్కరించి నిల్చుంది. ఆమె వైధవ వేషంలో ఉన్నది. వితంతువులకు సహజమైన తీవ్రవైరాగ్యం ఆమె ముఖంలో నిబిడంగా వ్యాపించి పోయింది. మసగా ఉన్న ఆ దీపకాంతిలో మొట్టమొదట ఆమె మృణాళిని యని అచల గుర్తించలేకపోయింది. ఒకరికొకరు ఎదురుగా ఉలుకక పలుకక స్తంభాల్లా నిల్చుండిపోయారు. అచలాదేవి అపాదమస్తకమూ ఎందుకో గజగజ వొణికింది. ఏదో మాటాడ వలెనని ఆమె పెదవులు కంపించాయి. కాని మాటయేమీ పెగల్లేదు. మరుక్షణమే ఆమె మూర్ఛితశరీరం తెగిపోయిన లతవలె మృణాళిని పాదాలముందు వాలిపడ్డది.

స్మృతి రాగానే అచల కళ్లు విప్పి చూచింది. తండ్రి తొడమీద తల పెట్టుకుని సోఫాలో పడుకుని ఉన్నట్టు తెలుసుకుంది. ఒకదాసి ఆమె ముఖాన పన్నీరు చిలుకుతూవుంది. చేరువనే సురేశ్ నిల్చుని విసనకర్రతో విసురుతూ ఉన్నాడు.

జరిగిన పరిస్థితి ఆమెకు చప్పున జ్ఞాపకంరాలేదు. జ్ఞాపకం రాగానే లజ్జాన్వితే అయింది. వెంటనే లేచికూచుందామని ప్రయత్నిస్తూంటే కేదారబాబు అడ్డగించి—"ఇంకాసేపు విశ్రాంతితీసుకో. అప్పుడే లేవవలసిన అవసరం ఏమీ లేదు"—అన్నాడు.

"పరవాలేదు నాన్నా!" అంటూ మళ్లీలేవటానికి ప్రయత్నించిందామె. కేదారబాబు బలవంతంగా ఆపి —"లేవబోకు అచలా! కాస్త నిద్రపోవటానికి ప్రయత్నం చెయ్యి"— అన్నాడు.

సురేశ్ కూడా అప్పటికప్పుడు కేదారబాబుకు అనుసరించి ఆపై మాటలు చెప్పను. అందుకే జవాబుగా అచల తండ్రిగారి చేతిని పక్కకు నెట్టి, నెమ్మదిగా లేచి నిల్చుని— "నేనిక్కడ నిద్రపోయేందుకు రాలేదు నాన్నా! నాకిప్పుడేమైందనీ? ఏం భయం లేదు. అక్కడికే వెళ్లాలి"— అంటూ ఎవరి ప్రత్యుత్తరమూ ప్రతీక్షించకుండానే వెళ్లిపోయింది.

ఆ యింట్లో గదులూ, దాలానులూ ఆమెకు బాగా గుర్తే. రోగివున్న గదిని ఆమె తేలిగ్గానే తెలుసుకుంది. ఆ గదిలోకి రాగానే— "రావమ్మా అక్కా! వచ్చి కాస్త నువ్విక్కడ కూచో. నేను సంధ్యావందనం చేసుకుంటూను పోయి. మంచుగడ్డసంచీ జారిపోనీకుండా జాగ్రత్తగా పట్టుకోవాలి సుమా!"—అంటూ మృణాళిని అచలకు తన చోటిచ్చి వెళ్లిపోయింది.

# 24

తీవ్రసన్నిపాత జ్వరం అదుపులోకి వచ్చేసింది. క్రమేణా మహిమ బాబుకు స్వాస్థ్యం చిక్కగలదని అందరికీ నమ్మకం చిక్కింది. గండం గడిచింది పరవాలేదనుకున్నారు. మత్తు వీడిపోయింది; అర్థహీన ప్రలాపం కూడా సమసిపోయింది.

పదిరోజులు గడిచాయి. ఒకనాడు మూడుగంటలప్పుడు మహిమ్ శాంతంగా నిద్రపోతున్నాడు. ఆ సంవత్సరం అన్నిచోట్లా చలి కాస్త విపరీతంగానే ఉంది. పైగా వర్షాలుకూడా పడుతున్నాయి. రోగి పడుకున్న మంచానికి పక్కనే ఒక తివాచీమీద అందరూ ముడుచుకు కూచున్నారు. అందరి ముఖాల్లోనూ ఒకవిధమైన తృప్తి ప్రకటమౌతున్నది. సురేశ్ బాబు బామ్మమాత్రం ఏదో పనిపాటల్లో ఉంది. కేదారబాబు యింకా యింటినించి రాలేదు.

మృణాళిని సురేశ్ బాబుకు నమస్కారం చేస్తూ అన్నది— "ఇక నాకు సెలవు ఇప్పిస్తే వెళ్లిపోతాను సురేశ్ బాబూ! ఓట్టు చలికాలం; ఇంటివద్ద మా ముసలిఅత్తగారు పాపం ఏమైపోయిందో!"

"ఇంకా ఆవిడ ప్రపంచంలో బ్రతికివుండాల్సిన అవసరం ఉందా యేమిటి? ఊహు. ఆమెకోసమని నువ్వు వెళ్లనక్కరలేదు."

మృణాళిని ఒక దీర్ఘ నిశ్వాసాన్ని అణుచుకుంది. మరికాసేపటికి నవ్వుతూ సురేశ్ కేసి చూచి అన్నది—"కేవలం ఆమాట నువ్వు అనటమే కాదు సురేశ్ బాబూ! నేను కూడా అనేకసార్లు 'ఈపాటి కామె పరలోక ప్రయాణం చేసివుంటేనే బాగుండేదని' అనుకుంటూవచ్చాను. కాని పుట్టించేవాడూ, గిట్టించేవాడూ అయిన ఆ ప్రభువుకు బుద్ధి పుట్టద్దూ! అప్పుడుగాని ఈ ప్రపంచ దుఃఖాలనించి అనేకమందికి విముక్తి చేకూరదు"

అచల ఇంతసేపటినించీ మౌనంగానే ఉంది. "అంటే— ప్రజలుకోట్లకొలది దుఃఖా లనుభవిస్తూకూడా చావుకోరరని అంతర్యామికి తెలుసునన్న మాట! అదేనా నీభావం?" —అని అడిగింది అచల—మృణాళిని మాటలను బట్టి ఆమె చనిపోయిన భర్తను జ్ఞాపకం తెచ్చుకుని—

మృణాళిని ముఖంలో ఒక నిగూఢవేదన లీలగా కనిపించింది" అది గాదమ్మా అక్కా! మానవుడు నిజంగా చచ్చిపోవాలని కోరే సమయం ఎప్పుడో వచ్చి తీరుతుంది. ఒకనాడు అర్ధరాత్రివేళ నాకు మెళుకువ వచ్చి లేచి చూచాను. మా అత్తగారు మంచం మీద లేదు, దేవతార్చన గది తీసివుంది. నేను మెల్లిగా వెళ్లి ద్వారంచెంత నిలువబడ్డాను ఆమె దేవునిముందు నిల్చుని కన్నీళ్లొత్తుకుంటూ మృత్యుభిక్ష వేడుకుంటోంది—'దేవా! నా జీవితంలో ఏఒక్కనాడైనా మనోవాక్కర్మలా నిన్ను సేవించి వున్నట్టయితే నన్ను దబ్బున నీచెంతకు తీసుకుపో నాకు ముక్తి అక్కర్లేదు. నా కొడుకు పోయి నేను బ్రతికి వుండలేను. కోడలి కిక నాముఖం చూపించలేను...' అని ప్రార్థిస్తున్నది" ఆమాటలు చెబుతూ చెబుతూ కాలువగట్టిన కన్నీళ్లు తుడుచుకుంది మృణాళిని.

మాతృహృదయంలోని అవ్యక్తవేదన ఆమె ప్రార్థనలో ఎంత అంతర్హితమై ఉన్నదో అందరికీ సులభగ్రాహ్యమే. సురేశ్ బాబు కన్నులు చెమరించాయి. ఇతర్ల మామూలు దుఃఖాలకే అతనికి గుండె నీరౌతుంది పాపం ఆముసలావిడ పుత్రమరణ శోకగాథ అతని గుండెలో చీట్లను పెనవేసింది. కొంతసేపు నిస్తబ్ధుడై నేలచూస్తూ ఉండిపోయి చివరకు గద్గద స్వరాన అన్నాడు— "సరే వెళ్లు పాపం! నీ ముసలి అత్తగారిని సేవించుకుంటూ నీ కర్తవ్యాన్ని పాలించుకో. నేను నిన్ను ఉండమనలేకపోతున్నాను. దేశగౌరవాన్ని కాపాడేవాళ్లు నీలాంటి స్త్రీలే. అట్టివాళ్లు ఇంకే దేశంలోనూ లేరు—" అంటూ ఒకసారి అచలకేసి చూచాడు. ఆమెమాత్రం నిరుత్సాహంగా కూచుని కిటికీ

లోనించి ఆకాశాన మేఘశకలంకేసి చూస్తోంది ఆమె. యేమీ మాటాడలేదు.

కాని మృణాళిని ఆ స్తోత్రపాఠానికి సిగ్గుపడిపోయింది. విషయం మార్చివేయాలన్న తలంపుతో బలవంతాన నవ్వు తెచ్చుకుని అన్నది—"అలాగనా నీకు అన్ని దేశాల సంగతులూ తెలుసునా యేం? మహిమ్‌కంటే నువు పెద్దా? చిన్నా?"

ఈ అద్భుత ప్రశ్నకు సురేశ్ నవ్వాడు—"అలా అడుగుతున్నావేం?"

"మహిమ్‌బాబును నేను 'బావా' అని పిలుస్తున్నా. మేము అన్నా చెల్లెలులా పెరిగాం. నువు నాకు చిన్నన్నయ్యవా? పెద్దన్నయ్యవా? గప్పున చెప్పు!"

అచలదృష్టి ఇటు ఆకర్షితమైంది. మృణాళిని తన్ను 'అక్కా' అని అకస్మాత్తుగా పిలువ నారంభించి, తనచేత 'అక్కా' అని పిలిపించుకున్న రోజు జ్ఞాపకంవచ్చింది. సురేశ్‌కు ఆసన్నివేశం తెలియదుగా! అందుచేత మృణాళిని ప్రశ్నకు అత్యంతం ఆశ్చర్యపడుతూ, కుతూహల దృష్టిని ఆమెను అవలోకిస్తూ, మందహాసపూర్వకంగా—"చిన్నయ్యనే! మహిమ్‌కన్నా ఆరు నెలలు చిన్నవాణ్ణి"—అన్నాడు.

"అయితే చిన్నన్నయ్యా! రేపు ఉదయం బండికి నన్నింటికి తీసుకుపోయి దిగబెట్టివచ్చే మనిషిని ఎవరినైనా చూడు తప్పకుండా, దయవుంచి"

ఆమె వెళ్లిపోవటానికి అనుమతి సురేశ్ ఇంతకుముందే ఇచ్చాడు. కాని మర్నాడే ప్రయాణం కానున్నదని అతడు ఊహించలేదు. "ఇంకా రెండు మూడు రోజులైనా ఉండిపోకూడదూ! మహిమబాబు భారమంతా ఇన్నాళ్లూ నీచేతుల్లో పెట్టి మేము నిశ్చింతగా ఉన్నాం. అస్తమానం ఇరవై నాలుగు గంటలూ కంట్లో వత్తులు పెట్టుకుని రోగిని సాకి ప్రతికించావు. అంతటి శ్రద్ధ, సేవానిరతి ఏ ఆసుపత్రిలోనూ ఏ నర్సులోనూ చూడలేదు నేను, జానా అచలా!"

అచల తలమాత్రం కదిలించి ఊరుకుంది.

"నేను చేసింది ఏముంది గనక? అటు ఎవరిసొత్తో వారికే ఒప్పచెప్పి వెళ్లిపోతున్నాను. లేకపోతే నాకుమాత్రం వెళ్లటానికి కాళ్లాడతాయా? ఇప్పుడు అదరబాదరా పరుగెత్తుకు రావలసివచ్చింది, మీకు తెలుసుగా! ఈ సంవత్సరంలో ఇంటిదగ్గర పరిస్థితులు ఎలావున్నాయో చూసుకోలేదు.

కాబట్టి సెలవిప్పిస్తే రేపే వెళ్లిపోతాను. మళ్లీ చిన్నన్నయ్యా ఎప్పుడు కబురు చేస్తే అప్పుడే వస్తాను"—అన్నది నవ్వుతూ మృణాళిని.

"కాని మృణాళినీ! ఆ కుగ్రామంలో ముసలి అత్తగార్ని సేవిస్తూ సంధ్యాపూజలు చేసుకుంటూ నువ్వు కాలం ఎలా వెళ్లబుచ్చగలవో నాకేమీ అర్థంకావటంలేదు" అన్నాడు సురేశ్ కాసేపు ఊరుకుని.

మృణాళిని ముఖంలో మళ్లీ అవ్యక్తవేదన తొణికింది ఒకసారి. వెంటనే ఆమె మందహాసం తెచ్చుకుని చెప్పింది—"కాలాన్ని గడిపేభారం నాదేమీ లేదు చిన్నన్నయ్యా! కాలాన్ని సృష్టించినవాడే దాన్ని నడిపిస్తాడు"

"సరేగాని మరి మీ ముసలత్తగారు ఇంకా ఎన్నాళ్లో బ్రతుకదు. మహిమబావేమో డాక్టర్లు చెప్పినప్రకారం పడమటి వూళ్లలో ఎక్కడికైనా ఆరోగ్యం నిమిత్తం వెళ్లక తప్పదు. నువ్వు ఒక్కదానివీ అక్కడ ఎలా వుంటావు?"

"ఆయనకే తెలియాలి"-అన్నది మృణాళిని నవ్వుతూనే పైకి వేలెత్తి చూపుతూ.

సురేశ్ అప్రయత్నంగా ఒకదీర్ఘనిశ్వాసం విడిచాడు. "కాని నీకా విషయాల్లో నమ్మకం లేదు కాబోలు!" అన్నదామె.

"ఏ విషయాల్లో?"

"భగవంతుడే అన్నింటి —"

"ఔను నాకు విశ్వాసం లేదు."

"అయితే మీరిప్పుడు నిట్టూర్పు విడిచింది మా అజ్ఞతకు విచారిస్తూ నన్నమాట! అంతేనా?"

సురేశ్ వెంటనే ఏమీ ప్రత్యుత్తరం చెప్పలేదు. చివరకన్నాడు—"మనుష్యులు తమ అజ్ఞాత భవిష్యత్తును గూర్చిన భారం ఎ[illegible]జ్ఞాత భగవంతుని మీద వెయ్యటం, ఆమహాశయుడు మరీమరీ ఉపేక్ష చూపుతూ ఉండటం, ఈ వ్యవహారమంతా నేను ఎరిగి వున్నదే. కాని ఆవిషయాలన్నీ మనం భక్షింపబడ్డ అమ్మాయి! అందువల్ల నామీద నీకు కొంత ద్వేషం పుట్టవచ్చు."

అందుకు సమాధానంగా మృణాళిని వంగి [illegible]ని పాదాలు స్పృశించింది.

"అరె, ఏమిటాపని?"—అన్నాడు ఆశ్చర్యంగా సురేశ్.

"ఏముందీ?"

"మంచీలేదు, చెడూ లేదు అకస్మాత్తుగా నా పాదాలు నువ్వు—"

"చిన్నన్నయ్యకు పాదాభివందనం చెయ్యటానికి శుభగడియలకోసం ఎదురు చూడాలా?" అని పకపకా నవ్వుతూ లేచిందామె

"భలే చెల్లెలివే లే" అంటూ సురేశ్ స్నేహపిచ్ఛిలంగా నవ్వి, అటు కేసి తిరిగి అచల వైపు చూచాడు ఎందుచేతనో ఆమెముఖం శ్రావణమాస, ఆకాశంవలె మేఘావృతమై ఉంది అతనికి ఆశ్చర్యమైంది. ఆశ్చర్యాన్ని అణచుకుని తద్విషయమై అతడేమీ ప్రశ్నవెయ్యకముందే అచల తొందరగా మృణాళిని వెంట ఆగది విడిచి వెళ్ళిపోయింది.

సురేశ్ అక్కడే స్తబ్ధుడై కూచుని ఆలోచనా ప్రపంచంలో పడ్డాడు మృణాళిని తనకు పాదాభివందనం ఎందుకు చేసింది? అందులో ఏమైనా గూఢభావం ఉందా? ఏముంటుందీ? అచలాదేవి అంత ఉదాసీనంగా ఉండిపోయిందేం? మౌన ముగ్ధయై లేచిపోయిందికూడాను. ఎంత ఆలోచించినా సురేశ్‌కు ఏ విషయాన్ని గురించీ సమాధానం చిక్కలేదు.

మళ్ళీ మృణాళిని కలుసుకుని మాటాడేవరకూ సురేశ్‌కు అవకాశం చిక్కలేదు. మరునాటి ఉదయం అచల ఒంటరిగా కూచునిఉంది. "ఒక సంగతి అడుగుతాను; నువ్వు సరైన జవాబు చెప్పాలి"—అన్నాడు సురేశ్ ఆమెను సమీపించి.

అచల సిగ్గభినయించింది. అతను అడిగే విషయమేమిటో ఆమె ఊహించుతుంది. లోగడదినం మృణాళిని విచిత్రప్రవర్తనకు తానిప్పుడు వ్యాఖ్యానం చెప్పాలి. "ఏమిటా సంగతి ?"—అని అడిగింది.

"నిన్న మృణాళిని అకస్మాత్తుగా నాపాదాల్ని స్పృశించింది. నువ్వేమో చాలకోపం తెచ్చుకుని వెళ్ళిపోయావు. ఆమె అత్తగారి చావుమాట తెచ్చాను: అందుకోసమేనా ?"

తాను ఆలోచించని జవాబుకూడా అతని ప్రశ్నలోనే ఇమిడి ఉండటం ఆమె గమనించి అన్నది—"ఔను మరి! మీరామాట అనటం ఏమంత బాగుందీ? పాపం ఆమెకు భర్తపోయాడుకదా! ఉన్న అత్తగారుకూడా [illegible]లే ఆమె నిస్సహాయస్థితిని ఊహించుకోలేరూ ?"

సురేశ్ చాల నొచ్చుకున్నాడు. "నిజమే నేను చాల [illegible]యంగా [illegible]డాను. కాని ఆమె ఇంకా ఎక్కువరోజులు బ్రతకదన్న సంగతి మృణా

కానికూడా తెలుసు. అయినా ఆమె నిస్సహాయస్థితిలో ఉంటే మనం చూస్తూ "ఊరుకుంటామా యేమిటి ?"

"మనం అలా ఓదార్పుమాట ఏమైనా అన్నామా మరి! పైగా 'నువ్వు ఒంటరిదానివై పోతావు అన్యాయంగా' అంటూ భయపెట్టారు కూడాను.

సురేశ్ పశ్చాత్తాపసూచకంగా అన్నాడు—"కాబట్టి ఆమె ఎదుట ముందు కాస్త సాంత్వన వాక్యాలు చెప్పటం మంచిది కాదూ. 'నీకేం భయం లేదులే అమ్మాయి...' అంటూ అలా—" ఆర్ద్రోక్తిలో అతని కంఠం జాలి కన్నీటితో అవరుద్ధమైపోయింది.

అచల అతని ముఖంకేసి చూస్తూ సమ్మోహనంగా నవ్వింది. పరాయివాళ్ల దుఃఖాలకు గుండె కరిగిపోయే ఆయువకునికి అనేక సత్కారాలు ఆమెకు జ్ఞాపకం వచ్చాయి. "మీరు ఆమెకు ఓదార్పు చెప్పవలసిన అగత్యం ఏమీ లేదు. భయపెట్టకుండా ఉండటం మాత్రం అవసరం. అంత అవసరం వచ్చినప్పుడు చూస్తూ ఊరుకోరుగదా !"

ఆమె ఔదార్యం అతన్ని ఆవేశపూరితుని చేసింది ఆవేశంలో తన్ను తాను విస్మరించి అతడామె చేతిని అకస్మాత్తుగా పట్టుకుని జోరుగా ఊపి— "అహ్! వేలు విలువ చేసే మాట చెప్పావు అచలా!" అంటూ వెంటనే యథాస్థితికి వచ్చి సిగ్గుపడుతూ చేయి విడిచి ఆక్కడినుంచి పారిపోయాడు.

మొదట సురేశ్‌లో పొడచూపిన ఆవేశం పరార్థచింతన చేత కలిగిన ఆనందజన్యంగా కనుపించింది కాని అతడు సిగ్గుపడి అలా పారిపోవటంతో అందులో కొంత కాలుష్యం ఉన్నట్టు అచలకు తోచింది ఆమె యావత్తు శరీరం పులకించింది. నుదుటిమీద చెమట చుక్కలు పొటమరించాయి. గుండెలో రక్తం విద్యుద్వేగంతో ప్రవహించింది. నిర్జీవయై ఆ చేరువనే ఒక కుర్చీలో వాలి కూచుంది.

కొంత సేపటికి ఆమెకు కాస్త శాంతి చిక్కింది. కాని భర్తశయ్య మీద వెళ్లి కూచోటానికి కొందువల్లనో ఆమెకు హృదయంనించీ భయంభయంగా ఉంటోంది.

మృణాళిని వెడతానంటూనే మరి రెండు రోజులున్నది. మూడవనాడు ప్రయాణమై వెడుతూ సుహాసితో చెప్పిపోదామని వచ్చింది అతడు [illegible] అటువైపు [illegible] తిరిగి నిద్రపోతున్నాడు. అది దొంగనిద్రేనని మృణాళిని [illegible] [illegible] [illegible]లా నటిస్తున్నాడో కూడా ఆమె తెలుసుకుంది.

మా బావను నిద్ర లేపవలసిన అవసరం చేసుకుంటాను"— అన్నది అక్కడే ఉన్న అచలతో.

అందుకు ప్రత్యుత్తరంగా అచల పెదవుల చివర ఒక చిరునవ్వు వెలిగింది తనకేగాక అచలకు కూడా ఆ దొంగ నిద్రలోని అంతరార్థం తెలుసునని మృణాళిని గ్రహించింది. తనపై ఆమెకు అదివరకు ఉన్న ఈర్ష్య కూడా ఆమె ఏనాడో పసిగట్టి ఉంది ఆమె కష్టాలు అచల చూడ కోరుం వచ్చింది. కాని తన్ను తాను సంబాళించుకుని చెప్పింది. "నీకంతా తెలిసే ఉంది కదా అక్కా! నేను వెళ్ళిపోయానని చెప్పు తిరిగి శరీరం స్వస్థపడి స్వగ్రామం వచ్చినప్పుడు అప్పటికి నేను బ్రతికి ఉంటే కనిపిస్తానని చెప్పు."

బైట వసారాలో కేదారబాబు కూచుని ఉన్నాడు. మృణాళిని వచ్చి ఆయనకు నమస్కారం చేసింది. ఆయన కన్నులు చెమరించాయి. ఈకొద్ది రోజుల్లో ఆయనకు కూడా ఈ చిత్రంతు బాలికతో బాగా పరిచయం ఏర్పడ్డది ఉత్తరీయంతో కన్నీళ్లు తుడుచుకుంటూ అన్నాడు— "అమ్మాయి! నీ ఆసరావల్ల మేము మహిమబాబును యమదంష్ట్రకలనించి తిరిగ పొందగలిగాము. నీ కష్టంవచ్చినప్పుడు నీకు కులాసాపుట్టినప్పుడు, యెప్పుడైనాసరే— ఈముసలి వాణ్ణి మరిచిపోకుండా — వచ్చిచూచిపోతూవుండు. నన్ను పరాయి వాణ్ణిగా భావించకు. అచల అక్కడే మౌనంగా నిల్చివుంది. మృణాళిని ఆమె కేసి చూపుతూ మందహాసపూర్వకంగా అన్నది— "మా అక్కచేతుల్లోనించి మా బావను లాక్కుపోవటానికి యముని తలలో జేజెమ్మకుకూడా గుండెలు లేవండీ బాబూ! ఏనాడతన్ని నేను మా అక్కచేతుల్లో ఒప్పచెప్పానో— నాభారం ఆనాటితో నే తీరిపోయింది."

కేదారబాబు మరేమీ మాటాడలేదు. గంభీరవదనుడై కూచున్నాడు.

ఇద్దరు ముసలి నౌకర్లు, ఒక దాసీ మృణాళినిని వాళ్ళఊళ్లో దిగబెట్టి రావటానికి నియమితులైనారు. వాళ్ళతో కూడా మృణాళిని బండియెక్కి స్టేషన్ కు బయలుదేరింది. కేదారబాబు ఒక దీర్ఘనిశ్వాసం విడిచాడు "విచిత్ర యువతి! అపూర్వ స్త్రీ!!" అనిమాత్రం ఉచ్చరించాడు.

సురేశ్ కూడా బహుశః అలాగే అనుకుని ఉంటాడు. కేదారబాబు అభిప్రాయాన్ని ఆమోదించి అన్నాడు— "అలాంటి స్త్రీని నేనీ జన్మలో ఎక్కడా చూడలేదు కేదారబాబూ! ఎంత తియ్యగా మాటాడుతుంది! పనిపాటలు ఎంత నేర్పుతో చేస్తుంది! ఏ పనైనా చెప్పండి, ఎంతో జాగ్ర

తగా-జీవితమంతా అడవిలో ఈ త్తీర్ణురాలైన వ్యక్తివలె-చేసేస్తుంది. ఏనాడూ ఆ కుగ్రామపు పొలిమేరలు దాటివచ్చిన మనిషికాదు మళ్లీను"

కేదారబాబుకూడా ఆ మాటలకు తలవూపాడు. "జన్మాంతర సంస్కారం అనేమాట అర్థరహితం కానట్టే తోస్తున్నది" - అంటూనవ్వాడు సురేశ్.

పరలోకసంబంధిచర్చ ఆరంభంకావటంతో కేదారబాబు కాస్త చింతాన్వితుడైనాడు కాసేపూరుకుని అన్నాడు-"నువు ఏమైనాచెప్పు సురేశ్ బాబూ! ఈ నాలుగురోజులనుంచీ ఆమెను చూస్తున్నానుగదా! ఆమె స్త్రీలోకంలో ఒక అమూల్యమైన రత్నం; సందేహంలేదు. అట్టి ఆమెను అలా జీవచ్ఛవంలా ఉంచటం పాపమేకాదు, మహాపాపంకూడాను. ఆమె నా కూతురే అయితే నేనుచూస్తూ చేతులు ముడిచిపెట్టుకుని కూచోను"

"ఏం చేస్తారుమరి?"-అన్నాడు సురేశ్ ఆశ్చర్యంగా.

"మళ్లీ పెళ్లి చేస్తాను. ఆమెనొక ముసలివాడికికట్టి ఈ పందొమ్మిది-ఇరవై యేళ్ల వయస్సులో సన్యాసాశ్రమం ఇప్పించినవాడు ఆమెకు బంధువు కాదు; శత్రువు ఎంత అన్యాయం!" అన్నాడు కేదారబాబు ఉద్దీప్తస్వరాన.

మరి కాసేపు ఊరుకుని ఆయన మళ్లీ ఇలా అన్నాడు-"అదీ గాక ఆమెను వివాహమాడిన ఆ వృద్ధుడికైనా బుద్ధిఉండనక్కర్లేమా! ఇద్దరు భార్యలు చచ్చిపోయిన తర్వాత ముసలితనంలో మూడో పెళ్లికి సిద్ధమైనవాణ్ణి పాషండుడనవద్దూ? అతగాడు ఈ పసిపిల్ల భవిష్యత్తునుగురించి ఏమైనా ఆలోచించాడా?"

సురేశ్ మారుపలుకని కారణంచేత ఆయన మరింత ఉత్తేజితుడైనాడు-"సురేశ్ బాబూ! నేను విధవా వివాహాల మంచిచెడ్డలను గురించి చర్చించటంలేదు నువు ఏమైనాచెప్పు మీ హిందూసమాజం నామీద గొంతు చించుకుని కేకలుపెట్టనీ 'ఆ పసిపిల్ల బ్రతుకు ఇక అంతే' అని అంటే నేను మాత్రం ఒప్పుకోను. ఆమెదగ్గర గురిగింజంత విలువగల వస్తువు లేదు, ఆమెకు ఒక్కరితోజగడించే ఆస్కారంలేదు. మీరంతా 'బ్రహ్మచర్యం, బ్రహ్మచర్యం' అని అంటారు. అంతమాత్రాన ఒక్కనిమిషంలో ప్రపంచమంతా బుద్ధి [illegible]వనంలా ఉందా? ఆ అమ్మాయి కట్టుకున్న [illegible] చూస్తే నాగుండె [illegible]

సురేశ్ జవాబు చెప్పలేదు, తలయెత్తి చూడనూలేదు. ద్వారంవైపు క్రీగంట చూచాడు. అక్కడ ద్వారబంధం పట్టుకుని విగ్రహంలా నిల్చిఉన్న అచల ఎప్పుడు లోపలికి వెళ్లిపోయిందో తెలియదు.

మృణాళిని వెళ్లిపోయిన తర్వాత సురేశ్‌బాబు ఎప్పుడూ అన్యమనస్కుని వలెనూ, ఏదో ఒక చింతతో కృశిస్తూన్నవాని వలెనూ కనిపిస్తూ వచ్చాడు అచలా దేవికి.

మరి రెండు రోజులు గడిచాయి. ఆనాడు మూడుగంటలప్పుడు క్రింద వరండాలో ఒకమూల నీడలో పడక కుర్చీలో వాలి పుస్తకమేదో చదువుకుంటున్నాడు ఇంతలో అడుగుల చప్పుడు వినిపించి తిరిగి చూచాడు తన కోసం టీ పట్టుకు వస్తున్నది స్వయంగా అచల. ఇదివరకెన్నడూ జరుగలేదట్టి సంఘటన. సురేశ్ ఆశ్చర్యాన్వితుడై లేచికూచుని "నౌకరు ఏమైనాడు? నువ్వు పట్టుకు వచ్చావేం?" అన్నాడు.

అచల జవాబేమీ చెప్పకుండా టీ సామాను అక్కడ టేబిల్ మీద దించి తానొక కుర్చీ లాక్కుని కూచుంది

మరొక ప్రశ్న వేయటానికి సురేశ్ సాహసించలేకపోయాడు; మాటాడకుండా టీ గిన్నె అందుకున్నాడు.

"విధవా వివాహం మీకు నచ్చదా సురేశ్ బాబూ!" అతిమృదువుగా 'అడిగింది అచల

టీ గిన్నె పెదవి దగ్గరనించి తీయకుండానే సురేశ్ అన్నాడు "నా సంస్కారాలు నన్నింకా అంత దూరం తీసుకుపోలేదు"

"మృణాళినిలాంటి పిల్లను పెళ్లిచేసుకోటానికి మీకేమీ అభ్యంతరం ఉండదనుకుంటాను"

"అంటే?" అన్నాడు సురేశ్ కఠినంగా

ముఖంలోగాని, కంఠస్వరంలోగాని ఏమాత్రమూ ఆవేశం ప్రకటం కాకుండా సహజంగా చెప్పింది అచల– "మీకు నేనెంతో ఋణపడిఉన్నాను. అదీగాక మీ శ్రేయస్సు కోరేవాళ్లలో నేను కూడా ఒకతెను. మీరు ఒక ఇంటివారైతే చూడాలని నా కోరిక. ఒకప్పుడు మీరు వివాహం ఆడవలెనని అనుకున్నవారే. ఆమెను వివాహం చేసుకోండని నేను మిక్కిలిగా మిమ్మల్ని బ్రతిమాలుతున్నాను."

ఒక్కగుక్కలో కంఠస్థమైయున్న పాఠంలా ఒప్పచెప్పి ఆయాసపడ్డ దామె.

చాల సేపటివరకు సురేశ్ రాతి విగ్రహంలా ఉండిపోయి చివర కన్నాడు "అందువల్ల నీకు నిజంగా తృప్తి కలుగుతుందా?"

"తప్పకుండా"

"ఆమె ఒప్పుకుంటుందా?"

"ఒప్పుకుంటుందనే నా నమ్మకం"

సురేశ్ ఉపహాసనూచకంగా నవ్వాడు. "నేనుమాత్రం ఆమెఒప్పుకుం టుందని అనుకోను. సహగమనం చెయ్యటానికి కొందరు స్త్రీలు నవ్వుతూ చితిలోకి ఉరికినట్లు పుస్తకాల్లో చదవలేదూ! మృణాళిని ఆజాతికి చెందిన స్త్రీ ఆమె చేతులు, కాళ్లు ముక్కలుగా నరికివేసినా మారుమనువుకు ఒప్పుకోదు. అందుకోసం ప్రయత్నించి ఆమె దృష్టిలో నన్ను కించపరచకు అచలా! ఆమె నన్ను 'అన్నయ్యా' అని సంబోధించింది ఆమె నాకిచ్చిన అసమానపదవిని నేను నిలబెట్టుకోవాలనే కోరుతున్నాను"

చూస్తూచూస్తూండగానే అచలాదేవి ముఖం క్రోధరంజితమైంది. "ప్రపంచంలో మృణాళిని ఒక్కతే స్త్రీ అనుకుంటున్నారు కాబోలు. ఒకర్ని మనసా భర్తగా వరించినమీదట ఎంత ప్రలోభపెట్టినా మీరు వంచించలేని స్త్రీ మీ యెదుట నేనుంది. ఆమెనుగురించి మీరే పుస్తకం లోనూ చదివియుండకపోవచ్చు. అయినా ఆమెనుకూడా కాస్త జ్ఞాపకం ఉంచుకోండి"—అంటూ సురేశ్ తేరి చూడకుండానే సగర్వంగా లేచి వెళ్లి పోయింది అచల.

# 25

ఒకర్ని గురించిన ప్రశంసావాక్యాల్లో మరొకరికి చెంపపెట్టు [illegible]ంటుంది. ఆ సంగతి చెప్పేవాడుగాని, వినేవాడుగాని ప్రథమంలో గుర్తిం చలేకపోవచ్చును. సురేశ్‌బాబు చేతిలో టీ గిన్నె ఆలాగే పట్టుకుని జడునిలా [illegible]న్నాడు. అచల యొకాయొక తన గదిలోకివెళ్లి తలుపువేసుకుని పక్క [illegible]ంది. దిండుమీద ముఖం ఆణిచిపెట్టి దుర్నివారమై పొంగిన

స్తున్న ఏడుపును బలవంతాన ఆపుకోటానికి ప్రయత్నించింది. ఎందువల్లనంటే — పక్కనే మహిమబాబు గదివున్నది ఏమాత్రము శబ్దమూ అతనికి వినిపించకూడదు. నిజానికా అంతర్యామికేతప్ప మరెవరికీ ఆమె అప్పటి పరిస్థితి తెలియదు.

అప్పటి ఆ గంభీరదుఃఖంలో ఆమెకొక క్రొత్త అనుభవం సంప్రాప్తమైంది ఆడదాని జీవితంలో పాతివ్రత్యమనేది ఎంత అమూల్యమైన సంపదో — దాని మహిమ యిప్పుడామెకు సంపూర్ణంగా అవగతమైంది. ఆనాడు సురేశ్ మోహపరవశుడై తన్ను పైకొన్న ఆ ఘటన ఆమెకు జ్ఞాపకం వచ్చింది. అట్టి స్త్రీలోలుడైన సురేశ్ కూడా నేడు పాతివ్రత్యధర్మానికి జోహారులిస్తున్నాడు.

మరొక సంగతి. సుస్పష్టమైన మాటలో ఎంత శక్తివున్నదో ఆమెకీనాడు ప్రప్రథమంగా తెలిసివచ్చింది. తాను విద్యావతి, మనోవాక్కర్మలా భర్తను సేవించటమే పాతివ్రత్యమని ఆమెకు తెలియక పోలేదు కాని మనస్సు కాస్త విచలితమైనప్పుడు తన కతనిపై ఇష్టం తప్పింది 'నిన్ను నేను ప్రేమించటంలేదు' అని అతని ముఖాన్నే అనటానికి తాను సంకోచించలేదు. అందుకు తోడుగా ఇవాళ సురేశ్ మాటల్లో తానొక 'అసతి' అని ధ్వనిస్తున్నది. కాగా ఆమెమనస్సు మరీ క్షోభించింది. హృదయవిదారకమైన వేదనలో ఆమె కుమిలిపోయింది.

అందు మూలాన మృణాళినిపట్ల ఆమెకు గౌరవం హెచ్చిందని చెప్పటానికి వీల్లేదు. కాని సురేశ్‌తోడి సంభాషణలో ఆమె ప్రసంగం రావటం వల్లనే తనలో ఈ చైతన్యం కలిగింది. అందుచేత ఈజీవితంలో తానామెను మరచి పోరాదని నిశ్చయించుకుంది.

పైట తండ్రిగారి మాటలు వినిపించాయి. ఆయనతో సురేశ్ కూడా వస్తున్నట్లు అడుగులచప్పుడు వినిపిస్తున్నది వాళ్లు మహిమను చూడ్డానికి వెడుతున్నారని ఆమె అనుకుంది. మరి కాసేపటికి తండ్రిగారి పిలుపు విని, పైటచెరగుతో పూర్తిగా కన్నీళ్లు తుడుచుకుని, తలుపు తెరచి బైటికివచ్చి వాళ్లతోసహా మహిమబాబు గదిలోకి వెళ్లింది.

“రెండుగంటలకే - జావ - యివ్వాలిగా! ఇప్పుడు నాలుగు గంటలు దాటింది. ఏం చేస్తున్నావు? ఏమిటి కథ? కళ్లు అలా ఉబ్బిపోయాయేం?” — అన్నాడు కేదారబాబు ఆమెకేసి చూస్తూ వ్యగ్రచిత్తుడై

అచల జవాబేమీ చెప్పకుండా గబగబా బైటికి వెళ్ళింది ఇన్నాళ్ళ నించీ రోగికి జావ యివ్వవలసిన పని మృణాళిని చేస్తూఉండేది ఆమె ఊరికిపోయింది ఇవాళ అచలకు ఆ మాటే జ్ఞాపకంరాలేదు. ఇప్పుడామె ఆదరా బాదరా వంటగదికి పరుగెత్తిపోయి చూస్తే నిప్పు, నీళ్ళు చల్లారిపోయాయి. నౌకర్లు పొయ్యిమీద జావ కాచారుగాని అది పొయ్యిమీదనే ఇగిరిపోయింది.

చాలసేపు అక్కడే ఆమె స్తబ్ధిత్తయి నిల్చుంది ఆ సంగతి కేదార బాబుకు తెలిసింది. ఆయన అచలతో ఏమీ అనలేదు సురేశ్ కేసి తిరిగి అన్నాడు — "నేను ముందే చెప్పానుకదూ సురేశ్ బాబూ! ఒక 'నర్సు'ను పెట్టుకోకపోతే మహిమ్‌ను రక్షించుకోజాలమని, నా కూతురుసంగతి నాకంటే మీకు యెక్కువ తెలియునుగదా!"

సురేశ్ మాటాడలేదు. సిగ్గుపడుతూ చింతాక్రాంతయై నిల్చుంది అచల. మహిమ్ ఆమెకేసిచూస్తూ మెల్లిగా ఇలా అన్నాడు — "సురేశ్ బాబూ! నేను 'నర్సు' చేతిమీదుగా మందుకూడా త్రాగను. కాస్త అచలకు సహాయంగా ఒక మనిషిని ఉంచండి, చాలు నిన్న, మొన్న—పాపం రెండురోజుల నించీ ఆమెకు నిద్రలేదాయెను పగటిపూటైనా కాస్త విశ్రాంతి అంటూ లేకపోతే యంత్రంలా పనిచేసే మనిషికికూడా కష్టమే"

ఆ మాటలు అక్షరశః నిజం కాకపోయినప్పటికీ అబద్ధాలుమాత్రం కావు. సురేశ్ సంతోషించి తల వూపాడు కేదారబాబు కఠినంగా మాటాడినందుకు మనసా నొచ్చుకున్నాడు. ఇంతలో అచల అక్కడినించి వెళ్ళిపోయింది.

ఆరాత్రి తన అపరాధాలన్నింటికీ వెక్కి వెక్కి యేడ్చి, భర్త పాదాల మీద వాలి క్షమాపణ వేడుకుందామని ఆమెకు బుద్ధిపుట్టింది. "నేను పాపిష్ఠురాలిని. నన్నుకూడా ఇతర్ల వల్ల మాటపడకుండా మీరెందుకు అడ్డుపడ్డారు?" అని అడుగుదామనుకుంది. కాని సిగ్గు ముంచుకువచ్చి ఏమీ అడగలేకపోయింది.

సాధారణంగా ప్రతిరోజూ రాత్రి చాల పొద్దుపోయిన తరువాత కూడా సురేశ్ ఒకసారి మహిముబాబు గదిలోకివచ్చి అన్ని విషయాలు తెలుసుకుని పోతూవుండేవాడు. మృణాళిని ఉన్నప్పుడు రాత్రిఅంతా అనేక పర్యాయాలు వచ్చి చూచిపోతూ ఉండేవాడు. అందుకు అనుగుణంగా

ఉండేది. కాని కొద్ది రోజులనుంచీ సురేశ్ పద్ధతి మార్చాడు. రోగిని చూడ వలసివస్తే మామూలుగా గదిలోకి రాడు. ఒక దాసీదాన్ని పంపించి కబురు తెలుసుకుంటున్నాడు. సాయంత్రం మాత్రం ఒక్కసారి స్వయంగా వచ్చి విచారిస్తున్నాడు సురేశ్ బాబులోని ఈమార్పును అచల గమనించింది. కాని ఆమె మనసులో పెట్టుకుని ఊరుకుంది ఒకనాడు మహీమ్ కూడా ఆ విషయమై అచలతో ప్రస్తావించాడు. అప్పుడామె సురేశ్ బాబు ఇప్పుడెక్కువగా ఇంటివద్ద ఉండటం లేదనీ, అందుకు కారణం ఏమిటో తనకు తెలియదనీ, చెప్పింది. మహీమ్ విని ఊరుకున్నాడు.

మరునాడు అచల మేడమెట్లు దిగుతున్నది ఏదో పనిమీద సురేశ్ మెట్లెక్కి పైకి వస్తున్నాడు తలెత్తి అచలను చూచాడు. చూచే చూడ్డంతోనే ఎక్కడివాడక్కడ ఆగిపోయాడు. కాని తలవంచుకుని, తప్పుకుని వెళ్లిపోయాడు. అతడట్లు ప్రవర్తించవలెనని ఆమె కోరుకుంది. కాని అతడలా ప్రవర్తించేసరికి ఆమె మనస్సు వేదనాపూర్ణమైంది.

## 26

కూచున్నా, నిలుచున్నా, ఏమిపని చేస్తున్నా అచలాదేవి హృదయాంతరాళంలో ఒకవిషయం రానురాను అత్యంతబాధావహమైంది సురేశ్ బాబులో గోచరమౌతున్న ఆతీవ్ర పరివర్తన ఆమెకు దుస్సహంగ ఉంది. అతడామెను ఒకప్పుడు అనుపమంగా ప్రేమించాడు. ఆప్రేమ అంతా ఇప్పుడామెనువిడిచి వేరే మార్గానికి మళ్లింది అది ఆమెకు బాధ అనిపించింది. "నేను కూడా అతన్ని నాకు తెలియకుండానే ప్రేమిస్తున్నానా?" అని ఒక సందేహం గుండెలో తళుకు మన్నప్పుడల్లా ఒకవిధమైన భయంతో ఆమె సర్వాంగపులకిత ఔతున్నది కాని తనలో తాను మళ్లీ ఇలా అనుకుంటూండేది—"ఛీ, ఛీ, అది అసంగతం. అట్టి అన్యాయానికి నేను ఒడిగడతానా? అలా జరిగినట్లయితే గొంతు పిసుక్కొని చచ్చిపోయి ఉండనూ?" అని ఏమనుకున్నా ఆభావం మాత్రం ఆమెను రాత్రింబవళ్లు వెన్నాడుతూనే ఉంది. కళ్లుమూసినా, తెరచినా అవేఆలోచనలు! అందుకోసమని ఆమె స్నానపానాదులసమయాల్లో తప్ప మిగిలిన కాలమంతా మహిమబాబు సన్నిధిలోనే ఉంటూవచ్చింది. తన

కొన్నాళ్లనించీ సురేశ్ తనగదిలోకి పూర్వంలాగా మాటిమాటికీ రావటం లేదు అందుకు నిజమైన కారణ మేమిటో మహిమ్‌కు తెలియదు. అయినా అతనికి అది కొంత అనుమానానికి కారణం కాకపోలేదు. అతని హృదయంలో ఒకవిధ మైన క్షోభ ఒక రకమైన ఆనందం మిశ్రితమై పోయాయి! తనకు ఉపచారాలు విషయంలో ఇప్పుడు అచల శ్రద్ధాన్వితయై ఉంటున్నది ఎక్కడ ఏకాంతంగా సురేశ్‌తో కలయటం సంభవిస్తుందో నన్న భయంతో ఆమె మహిమ్‌బాబు గదివిడిచి ఎక్కడకీ వెళ్లటమే లేదాయె, ఆరోజంతా ఆమె హృదయం నవనవంత పవన తరంగాల్లో విహరించింది. మహిమ్‌బాబు మంచానికి చేరువనే ఒక పక్కపర్చి ఉంది అందులో పడుకుని చాలప్రొద్దుపోయేవరకూ ఆరాత్రి అచల యేదో పుస్తకం చదువుకుంటూ ఉంది చివరకు అలసిపోయి అందులోనే పడుకుని నిద్రపోయింది. మర్నాటి ఉదయం మహిమ్ పిల్చి లేపాడు. ఆమె తొందర తొందరగా లేచి కిటికీ తెరచి చూచింది. అప్పటికి సూర్యోదయమై చాలసేపయింది.

మహిమ్ ఏదో చెప్పబోతూ ఆగిపోయాడు. ఆమెకేసి అపాదమస్తకమూ ఆప్తే పరికించి ఆశ్చర్యాన్వితుడై — "నీ శాలువ ఏమయింది?"—అని అడిగాడు.

అచల అతనికన్నా ఎక్కువ ఆశ్చర్య పడ్డది. తానప్పుడు కప్పుకుని ఉన్నది సురేశ్ బాబు శాలువ ఆమె సిగ్గు పడ్డది, వ్యథితచిత్త అయింది; ముఖం పాలిపోయింది. తన శాలువ ఏమయింది; ఆమె కేమీ అర్థంకాలేదు. రాత్రి తన శాలువ మడ్చి చుట్టి కాళ్ల దగ్గర పెట్టుకుని పైచెంగు మాత్రం కప్పుకుని పడుకొంది. ఆసంగతి ఇప్పుడామెకు జ్ఞాపకం వచ్చింది. రాత్రి ఎక్కువగా చలివేసిన సంగతికూడా ఆమెకు గుర్తువచ్చింది. తెల్లవారిన తరువాత లేచి చూచుకుంటే ఇదీ కథ!

లజ్జాసంకుచితమైన ఆమెముఖాన్ని చూచి మహిమ్ స్నేహపూర్వకంగా మందహాసం చేశాడు. "ఇందుకోసం నువ్వు విచారించవలసిన అవసర మేముంది అచలా! ఎవరైనా నౌకర్లు పొరపాటున శాలువలు మార్చి తెచ్చి వుంటారు. లేకపోతే సురేశ్ తన శాలువను ఇక్కడ మరచి వెళ్లాడేమో! నువ్వు తెలియక కప్పుకుని ఉంటావు. నౌకర్లను పిలిచి నీశాలువ తెప్పించుకో"

అచల ఆశాలువను చేతిలో పట్టుకుని తన గదిలోకి వెళ్లి కూర్చుంది. రాత్రి చాల ప్రొద్దుపోయిన తర్వాత సురేశ్ బాబు గదిలోకి వచ్చి ఉంటా

శాలువ కప్పుకోకుండా, చలిలో వొణుకుతూ పడక కుర్చీలో పడుకుని ఉన్న తన్ను చూచి, తన శాలువ నెమ్మదిగా కప్పి వెళ్లాడేమో! కాని నిస్సంశయంగా అలాగే జరిగి వుంటుందని అచల భావించింది ఆ భావంతో ఆమె రోమాంచిత అయింది తన్ను చూడ్డానికే-రాత్రివేళ తనివి దీర తన్ను చూచి పోదామనే _ సురేశ్ వచ్చి వుంటాడు. అలా ఎప్పుడెప్పుడూ వచ్చి చూచి పోతూ ఉన్నాడో ఎవరికేం తెలుసును?

ఆమె హృదయం లజ్జాసంకుచితమై పోయింది సురేశ్ కుత్సితుడు, సభ్యత తెలియని మనిషి, తనకు ఆత్మీయులై ఉన్నవారిపట్ల ఈ చౌర్యవృత్తి యేమిటి? ఎంత గర్హ్యమైన పని!

జబల్పూరులో కేదారబాబుకు ఒక బాల్యస్నేహితుడున్నాడు. అతని దగ్గరనించి ఉత్తరం ఒకటి వచ్చింది. జబల్పూరు వాతావరణం చాలా ఆరోగ్యప్రదమైనదనీ, అక్కడ చూడదగిన రమణీయ ప్రకృతి దృశ్యాలు చాలా ఉన్నాయనీ ఆయన తెలిపాడు. అక్కడ తన యిల్లే ఒకటి ఖాళీగా ఉందట కూడాను మహిమ్‌బాబు వచ్చి కొద్ది కాలంపాటు అక్కడ హాయిగా వుండవచ్చును.

ఒకనాటి ఉదయం కేదారబాబు వచ్చి ఆ సమాచారమంతా వినిపించాడు. మాఘమాసం కూడా వెళ్లిపోయింది. ఇంకా ఆలస్యం చేయడం తగదు. చిన్నతనంలో ఒకసారి కేదారబాబు కూడా జబల్పూరు వెళ్లి ఉన్నాడు. అప్పటి విషయాలన్నీ జ్ఞాపకం వచ్చి కేదారబాబు మళ్లీ ఒకసారి ఏకరువు పెట్టాడు "జగదీశబాబు భార్య కూడా బ్రతికే వుంది, ఆమె మహిమబాబును తల్లిలా ఆదరిస్తుంది" అన్నాడు

మహిమ్ అంతా వింటూ కూచున్నాడు, అతనిలో ఉత్సాహమేమీ కనిపించలేదు కేదారబాబు వెళ్లిపోయిన తర్వాత అచల భర్తను అడిగింది- "జబల్పూరు మంచి చోటే కదా! అక్కడికి వెళ్లటం మీకు యిష్టంలేదా?"

"నిజానికి మీరంతా అనుకున్నంతగా నాకింకా స్వాస్థ్యం చిక్కలేదు ఇక ముందైనా చిక్కుతుందన్న ఆశ కూడా నాకు లేదు."

"అందుకోసమనే డాక్టర్లు స్థలమార్పుమని చెబుతున్నారు. ఒకసారి జబల్పూరు వెళ్లివస్తే బాగానే ఆరోగ్యం చిక్కుతుంది"

మహిమ్ తల పంకిస్తూ కాసేపు ఊరుకుని అన్నాడు —"ఏమో మనిషి చెప్పగలడు [illegible] దేనిమీదా [illegible] భరోసా పెట్టుకో డానికి

స్వర్గానికి వెళ్లాలన్నా నాకు ధైర్యం చాలటంలేదు అచల! అంతర్యంలో నేను వట్టి పిరికివాణ్ణిసుమీ! వట్టి అస్వస్థుణ్ణి. నువ్వు నాదగ్గిరగనక లేకపోతే నేను ఒక్క రోజైనా బ్రతుకలేను." అతని కంఠం రుద్ధమైపోయింది

మహిమ్‌బాబు ఎప్పుడూ ఎవరిని ఏమీ చెయిచాచి అడిగినవాడు కాదు తన దుఃఖాన్ని గాని దారిద్ర్యాన్ని గాని నోరు తెరచి ఎవరికీ ఎన్నడూ చెప్పలేదు. అట్టివాడు ఇప్పుడు ఇలా వ్యాకుల చిత్తుడై అచలాదేవిని యాచించిన భిక్ష ఒక శూలమై ఆమె హృదయాన్ని భేదించింది. దానిలో ఆమెహృదయాన్ని స్నేహం, కరుణ, మార్దవం గట్లు తెంచుకుని ప్రవహించాయి. ఆమె తన్ను తాను సంబాళించుకోలేకపోయింది. కన్నీళ్లను ఆపుకుంటూ ఇక అక్కడ ఉండలేక బైటికి లేచిపోయింది. మహిమ్ హతబుద్ధుడై, వేదనా దోదూయమాన చిత్తుడై, ద్వారంకేసి తదేకంగా చూస్తూ పడుకున్నాడు. మరికాసేపటికి నిద్రపోయాడు.

మళ్లీ తరువాత భార్యాభర్తలు సమావేశమైనప్పటికీ ఆ విషయమైన ప్రస్తావన రానేలేదు. మరునాటి రోజున ఆమె ఒక టెలిగ్రాం చేతపట్టుకుని నవ్వుతూ వచ్చింది "జగదీశబాబు టెలిగ్రాం ఇచ్చారు వారింటికి పక్కగానే మనకోసం ఒక యిల్లు శుభ్రం చేయించి ఉంచారుట"

"అంటే?—" అన్నాడు మహిమ్ విషయం సరిగా అర్థంగాక

జగదీశబాబు నాన్నగారికి ముఖ్యస్నేహితులు. ఆయన యింట్లోనే మనం వెళ్లి ఉంటే ఆయనకేమీ అభ్యంతరం ఉండదు అయినా ఇద్దరం వెళ్లి వాళ్లకు భారంగా వాళ్లింట్లోనే కూచోటం మనకే బాగుండదు. కాబట్టి వేరే ఒక ఇల్లు మాటాడి శుభ్రంచేయించమని నాన్నగారాయనకు టెలిగ్రాం యిచ్చారు. బదులుకు ఆయన తిరిగిచ్చిన టెలిగ్రాం ఇదు" అంటూ ఆమె దాన్ని అతని పక్కమీద పెట్టింది.

మహిమ్ దాన్ని అందుకుని [illegible] - పరదాకా చదువుకున్నాడు. అచల తన యిష్టానుసారం [illegible] తో కూడా రావాలని కోరుతున్నాడు కాని, నిన్నటి ఆమె ప్రవర్తన అతనికి ఇప్పటికీ దుర్గ్రాహ్యంగానే ఉంది. కాని గతాన్ని తడివి మళ్లీ వ్యాకులపడటం మంచిది కాదని ఊహించుకున్నాడు.

అచలాదేవి ప్రయాణానికి అన్నీ సిద్ధంచేస్తున్నది. ఆనాడే రెండు ఝాములప్పుడు తండ్రిగారి యింటికిపోయి తన వస్తువులన్నీ సర్దుకుంది. కేదారబాబు సిట్టింగుదగ్గర నిల్చుని అంతా చూస్తూ వున్నాడు.

"నువ్వు కూడా వెళ్లకపోతే యేం అమ్మా!" అని అడిగాడు.

"అలా అడుగుతావేం నాన్నా!"

శీఘ్రంగా అతడు స్వాస్థ్యం పొందాలంటే భార్యదగ్గర ఉండటం మంచిదికాదు. కాని ఆమాట కూతురుతో చెప్పటానికి కేదారిబాబు సిగ్గుపడ్డాడు. అందుచేత కేదారబాబు ప్రస్తుత ఆర్థిక పరిస్థితుల్ని పురస్కరించుకుని ఇలా అన్నాడు — "మహిమ్ జబల్పూరులో ఎక్కువరోజులేమీ ఉండవలసిన పనిలేదు. అదీగాక జగదీశ్ గారింట్లో అతని కేవిధంగానూ లోటు కలగనీయరు. ఈ కొద్ది రోజుల భాగ్యానికి ఎక్కువడబ్బు ఖర్చు చెయ్యటం —"

అసలు విషయం అచలకు అర్థం కాలేదు, తండ్రికేసి అట్టే చూస్తూ అడిగింది — "బహుశా ఆయన మీకలా చెప్పారు కాబోలు!"

"అబ్బే మహిమ్ ఏమీ చెప్పలేదు. నేనే ఆలోచిస్తున్నాను; ఏమంటే —"

"నువ్వు ఏమీ ఆలోచించనక్కర్లేదులే నాన్నా! అంతా నేనే సరిచేస్తాను" — అంటూ అచల తన పనిలో తాను నిమగ్నమయింది. మర్నాడే తన రెండు సొమ్ములు అమ్మివేసి పైకం సంతన చేసుకుంది.

ఫాల్గుణ మాసం మధ్యలో ఎప్పుడో వెళ్లాలని అనుకున్నారు. కాని సురేశ్ బాబు దైవజ్ఞుని పిలిపించి ఫాల్గుణ మాసం జొరబడిన వారం రోజులలోగానే ప్రయాణ ముహూర్తం ఏర్పరచాడు. అందరూ అందుకు సమ్మతించక తప్పలేదు.

ఇంకా రెండు రోజుల్లో వెళ్లిపోనున్నారు. అచలాదేవి హృదయం గాలిలో తేలిపోతున్నట్టుంది.

కలకత్తా పట్నం విడిచి అచల ఎప్పుడూ మరో చోటికి వెళ్లి ఉండలేదు. ఈ మధ్య కొన్నాళ్లు మహిమ్‌బాబు గ్రామంలో మాత్రం వెళ్లి ఉన్నది; అంతే, ఆమెకు పడమటి ఊళ్లను గురించి ఏమీ తెలియదు. అనేక చరిత్రాత్మక ప్రదేశాలు, వనాలు, అడవులు, పర్వతాలు, నదులు, సెలయేళ్లు — ఇంకా చూడదగిన ఏవేవో విశేషాలు ఉంటాయని ఇతర్లు చెబితే వినటమే గాని ఆమె ఎన్నడూ, వెళ్లలేదు చూడలేదు. నేటికి అవన్నీ వెళ్లిచూచే అవకాశం లభించింది. అంతేగాక — అక్కడ తన భర్త ఆరోగ్యం బాగుపడుతుంది. అత [illegible] వ్యవహారాలు చేస్తూ గృహిణీత్వం నెరపుతుంది. అక్కడి గా

నీళ్లు ఆరోగ్యమిస్తాయి, తన జీవనయాత్ర సుగమంగా సాగిపోతుంది భర్తకు బాగా స్వాస్థ్యంచిక్కిన తరువాత ఆయన అక్కడే జీవనోపాధి కల్పించుకో గలుగుతాడు తనూ, అడపా అక్కడే హాయిగా ఉండిపోవచ్చు. ఇలాగ అనేక సుఖస్వప్నాలతో ఆమె మనస్సు నిండిపోయింది 'నిన్ను విడిచి పెట్టి వెళ్లాలి! వెళ్లాలనుకున్నా నాకు మనస్కరించదు'— అని మహిమ్ పలికిన వాక్యాలు అమృతకణాలై నిత్యమూ ఆమె చెవిలో ప్రతిధ్వనిస్తున్నవి. ఆమె కిప్పుడే. ఏమీబాధా ద్వేషములేదు హృదయాంతరాళాల్లోని గ్లాని పంచ బంగాళమైపోయింది. గంగాజలముకలె ఆమె హృదయం నిర్మలము పవిత్రము ఐపోయింది. ప్రయాణమై వెళ్లేముందు ఒకసారి స్నేహితాళిని కలుసుకుని, మనస్ఫూర్తిగా ఆమెను కౌగలించుకుని, క్షమాభిక్ష యాచించవలె ననుకుంది. సురేశ్ యెడలకూడా ఈనాడు ఆమె హృదయం మెత్తపడింది. అతడు నిజంగా పరమమిత్రుడు. అయినా కూడా తన్ను మాటిమాటికి వచ్చి కలుసుకోవటానికి సంకోచిస్తున్నాడు. అది ఆమె మనస్సుకు కష్టం కలిగించింది. అతన్నికూడా తాను క్షమాభిక్ష యాచించవలసిందే. కాని అతనెక్కడున్నాడో విచారించగా నిన్నటినించీ యింటికే రాలేదని కబురు తెలిసింది.

వాళ్లు ప్రయాణమై వెళ్లిపోయేరోజున ఉదయంనించీ ముసురుగానే ఉంది పెట్టె, బేడ సర్దుకున్నారు కొంత సామాను అప్పుడే స్టేషన్ కు వెళ్లింది. టిక్కెట్లుకూడా ముందుగానే కొనేశారు అచలకోసం సెకండు క్లాసు టిక్కెట్టు కొందామని అనుకున్నారు కాని అందు కామె ఒప్పుకోలేదు మహిమ్ తో చెప్పింది— "వృధాగా డబ్బు ఖర్చుచేయాలనుకుంటే కొనండి నేనేమీ జబ్బుమనిషి కాదు గొప్పయింటిపిల్లనే ఇంటర్ క్లాసు డబ్బాలో ప్రయాణం చేస్తున్నారు నేను సెకండుక్లాసులో ఒక్కనాటికీ ప్రయాణం చెయ్యను" అని—

రెండురోజులనించీ సురేశ్ బాబు కబురే తెలియకుండా ఉంది. కాని ఆనాడు ముసురుగా ఉన్నందుచేతనో, మరింకే కారణంవల్లనో అతడు తన శయనమందిరంలోనే కూచుని ఉన్నాడు ఆనందవిహీనమై యున్న ఆ గది లోనికి అచల వసంతవాయు తరంగంలా ప్రవేశించింది ఆనందాధిక్యత వెల్లివిరుస్తూన్న కంఠాన ఆమె అన్నది— "సురేశ్ బాబూ! ఈజన్మలో ఇక మీరు మాకు మీముఖం చూపించదలచుకోలేదా యేమిటి? మేము ఏమంత పెద్ద అపరాధంచేశామో చెబుదురు కాస్త"

సురేశ్ ఉత్తరమేదో రాసుకుంటున్నాడు. తలెత్తి అచలకేసి చూశాడు. తన యిల్లు కాలిపోయిననాడు చేరువనే చెట్టుకింద నిల్చున్న సురేశ్ బాబు ముఖవైఖరి అచలకు జ్ఞాపకంవచ్చింది, నాటి అతని ముఖంలోని జాలీ ఐశ్వర్యమూ ఆకలిలో గోచరిస్తున్నాయి. అచల విచలిత అయింది. ఉద్విగ్నచిత్తయై దగ్గరకువచ్చి అడిగింది — "మీకు ఒంట్లో బాగులేదా సురేశ్ బాబూ! నాకు చెప్పకూడదూ?"

ఒక్క క్షణం మాత్రమే సురేశ్ తలెత్తిచూచాడు మళ్లీ తలవంచుకుని — "ఎబ్బె ఏమీలేదు నాకు వంట్లో బాగానే ఉంది. కులాసాగానే ఉన్నాను" — అని మాత్రం పలికి, చేరువున ఉన్న ఒక పుస్తకంలో పేజీలు తిరగవేస్తూ మళ్లీ ఇలా అన్నాడు — "మీరు ఇవాళే వెళుతున్నారుకదూ! అంతా సర్దుకున్నారా? మళ్లీ కలుసుకోవటం ఎప్పుడో!"

అందుకు అచల యేమీ జవాబు చెప్పలేదు సురేశ్ ఆశ్చర్యపడుతూ తలెత్తి చూచాడు. అచలాదేవి కన్నులు చెమరించాయి కన్నీటి బిందువులు టపటప నేలరాలాయి

సురేశ్ బాబు ధమనులలోని వేడి రక్తం ఉన్మత్తమైంది సర్వశక్తినీ ఉపయోగించి తన్నుతాను సంబాళించుకున్నాడు. నేలకేసి చూస్తూ కూచున్నాడు.

అచల కన్నీళ్లు తుడుచుకుని గద్గద స్వరాన అన్నది. "మీకు ఒంట్లో ఏమీ బాగున్నట్టు లేదు సురేశ్ బాబూ! మీరుకూడా మాతో వచ్చెయ్యండి"

"ఊహు" అన్నాడు సురేశ్ తల అడ్డంగా ఊపి.

"ఎందుకురారు? మీకోసం —" వాక్యం పూర్తికాలేదు ఇంతలో బైటినించి నౌకరు — "బాబుగారూ! టీ తెచ్చాను" — అంటూ పరదా తొలగించి లోనికి వచ్చాడు. మరుక్షణమే అచల ముఖం తిప్పుకుని బైటికి వచ్చేసింది

ఒక గంట తరువాత ఆమె భర్త గదిలోకి వెళ్లింది "ఇన్నాళ్లనించీ సురేశ్ ఎక్కడికి వెళ్లాడో నీకేమైనా తెలుసా? బొమ్మతోకూడా చెప్పి వెళ్లలేదుట ప్రయాణమై వెళ్లే ముందైనా నాకు కలవడు కాబోలు!" అన్నాడు మహిమ్.

"ఇవాళ ఇంట్లో ఉన్నాడేమో"

"లేడుట! ఇవాళ ఉదయమే ఎక్కడికో వెళ్లిపోయాడని ఇప్పుడే నాకరు చెప్పాడు"

అచల మాటాడలేదు. పదినిమిషాలక్రితమే తానతన్ని చూచివచ్చినట్టు గాని, అతడేదో చాలసుస్తీగా ఉన్నాడనిగాని ఏమీ చెప్పలేదు. బాల్య దశలోవలెనే ఇప్పుడుకూడా మిమ్మల్ని అతడు రక్షించాడు. ఒకసారి అత నితో కలిసి మాటాడండి"—అని చెబుదామనుకున్నా ఆమెకు మాటపెగలనే లేదు.

రైలుటైము కావచ్చింది. కిందినించి కేదారబాబు చప్పున బయలు దేరండని కేకలు పెడుతున్నాడు. సురేశ్ బాబు బామ్మ శుభశకునాలకోసం చూస్తోంది. ఒక్కసురేశ్ మాత్రం ఎక్కడా పత్తాలేదు అతని ప్రవర్తన అందరికీ కష్టం కలిగించింది.

కేదారబాబు కూతుర్ని సమీపించి, ఆమె తల నిమురుతూ—"లక్ష్మీ దేవివలె సతీత్వం పాటించు తల్లీ! నీతల్లివలె ఉత్తమురాల వనిపించుకో. ఈ ముసలితనంలో తెలిసి తెలియక నేనేమైనా అన్నా మనసులో పెట్టుకోకు" —అనిమాత్రం సౌహార్ద్యం చిలుకుతూ పలికాడు.

బండి ఎక్కుతూ మహిమ్ అచలతో అన్నాడు—"అతడు మనల్ని కలవనేలేదు చూచావా! అతనితో రెండు మాటలు చెబుదామని నిన్నటి నించీ ఎదురు చూస్తూ ఉన్నాను"

తండ్రిగారి మాటలవల్ల ఆమెలో కరుణ పొంగి కన్నీళ్లు వచ్చాయి అందుచేత భర్తమాటకు ఏమీ మారుచెప్పలేక తల ఊపుతూ "ఔను, మఖం తప్పించాడు" అనిమాత్రం అన్నది

అచల సురేశ్ బాబు బామ్మకు పాదాభివందనం చేసింది. నీకు సమస్త కుంకుమలు అక్షయమూ గాక! మీ ఆయనకు శీఘ్రంగా ఆరోగ్యం చేకూర్చి తిరిగి వద్దువు గాని" అన్నది బామ్మ.

"నా కంటె కంటే మరేంకావాలి బామ్మా!" అంటూ అచల కన్నీళ్లు ఒత్తుకుని బండి యెక్కింది.

రైలు రావటానికి యింకా పదినిమిషాలు ఆలస్యం ఉంది. ఇంకా ముసురుగానే ఉంది. సన్నసన్నగా చినుకులు పడుతున్నాయి. ప్లాటుఫారమంతా జనం క్రిక్కిరిసి ఉన్నారు. అంతా తొక్కిడిగా ఉంది. ఇంతలో ఒక పెద్ద సూటుకేసు పట్టుకుని సురేశ్ బాబు రావటం చూచింది అచల.

ఆశ్చర్యపడుతూ, ఏదో కీడు శంకిస్తూ చూచాడు కేదారబాబు. ఆయన ముఖం నల్లగా మారింది.

"ఏమిటి కథ సురేశ్ బాబూ! ఎక్కడికీ ప్రయాణం?" అని అడిగాడు అతడు దగ్గరకు రాగానే.

సురేశ్ అచలకేసి చూస్తూ, నీరసంగా నవ్వుతూ అన్నాడు—"నీ సలహా నీ నిమంత్రణ ఉపేక్ష చేయటం మంచిది కాదని తోచింది. ఇవాళ ఉదయం నువ్వు వచ్చి చెప్పకపోయినట్టయితే నా యీ ఆరోగ్యం నేను తెలుసుకోలేక పోయేవాణ్ణే. పదండి, కొన్నాళ్ళక్కడ మీ అతిథినై కాలం వెళ్ళబుచ్చుతాను. ఆరోగ్యం బాగుపడుతుందేమో! నిజానికి నేను—"

అర్ధోక్తిలో మహిమ్ అడ్డువచ్చి "మంచిపని చేశావు సురేశ్! కొత్త చోట మాకు నీ సాహచర్యం కూడా ఉత్సాహకరంగా ఉంటుంది" అంటూ అచలకేసి తిరిగి చూశాడు. అతని నీరవవ్యధిత దృక్కులు— "ఈ సంగతి నాతో ఎందుకు చెప్పలేదు అచలా! అతన్ని గురించి మనం ప్రసంగించుకున్నప్పుడైనా నువ్వు అతనితో కలిసి మాటాడినట్లు నాతో చెప్పావు కాదే! ఈ కపట నాటకం ఆడవలసిన అవసరం ఏమి వచ్చింది?" అని అడుగుతున్నట్టుగా ఉన్నవి.

అచల అటు ప్రక్కకు తిరిగి చూస్తూ నిల్చింది. క్షణకాలం సురేశ్ బాబు మూర్ఖునివలె ఉండిపోయి చివరకిలా అన్నాడు—"రైలు కదిలే వేళ ఔతున్నది. [illegible] బండి ఎక్కండి, [illegible] ఉందాం. రండి కేదారబాబూ!"— అంటూ ముందుకు సాగాడు.

కేదారబాబు చాలా [illegible] ఏమీ మాటాడలేదు. మహిమ్ను రైలెక్కించి, అచలను ఆడవాళ్ళ పెట్టెలో కూచో పెట్టడానికి తీసుకుపోయాడు. బండి కదలబోతోంది. సురేశ్ కేదారబాబును [illegible].

ఆశ్చర్యపోయి ఇలా అన్నాడు—“నువ్వు కూడా ఉన్నావు ఇక మనవాళ్ల క్షేమానికి కష్టం ఉండదు. ఆడవాళ్ల దబ్బా కొంచెం దూరంగా ఉంది. అప్పు డప్పుడు కాస్త కబురు తెలుసుకుంటూ ఉండండి” తరువాత మహిమ్ కేసి తిరిగి “మీ రక్షకుడికి చేరగానే ఉత్తరం రాయండి. మరచిపోవద్దు. నేను ఆత్రుతగా ఉంటాను”— అంటూ కన్నీళ్లు తుడుచుకుని వాదలి పోయాడు. విషణ్ణులైయున్న ఆ మానవ సౌహార్ద్రకంఠస్వరం చాలసేపటివరకు ఆమిత్రులిద్దరి హృదయాల్లోనూ ప్రతిధ్వనించింది.

బండి కదిలింది. చలి సోకుతుందేమోనని మహిమ్ బాబు కంబలి కప్పు కుని పడుకున్నాడు వెంటనే నిద్రపట్టింది కాని సురేశ్ మాత్రం అలాగే కూచున్నాడు. అతని చూపులు ఎంతో విపరీతంగా ఉన్నవి. హృదయంలో ఏదో భీషణమైన అగ్నికాండ చెలరేగుతూంటేనేగాని కన్నుల్లో అట్టి విప రీత ప్రకాశం ఉండదు

స్లో-ప్యాసింజరు కావటంచేత రైలు అన్ని స్టేషనుల్లోనూ ఆగుతూ పోతూవుంది. ఒకానొక పెద్దస్టేషన్‌లో రైలు ఆగింది మహిమ్ నిద్రలేచాడు కంబళితీసి ముఖమెత్తి చూచాడు. పెట్టెలో జనసమ్మర్దన మేమీ లేదాయెను. “కాస్త వొళ్లువాల్చకపోయావా సురేశ్ ! ముందుముందు పెట్టెఇంత ఖాళీగా ఉండకపోవచ్చు”—అన్నాడు

సురేశ్ ఉలికిపడ్డాడు. “ఔను, ఔను, పడుకుంటాను”—అన్నాడు.

సురేశ్ ఉలికిపాటుకు కారణంలేదు. అందుచేత మహిమ్ ఆశ్చర్యపో యాడు. సురేశ్ ఏమైనా మహాపరాధం తలపెట్టాడా? పట్టుపడతానేమో నన్న భయంతో అలా విచలితుడౌతున్నాడా? మహిమ్‌బాబు ఆలోచనలు అలా సాగిపోయినవి.

బండి స్టేషనులో ఆగివుంది సురేశ్ లేని చిరునవ్వు తెచ్చుకున్నాడు. “నువ్వు నిద్రపోతున్నావనుకున్నాను హఠాత్తుగా నీమాట వినిపించేసరికి ఉలికి పడ్డాను” అన్నాడు సురేశ్.

“అలాగా !” అనిమాత్రం అన్నాడు మహిమ్. సురేశ్‌బాబు చెప్పిన అనవసరపు సమాధానం అతనికి నచ్చలేదు.

“అచలాదేవికి ఏమన్నా కావాలేమో ! ఒకసారి వెళ్లి—” అన్నాడు సురేశ్.

"మరి వర్షం కురుస్తోందిగా !"

"ఫరవాలేదు. తొందరగా చూచివస్తాను" అంటూ సురేశ్ తలుపు తెరచుకొని బైటికి వచ్చాడు. ఆడవాళ్ల డబ్బాదగ్గరకువెళ్లి చూచాడు. అచలకు ఒక యువతి యెవరో సావాసం దొరికింది. ఇద్దరూ బాతాఖానీ వేసుకున్నారు. ఆ యువతి బాబును చూచింది. అచలాదేవి చెయి గిల్లి ప్రక్కకుతిరిగి కూచుంది. అచల సురేశ్ కేసి చూచింది. "ఏమైనా కావాలా?" అని అడిగాడు సురేశ్.

"ఏమీ అక్కర్లేదు మీరు వర్షంలో అలా తడుస్తూ రావలసిన అవసరమేమీలేదు వెళ్లండిఅంటూ అచల కిటికీదగ్గరకు వచ్చింది. "నా క్షేమం." మాటిమాటికీ మీరేమీ విచారిస్తూనుండనక్కర్లేదు ఎవరి క్షేమాన్ని గురించి జాగ్రత వహించాలో వారినిమాత్రం కనిపెట్టి వుండండి" -అనికూడా అన్నది మృదువుగా.

"ఏమీ అక్కర్లేదు. ఇలా మీరు వర్షంలో తడిసి జ్వరం పడాలని కోరిగ్గా ఉందా?"—అన్నది. అచలనవ్వుతూ.

సురేశ్ ఆమెకేసి క్షణమాత్రం చూచి, చూపులు నేలకు దించుకుని అన్నాడు—"ఔను చాల రోజులనించీ కోరిగ్గా నే ఉంది. కానిఅభాగ్యుణ్ణి జ్వరం కూడా నన్ను వరించటంలేదు"

ఆమాటకు అచల చిన్నబుచ్చుకుంది. కాని ఆనీరసభావం పైకి కనబడనీయకుండా నవ్వుతూ సంభాషణ మార్చింది.

రైలు కదలటానికి గంట కొట్టారు సురేశ్ ఏదో చెబుదామని తలెత్తాడు కాని ఏమీచెప్పకుండానే తిరిగిపోబోతున్నాడు. కాని అతను కప్పుకున్న శాలువ కొంగు అచల చేతిలో ఉంది ఆమె అడిగింది —"నేనుమిమ్మల్నిమాతోకూడా రమ్మన్నా నన్న సంగతి అంత మందిలో ఎందుకు చెప్పారు? అంత మందిలో ఎందుకలా కించ పరచారు?"

ఆవిషయమే చాలానేపటినించీ సురేశ్ హృదయంలో అగ్నిజ్వాలగా రగులుతూ ఉంది. "నాకు తెలియక పొరపాటు చేశాను అచలా!" అంటూ నీరసంగా జవాబు చెప్పాడు.

అచలకు శాంతి లభించలేదు "తెలియక చేశారా? ఊహూ అంత మందిలో నన్ను కించ పరచాలన్న ఉద్దేశంతోనే మీరలా ప్రవర్తించారు

బండి కదిలింది సురేశ్ జవాబు చెప్పటానికి వీల్లేక పోయింది. గబ గబా వరుగెత్తి వెళ్లిపోయాడు అచల కిటికీ వద్దనే నిల్చుని చూస్తూవుంది. దూరాన ఒక పెట్టెలో కిటికీలోనించి ముఖం బైటికి పెట్టి మహీమ్ ఇటు కేసి చూస్తూఉన్నాడు. అచల తిరిగివచ్చి తన స్థానంలో కూచుంది "వారేనా మీఆయన?" అని అడిగింది ఆ యువతి

"ఔను"-అన్నది అచల అన్యమనస్కురాలై కిటికీగుండా బైట శూన్యంలోకి చూస్తూ కూచుంది.

పల్లెటూళ్లు, పట్నాలు గడచి పరిగెడుతోంది రైలు క్రమేణా అచలాదేవి హృదయానికి శాంతి చేకూరుతూవచ్చింది. మళ్లీ కులాసాగా ఆ యువతితో సంభాషిస్తూ కూచుంది.

ఒక పెద్ద స్టేషనులో రైలు ఆగింది. కొన్ని తినుబండారాలూ, తేనీరు పట్టుకొచ్చాడు సురేశ్. అచల వాటిని అందుకుని నవ్వుతూ మృదువుగా అన్నది—"ఎందుకీ కష్టమంతా మీకు? ఆయన తీసుకువెళ్లమని చెప్పారా యేమిటి?"

తినుబండారాలు తెచ్చి ఆమె కివ్వటానికి మహీమ్ ఆజ్ఞ ఏందుకూ? అటువంటి మిత్రకృత్యం సాధారణంగా సురేశ్ స్వయంగానే చేస్తూ ఉంటాడు. ఆసంగతి అచలకు తెలుసు అయినా మర్యాద కోసమని అలా అడిగింది.

సురేశ్ చిరునవ్వు నవ్వుకుంటూ తిరిగి వెడుతున్నాడు. అచల అతన్ని పిలిచింది. సురేశ్ పెదవుల మీద ఇంకా ఆ చిరునవ్వు వెలుగుతూనే ఉంది అది చూచి అచల కూడా మందహాసం చేసింది. వెంటనే ఆమె ముఖం లజ్జారాగరంజితమైంది అప్పటి ఆమె ఆరక్త ముఖకాంతిని చూపులతో అతడు గొంతుక వరకూ తాగేశాడు.

"వారికి కులాసాగా నిద్రపట్టిందా? అక్కడ పెట్టెలో చిరాకుగా లేదుకదా? ఇక్కడ కొకసారి రాగలరా?"—అని భర్తను గూర్చి ఏమేమో అనేక ప్రశ్నలడిగి తెలుసుకోవాలని ఆమె అభిలాష కాని ఒక్కప్రశ్నయైన అడగలేక పోయింది. "మనం అలహాబాదురైలు మారాలి కామాలు ఎక్కడ ఎప్పుడు మారాలో కాస్త కనుక్కుని వచ్చి చెబుతారా?"—అని మాత్రం అడిగింది.

"[illegible]" — అంటూ సురేశ్ ఆశ్చర్యచకితుడై వెళ్లిపోయాడు

ఇంతలో ఆ యువతి ప్రార్థనాస్థానం విడిచి, కాస్తదూరంగా వెళ్లి కూర్చుంది. అచలకు కోపం వచ్చింది ఆపుకోలేక — "మీరు బహుశా రొట్టెకీ ముట్టుకోరు కాబోలు!" — అని అడిగింది.

"ఈ కాలంలో మడి కట్టుకు కూర్చున్నవారెవరమ్మా! ఇప్పుడందరూ తింటూనే ఉన్నారు" — అన్నదామె వినయపూర్వకంగా.

"మరి అపవిత్రమనుకూ దూరంగా జరిగావెందుకూ?"

"అపవిత్రమనుకూ కాదమ్మా! మగవాళ్లంతా తింటారు కాని మా అత్తగారికి మాత్రం ఇలాంటి చిరుతిండ్లు కిట్టవు మన ఆడవాళ్లు —"

ఇలాగే ఆనాడు భోజన పదార్థాలదగ్గర అచలకూ, మృణాళినికీ విరోధం ఏర్పడింది ఆనాడూ అచలాదేవి తన్నుతాను సంబాళించుకోలేక పోయింది. ఆ యువతి వాక్యం పూర్తి చేయకముందే అచల కోపంగా అంది. "నీకు ఏవిధమైన ఇబ్బంది కలుగజేయడమూ నా ఉద్దేశం కాదు వచ్చి నీ యథాస్థానంలో కూర్చో" — అంటూ ఆమె చేతిలోని రొట్టెను బయటకు విసరి పారేసింది, తేనీరు పారబోసేసింది. ఆ యువతి గాభరాపడిపోయి అచలకేసి కొంచెంసేపు తదేకదృష్టిని చూస్తూ, చివాలున ముఖం అటు తిప్పి కూర్చుని, కన్నీళ్లు తుడుచుకుంటోంది.

బైట వర్షం ఆగింది. కాని ఆకాశాన మేఘాలు క్రమ్ముకు వస్తున్నవి. మరి కొంతసేపటికి మళ్లీ వర్షం జోరైంది.

అచల ఇక ఉండబట్టలేక ఆ యువతికి దగ్గరగా జరిగి ఆమె చెయి పట్టుకుని మృదువుగా అంది — "నేను చేసిన పని నాకే సిగ్గుగా ఉంది. నన్ను క్షమించాలి."

ఆ యువతి నవ్వింది. కాని జవాబేమీ చెప్పలేదు. "నా మనస్సు సరిగాలేక పిచ్చిగా ప్రవర్తించాను. మా ఆయనకు సుస్తీగావుంది డాక్టర్లు నీళ్లు మార్చాలని చెబితే పశ్చిమప్రాంతాలకు తీసుకుపోతున్నాను రోజులు సక్రమంగా సాగిపోతే మంచిదే. విధి విరుద్ధంగా జరిగితే పరాయి ప్రదేశంలో నా గతి యేంకాను?" అన్నది అచల. ఆమె కంఠం అశ్రురుద్ధమైంది

"మీ ఆయన్ను చూస్తే జబ్బుగా ఉన్నట్టేమీ కనిపించటంలేదే!" — అడిగింది ప్రౌఢయువతి ఆశ్చర్యంగా.

"ఆయన ఆ పై పెట్టెలో ఉన్నారు. నువ్వు ఆయన్ను ఎప్పుడు చూచావు? ఇందాకవచ్చింది వారి స్నేహితుడు"

యువతి మరీ ఆశ్చర్యపోయి ప్రాణంగా కూచుంది. "వారు మీ ఆయ నేనా?"— అని యువతి అడిగిన ప్రశ్నకు 'ఔను' అని [illegible] ప్రత్యుత్తరం చెప్పింది. ఆసంగతి ఇప్పుడామెకు స్ఫురించలేదు. ప్రౌఢ యువతి ఆశ్చర్యపోవటం అచలకు ఇంకో విధంగా అర్థమైంది. పరపురుషుడితో అంతటి స్వేచ్ఛగా మాటాడ్డం సాధారణ హిందూ స్త్రీ దృష్టిలో అసభ్య ప్రవర్తనగా గోచరిస్తుంది అందుకే ఆమె అంతగా ఆశ్చర్యపడ్డదేమో! అని అచలాదేవికి తోచినప్పుడామె చాల లజ్జాన్విత అయింది "మేము హిందువులం కాదు; బ్రహ్మసమాజ మతస్థులం"— అంటూ అనవసరంగా, నిరర్థక వాక్యం ఒకటి పలికింది.

ఆ యువతి ఏమీ మాటాడలేదు. అచల సంకోచిస్తూ ఆమె చెయి విడిచిపెట్టింది. "మా ఆచార వ్యవహారాలు మీకు తెలియవు అందుచేత మా ప్రవర్తన మీకు కొంత విలక్షణంగా కనిపిస్తుంది"— అన్నది

యువతి మందహాసం చేసింది. "మేము అలా అనుకోము మీరే... ఏదో కారణం పురస్కరించుకుని మాకు దూరంగా ఉండాలని కోరుతూ ఉంటారు నాకూ మీ సమాజంలో ఇద్దరు ముగ్గురు బంధువులున్నారు. వారితోటి నాకు గల అనుభవంవల్ల ఇలా చెప్పగలుగుతున్నాను"

"కారణం ఏమిటంటావు?"

"నీకు తెలుసును. తెలియకపోతే మీ సమాజం వారినే అడిగి తెలుసుకో"— అంటూ నవ్వేసి ప్రసంగం మార్చి మళ్ళీ ఇలా అడిగింది— "అయితే చెప్పావ్వా, ఏవాళా ఎటో వచ్చి కొన్నాళ్ళు మా వూళ్ళో ఎందుకు ఉండకూడదమ్మా?"

"ఆరా నగరానికా?"

"కాదు [illegible] దిక్కుడికి వచ్చి ఉంటూవుంటాను. మా [illegible] దేహారి[illegible]లో, సోన్ నది ఒడ్డున మా కొక ఇల్లు వుంది. అక్కడవుంటే [illegible] రోజుల్లోనే మీ వారికి బాగా స్వాస్థ్యం చిక్కుతుంది"— అంటూ యువతి ఆమె రెండు చేతులనూ తన చేతుల్లో తీసుకుని ఆహ్వానం ప్రకటించింది.

ఆమె ప్రేమ, వాత్సల్యం అచలను ముగ్ధపరచినవి. "కాని మరి మీ-వారేమంటారో! వారికి తెలియకుండా నువు మమ్మల్ని తీసుకు వెళ్లటం మంచిదికాదు" అన్నది అచల.

"అరె అదేమిమాట! ఆడవాళ్లు భర్తలకు దాసీలే అనుకో. అయినా ఆజ్ఞాపించగల రాణులు కూడాను. నేను నా యింటికి యజమానురాలిని కాదా! ఏమీ ఫరవాలేదు. అయినా ఆ సంగతి అంతా నీకెందుకు? మిమ్మల్ని తీసుకువెళ్లేదాన్ని నేను"—అనిఆసౌభాగ్యవతి ఆనందాతిశయాలుప్రకటించింది.

ఆ వచ్చేది 'ఆరా' స్టేషన్. యువతి అచలాదేవి రెండు చేతులనూ పట్టుకుని ఆప్యాయంగా, ఆవేగపూరితయై—"మా స్టేషన్ వచ్చేసింది. ఇక దిగి పోతాను. ఊరికే ఏమేమో ఆలోచించి మనస్సును ఖరాబుచేసుకోవద్దు. నీకేం భయంలేదు. మీవారికి తొందరగానే ఆరోగ్యం చేకూరుతుంది. కాని మీరు తిరిగి వెళ్లేటప్పుడొకసారి ఇక్కడ దిగి మాయింట్లో కొన్నాళ్లు ఉండి పోవాలి. తప్పదు. ఏమంటావు" అని అడిగింది.

అట్టి శుభదినం సంఘటిస్తే తప్పక వస్తాం"—అన్నది అచల కన్నీళ్లా పుకుంటూ.

"ఎందుకు సంఘటించదు? నీ భర్త, ప్రేమ నాకు అర్థమైనవి. నీవంటి పుణ్యవతిని భగవంతుడు ఉపేక్షించలేడు."

అచల జవాబు చెప్పలేదు ముఖంతిప్పుకుని ఒక దీర్ఘనిశ్వాసం విడి చింది.

ఆరా స్టేషన్‌లో రైలు ఆగింది. వర్షం పడుతూనేవుంది. ఆ యువతి భర్త పక్క పెట్టెలోనించి దిగి వచ్చాడు. అచల ఆమె చెవిదగ్గర రహస్యంగా ఇలా చెప్పింది—"మీవారి పేరు నీ నోటిమీదగా చెప్పవు. పోనీ నీ పేరైనా చెప్పు లేకపోతే తిరిగి వచ్చేటప్పుడు మీ యింటికెలా రాగలం?"

యువతి మందహాసం చేసింది "నా పేరు రాక్షసి. దేహరీ నగరంలో ప్రవేశించి చిన్నపిల్లను అడిగినా మా యింటికి తెచ్చి దిగబెడుతుంది. ఒక్కసారి మీ ఇద్దరూ తప్పక రావాలి సుమీ! రాకపోతే నామీద ఒట్టు. మీకోసం ఎదురుచూస్తూవుంటాను" అని పలికి చేతులు జోడించి నమస్కారం చేసి రైలు దిగి వెళ్లిపోయింది.

రైలు కదిలింది. వర్షం పడుతూనేవుంది. గాలి జోరుగా వీస్తోంది. భయంకరంగావుంది రేయి. పెట్టెలో తనతో కులాసాగా కబుర్లు చెప్పే వాళ్లెవరూ లేరు. ఒక మూలకుపోయి అచల దుప్పటి కప్పుకుని పడుకుంది.

కన్నీళ్లు జలజల రాలుతున్నవి. తన విచారానికి, ఆకస్మిక్షోభకూ కారణం ఏమిటో ఆలోచించుకోగల స్థితిలో లేదామె. హృదయం ఆకారణంగా వెక్కి వెక్కి ఏడుస్తున్నది. గుండె ముక్కలైపోతున్నట్టనిపిస్తోంది. ఆమె కప్పుడు వాళ్లనాన్న జ్ఞాపకం వచ్చాడు. చిన్ననాటి స్నేహితురాళ్లంతా తలపుకు వచ్చారు, బామ్మ గుర్తుకు వచ్చింది, మృణాళిని మనోవీధిలో కనిపించింది, ఇంతకుముందే బండి దిగి వెళ్లిపోయిన 'రాక్షసి' అన్న ఆమెకూడా ఆమె స్మృతిపథంలో మెరిసింది. ఆఖరుకు నౌకరు యేసు కూడా మాటిమాటికీ కళ్లముందు మెదులుతూ ఉన్నాడు. వీళ్లందరినీ విడిచి తాను ఎక్కడికో, నిరుద్దేశంగా వెళ్లిపోతున్నది. మళ్లీ ఎప్పటికైనా తాను వాళ్లను కలుసుకోగలదా? అలాంటి వేదన ఏదో ఆమె మనస్సును బాధిస్తున్నది.

రైలు తరువాతి స్టేషన్‌లో ఆగింది. అచలాదేవి హృదయానికి రవంత శాంతి చేకూరింది. లేచి కూచుని కిటికీలోనించి అటూ ఇటూ చూచింది. ఎవరైనా ఒక స్త్రీ తన పెట్టెలో ఎక్కుతుందేమోనని ఆమె ఆశ, కాని ఎవరూ ఆమె పెట్టెలో ఎక్కలేదు.

ఆమె ఒక నిట్టూర్పు విడిచి, దుప్పటి కప్పుకుని మళ్లీ యథాప్రకారంగా పడుకుంది. క్రమేణా దుఃఖవ్యాకులమైయున్న ఆమె హృదయంలో సుఖకల్పనలు పొడచూపినవి. మహిమ్‌బాబు ఆరోగ్యం నిమిత్తం పరదేశానికి వెళ్లాలని మొదట నిశ్చయించుకున్నప్పుడుకూడా ఆమె హృదయంలో ఇట్టి సుఖస్వప్నాలే తాండవించాయి. యిప్పుడుకూడా అలాగే వ్యాధిగ్రస్తుడైన భర్తను జ్ఞాపకంచేసుకుని, ఆయనకు త్వరలో ఆరోగ్యం చేకూరాలని ఆశిస్తూ, ఆయన దీర్ఘాయుష్మంతుడు కావాలని దైవాన్ని ప్రార్థిస్తూ, ఆ కొత్తఊళ్లో కొత్తకాపురంలో సుఖశాంతులను కల్పించుకుంటూ తన్మయురాలై పడుకుంది

తరువాత ఆమెకు నిద్రపట్టింది. ఎంతసేపు అలా నిద్రపోయిందో ఆమెకు తెలియదు; చివరకెవరో తన పేరుపెట్టి పిలుస్తోంటే ఉలికిపడి లేచింది. సురేశ్ వచ్చి ప్లాటుఫారంమీద నిల్చున్నాడు. తెరచివున్న ద్వారం గుండా చల్లగాలి లోనికి ప్రవేశించి పెట్టెనంతా శీతలపరచింది.

"చప్పున దిగి రా! రైలు వచ్చింది. ఏదీ నీ సూటుకేసు?" అన్నాడు సురేశ్.

అచలకు ఇంకా నిద్రమత్తు పూర్తిగా వదలలేదు. జబల్పూర్ వెళ్లేందుకు అవ్వాడులో రైలు బూరపలసేపున్నది. ఆ సంగతి ఆమె కి...

జ్ఞాపకం వచ్చింది. సూటుకేసు తీసుకుని రైలు దిగింది. "కాని యీ చీకటిలో, వర్షంలో వారిని ఎలా రైలుదింపి తీసుకుపోగలం? ఇక్కడ పాలకీ ఏమీ దొరికేటట్టు లేదే! వర్షంలో తడిస్తే ఆయనకు మళ్లీ నెమ్ము చేసి జ్వరం వస్తుందో ఏమో!" అన్నది.

సురేశ్ అందుకు ఏమి జవాబు చెప్పాడో ఆ వర్షపు హోరులో ఆమెకు వినిపించలేదు. అతడొక చేతితో ఆమె సూటుకేసు అందుకుని, రెండవ చేతితో అచలాదేవి హస్తాన్ని గట్టిగా పట్టుకుని నడిపించుకు పోతున్నాడు. బండి కదలటానికి సిద్ధంగా వుంది. ఆమెను ఒక థర్డుక్లాసు డబ్బాలో ఎక్కించి సురేశ్ చెప్పాడు–"నువ్వు యిక్కడ కూచో. నేను వెళ్లి మహిమను తీసుకు వస్తాను"

"అయితే నా వున్నిదుప్పటి మందంగా, వెచ్చగా ఉంటుంది; తీసుకుపోయి బాగా కప్పి చలి సోకనీకుండా తీసుకురండి" –అంటూ అచల తన దుప్పటి తీసి యిచ్చింది. సురేశ్ దాన్ని బుజాన వేసుకుని గబగబా వెళ్లాడు.

అచల సురేశ్ కేసి కిటికీలోనుంచి కనుచూపు మేరవరకూ చూస్తూనే వుంది. సూచిభేద్యంగా అలుముకున్న ఆ చీకటిలో స్టేషన్‌లోని దీపాలు ఉన్నా లేనట్టేవున్నవి. యాత్రికులు వర్షంలో అటుఇటు పరుగులు పెడుతున్నారు. రైల్వేపోలీసులుకూడా తిరుగుతూనే ఉన్నారు. ప్లాటుఫారం అంతా గడబిడగా ఉంది. ఇంతలో గంట మోగింది. అచల దిగివచ్చిన రైలు ఓ పెద్ద కొండచిలువ లాగా సాగిపోయింది.

మళ్లీ గంట మోగింది. అచలాదేవి యెక్కిన బండికి ప్రస్థానసూచన. సురేశ్–మహిమ బాబులు ఇంకా ఎక్కారో లేదో! సామానంతా చేరవేశారో లేదో! ఏ సమాచారమూ తెలియక అచలకు విచారంగా ఉంది. ఇంతలో అది 'మొగల్‌సరాయి' స్టేషన్ అని కూలివాని కేకలవల్ల ఆమెకు తెలిసింది.

గార్డు ఈలవేశాడు. ఆ సమయాన సురేశ్ పరుగెత్తుకువచ్చి–"ఏమీ భయంలేదు. నేను నీ పక్కబండిలోనే ఎక్కుతున్నాను"–అంటూ గబగబా వెళ్లిపోయాడు.

# 28

సురేశ్ పక్కడబ్బాలోనే ఎక్కాడు; బాగానేవుంది. మరి ఆయనో? ఊరికే కళ్లువిప్పి కిటికీ చూస్తూవుందామె, ఆయన్ను చూచి ఎన్నాళ్లో అయినట్టనిపించిందామెకు. పైగా ఇంకో అనుమానం? అలహాబాదులోకదా రైలు మారాలి? ఈ కొత్తస్టేషన్‌లో రైలుమారటం జరిగిందేం? కిటికీలోనించి ముందుకూ వెనకకూ అదేమైనా దేనికోసం చూస్తూవున్నదో ఆమెకే తెలియాలి. ఈ రైల్లో మహిమ్‌బాబు లేడేమోననిగాని, సురేశ్‌బాబు తన్ను ఎక్కడికో ఒక్కతెనే తీసుకుపోతున్నాడేమోననిగాని ఆమె అనుమానించలేకపోయింది ఏబ్బే! ఆయనకూడా ఏదబ్బాలోనో ఎక్కేవుంటాడు.

సురేశ్ ఎలాటివాడైనా ఒక ఆడదాన్ని, సమాజంనించి స్వధర్మంనించి భ్రష్టనుచేసి మృత్యుముఖంలోనికి లాక్కుపోలేడు అతడంత ఉన్మాది మాత్రంకాదు అయినా అతనికందువల్ల ఏం లాభం? అచలాదేవి వేశ్యాస్త్రీ కాదన్న సంగతి తెలుసుకోలేనంత మూర్ఖుడా అతడు? ఏబ్బే అలా ఎన్నటికీ చెయ్యడు. ఆయన్నుకూడా ఏపెట్టెలోనో ఎక్కించే ఉంటాడు.

ఇంతలో ఒకవర్షపు జల్లు వచ్చి ఆమెముఖం అంతా తడిసిపోయింది తిన్నగా ఆమె ఒక మూలకు ఒదిగింది అప్పుడు చూచుకుంటే ఆమె బట్టలన్నీ తడిసే ఉన్నాయి. దుస్తులుమార్చుకుందామని సూటుకేసు తెరిచింది ఇంతలో రైలు స్టేషన్‌లో ఆగింది. అది ఏ స్టేషనో ఆమెకు తెలియలేదు తెరచిన సూటుకేసు అలాగే వదలివేసి అచలాదేవి రైలుదిగి సురేశ్‌బాబు ఉన్న పెట్టె వద్దకు వచ్చింది అవర్షంలో తడుస్తూ.

"సురేశుబాబూ!"

ఆడబ్బాలో ఇద్దరుభారతీయులూ ఒక ఆంగ్లేయుడూ ఉన్నారు. ఒకమూల ఎక్కడో సురేశుబాబు ఒంటరిగా ఆలోచనా నిమగ్నుడై కూచుని ఉన్నాడు. తనకంఠస్వరం అసహజంగా ధ్వనిస్తుందేమోనని అచలకు అనుమానంగానే ఉంది. ఆమె అనుమానించినట్లుగానే ఆపిలుపు దెబ్బతిన్న లేడి అరుపువలె శబ్దించింది. సురేశ్‌బాబే కాదు, ఆపెట్టెలోని వారంతా ఆపిలుపుకు ఉలికిపడి చూచారు. ఆశ్చర్యపోయారు. గబగబా సురేశ్ తలుపు దగ్గరకు వచ్చాడు.

"అతను ఏరీ? ఎక్కడున్నారు? ఏ పెట్టెలో?"—అంటూ ప్రశ్నించింది, అచల.

"పద, చూపిస్తాను"—అంటూ సురేశ్ రైలు దిగాడు. వర్షం పడుతూనే ఉంది సురేశ్ ఆమె చెయి పట్టుకుని ఆమెవచ్చిన వైపుకే తీసుకుపోయాడు.

పెట్టెలోని భారతీయులిద్దరూ ఒకరి ముఖం ఒకరు చూసుకుని నవ్వుకున్నారు. ఆంగ్లేయునికిమాత్రం ఏమీ అర్థంకాలేదు. కాని అచలాదేవి వ్యాకుల కంఠధ్వని ఆయన హృదయాన్ని కదిలించింది దుప్పటి కాళ్లపై కప్పుకుంటూ ఒక దీర్ఘనిశ్వాసం విడిచి స్తబ్ధుడై కిటికీలోనించి బైటికి చూస్తూ కూచుండిపోయాడు.

ఆ ఫస్టుక్లాసుపెట్టె దగ్గరకువచ్చి సురేశ్ ఆగాడు. లోపలికి చూచాడు. "అదేమిటి? నీ సూటుకేసు తెరచివుందేం?" అని అడిగి ఆమె ప్రత్యుత్తరం ఆశించకుండానే బలవంతాన ఆమెను పెట్టెలోకి ఎక్కించాడు. తానూ ఎక్కి తలుపువేశాడు.

"సూటుకేసు ఎవరు తెరిచారు?" అని అడిగాడు సురేశు.

"పోనీ దాని సంగతికేంగాని ఆయనెక్కడున్నారో నాకు చూపించండి తీసుకుపోయి. లేదా ఏ పెట్టెలో ఎక్కారో చెప్పండి; నేనే వెతుక్కుంటూపోతాను"—అంటూ అచల తలుపుతీసి నడిచింది. సురేశు ఆమె చెయి పట్టుకుని నిలిపి—"యిప్పుడేమంత తొందరవచ్చింది? రైలు కదలబోతున్నది. తెలుసునా?"—అన్నాడు.

నిజమే. రైలు కదిలింది. అచల కన్నుల్లో నిరాశ తాండవించింది. నీరసచిత్తయై నిల్చి సురేశుకేసి చూచింది. కాంతిహీనమై, పాలిపోయింది అతని ముఖం. మరుక్షణమే ఆమె వ్రేళ్లు నరికిన వృక్షంవలె అతని పాదాలపై వ్రాలి—వారేరీ? నిద్రపోతూంటే రైల్లోనించి బైటికి నెట్టివేశావా? పాపం వ్యాధిగ్రస్తులైఉన్న ఆయన్ను హత్యచేసి నువు—" అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

ఆ భీషణ దోషారోపణవాక్యం ఆమె ముగించలేకపోయింది. ఆమె హృదయం రోదనతో సహస్రధా ఛిన్నమైపోయింది. ఆమె హృదయంలోని అంధకారం బైట వ్యాపించిన ఆ కటికచీకటిలో విలీనమైపోయింది. సురేశు

నిశ్చేష్టుడై చూస్తూ కూచున్నాడు. కానీసటీవరకూ అతను ఉన్నట్టే లేదు. చివరకన్నాడు—"నేనలాంటి పని చేయగలనని నీకు నమ్మకం ఉందా?"

"నువ్వు ఏమైనా చేయగలవు. ఆ రాత్రి యింటికి నిప్పుపెట్టి ఆయన్ను చంపివెయ్యాలని చూచావు. నీ పాదాలు పట్టుకుని ప్రార్థిస్తున్నాను ఆయన్ను ఎక్కడ దిగవిడిచావో చెప్పు"—అంటూ ఆమె ఏడుస్తూనే అతని పాదాలు గట్టిగా పట్టుకుని తన నెత్తిపై పెట్టుకుంది. ఆమె మాటలకు, చేష్టలకు సురేశ్ అచేతనునివలె అయిపోయి గుడ్లు ఒప్పచెప్పి చూస్తూ కూచున్నాడు.

రేయి ఉన్మత్తభూతమువలె అనేకరీతుల విజృంభిస్తూ సాగుతోంది. మెరుపులు చీకటిలో తళతళ శస్త్రచాలనం చేస్తున్నాయి. ఆకాశాన మేఘపటలం ప్రకృతికంతకూ వికృతరూపం ఇచ్చినవి కాని రైలుపెట్టెలో ఉన్న ఆ ఇద్దరి హృదయాల్లోని గందరగోళం ముందు బాహ్యప్రకృతిలోని కోలాహలం అంత భయంకరమైనది కానేకాదు.

అకస్మాత్తుగా అచల బాణంలా లేచి నిల్చుంది. సురేశ్ దిగ్భ్రాంతుడైనాడు. ముందు స్టేషన్ సమీపిస్తున్నది కాబోలు రైలు వేగం తగ్గుతోంది. అచల ఎందుకలా లేచినిల్చుందో సురేశ్‌కు అర్థంకాకపోలేదు. చెయి చాచి ఆమెను 'ఆగు'మని హద్దుపెట్టి చెప్పాడు—"శాంతంగా కూచో; మహిమ్ ఈ రైల్లో లేడు"

"లేరూ? మరేమైనారు?"—అంటూ అచల సీటుమీద కూలబడింది.

అచలాదేవి ముఖంలో నెత్తురు చుక్కలేదు. ఇంత సేపటినించీ ఎంత ఏడుస్తున్నా, ఎంత అనుమానం బాధిస్తున్నా హృదయంలో ఒక అవ్యక్త ఆశా కిరణం తళుకుమంటూ ఉంది. ఇప్పుడా ఆశ పూర్తిగా నశించింది. క్షణకాలంలో తన జీవితం ఒక అగాధ అంధకార కూపంలోనికి జారిపోయిందా?

బండి స్టేషన్‌లో ఆగింది; మళ్లీ సాగిపోయింది. సురేశ్ ఎన్నో చెబుదామనుకుంటూ ఆగిఆగి చివరకిలా చెప్పాడు—"మహిమ్ క్షేమంగానే ఉన్నాడు ఈపాటికి అలహాబాదు చేరి ఉంటాడు, అక్కడినించి జబల్పూరు వస్తాడు; మళ్లీ కలకత్తా కూడా చేరుకుంటాడు"

"మరి మనం ఎక్కడికి వెళుతున్నాం?"

అశ్రుకళంకితమైన ఆమె ముఖంలో దుఃఖం, నిరాశ సురేశ్‌కు కనిపించాయి. నిజానికి తాను పొరపాటుగానే ప్రవర్తించినట్లు భావించుకుని ఎం

[illegible]-చుకున్నాడు. ఆత్మహత్య చేసుకుందామనిపించింది కాని అచల చిరునవ్వు ఎన్నివేలసార్లు మోసగించింది? ఆమె మోసపు ప్రవర్తనే తన సత్య దృష్టిని మాటుపడ చేసింది తత్ఫలితంగా తానూ ప్రవర్తించాడు. ఆ క్షణాన అతని హృదయం ఆమెపట్ల విద్వేషపూరితమైపోయింది "మనం బహుశా సశరీరులమై నరకానికి వెడుతున్నాం. నువ్వు నన్ను అథఃపతన మార్గాన్న లాగికొని పోతున్నావు మధ్యలో ఆగటమెందుకు? చివర దాకా పోవల సిందే" అన్నాడు తీవ్రంగా.

ఆమాటలకు అచల ఆపాదమస్తకం వొణికి పోయింది. తల వాల్చుకుని నిరుత్తరయై కూచుంది పరస్త్రీని మోసంచేసి చెడుమార్గానికి లాక్కుపోతూ పైగా ఆమెపై నిస్సంకోచంగా, సిగ్గువిడిచి నిందారోపణ చేసే కాపురుషునితో మాటాడటం కూడా సబబుకాదని ఆమె అనుకుంది.

సురేశు కామె పాషాణ ప్రతిమగా కనిపిస్తున్నది. ఇంకా ఇలా అన్నాడు — "సర్వవిధాలా నీకే వినాశనం దాపురించినట్టు భావిస్తున్నావు. నా సర్వనాశనం ఎంతవరకు పూర్తి అయిందో తెలుసుకోగలవా? మీకుమల్లే నేను బ్రహ్మజ్ఞానిని కాదు; నేను నాస్తికవాదిని పాపమనీ పుణ్యమనీ చచ్చు మాటలు పలికే వాణ్ణి కాదు సర్వనాశన హేతువైన పంథాయే నాకు కనిపిస్తూన్నది. నీలో సౌందర్యం ఉంది కన్నులో అశ్రువులున్నాయి — స్త్రీల వద్ద సాధారణంగా ఉండే అస్త్రశస్త్రాలన్నీ నీతూణీరంలో ద్విగుణంగా ఉన్నాయ్ వాటి సహాయాన నీజీవన మార్గంలో అడ్డంకులేమీరావు మరి నా భవిష్యత్తు ఏమిటో ఊహించుకోగలవా? నేను పురుషుణ్ణి. నేను జైలుకుపోకండా ఉండాలంటే నన్ను నేనే తుపాకితో పేల్చుకోవాలి" — అంటూ సురేశు ఆవేశచిత్తుడై నిల్చున్నాడు.

అచల ఏమో చెప్పాలనుకుంటూ తలెత్తింది. కాని మాట రాలేదు. ఆమె కన్నుల్లో సురేశుపట్ల విద్వేషం ప్రజ్వలిస్తూ ఉన్నది. సురేశు అది చూచి క్రోధావేశం పట్టలేక ఇలా అన్నాడు — "నెమలి పింఛం ధరించి కాకి చక్కని దనిపించుకో గలదా అచలా? ఆ నీ ద్వేష పూరితమైన చూపు నీ ముఖాని కేమీ శోభస్కరంగా లేదు మృణాళిని అలా చూచిందంటే అర్థంఉంది. అట్టిచూపు ఆమెకైతే శోభస్కరమే నీకు మాత్రంకాదు. నువ్వు అసూర్యంపశ్యవైన హిందూకుల స్త్రీ వేమీకాదు. ఇంత మాత్రాన నీ జాతి పోయేదేమీలేదు. వెళ్లాలనుకుంటే నీ యిష్టంవచ్చినచోట దిగిపో. నేను ఉత్తరం వ్రాసియిస్తాను మహిమ్‌బాబుకు చూపించు. అతడు

నిన్ను స్వీకరిస్తాడు ధనం యిస్తాను, మీ నాన్నకివ్వు. ఆయన నోరు మూత పడుతుంది ఇంకా నీకు చింత యెందుకు? ఇదేమంత పెద్ద అపరాధమనీ?"

మంటలు గ్రక్కుతూన్న శూలాలవలె వున్నవి సురేష మాటలు వేటగాడు దీము పెట్టిన ఖాద్యవస్తువు చూచి ఆడవిమృగం ప్రలోభపడి వలలో చిక్కుకుంటుంది అప్పుడు దాని కెక్కడలేని క్రోధంవచ్చి ఆ వలను అటూ ఇటూ కుమ్ముతూ ముక్కలుముక్కలు చెయ్యాలని ప్రయత్నిస్తుంది. అలాగే సురేషకూడా అచలను చింపరపండరగా చీల్చిచెండాడాలని చూశాడు. మళ్లీ ఇలా అన్నాడు—"ఇదేమంత పెద్ద భయంకరమైన అపరాధమనీ? భర్తృపోషణార్థ' ఉంటూ అతని యింట్లో అతని ముఖాన్నే 'నిన్ను నేను ప్రేమించటంలేదు' అని ఖచ్చితంగా చెప్పినదానివికదూ నువ్వు? జ్ఞాపకం వుందా? యింటికి నిప్పుపెట్టి నీ భర్తను చంపటానికి ప్రయత్నించాడని నువ్వు ఇప్పుడు నిందిస్తూన్న ఆ పురుషునితోటే కలకత్తాకు ప్రయాణమై రావాలని పట్టుపట్టావు అతనితో నే బయలుదేరి వచ్చేశావుకూడాను. అప్పుడే మరచిపోయావా? అతనియింట్లో, అతని ఆశ్రయంలో నే ఇన్నాళ్లూ ఉండి జబల్పూరుకు అతన్నికూడా రమ్మనికన్నీళ్లు పెట్టుకు బ్రతిమాలావు. గుర్తు ఉన్నదా? వాటన్నిటినీ మించిన పెద్ద తప్పాయేమిటి ఇది? వాటిని బోలినవే ఇంకా ఎన్నో పనులు క్షమ్మరించావు. అందుచేతనే నేను ఈనాడు ఇలా సాహసించటం జరిగింది. నిజానికి నువ్వు ఒక వేశ్యవు కాబట్టే ఇలా నిన్ను మోసగించి తీసుకుపోతున్నాను. ఇందుకు నువ్వు మొట్టమొదట కాస్త ఆశ్చర్యం ప్రకటిస్తావు అంతకంటే నువ్వు ఎక్కువగా బాధపడేదేమీ ఉండదు. నువ్వు సతీ సావిత్రివంటి దానివేమీ కాదు. అట్టి భారత యువతుల తేజస్సు, ఆత్మగౌరవం నీలో నున్న."

అని పలికి సురేష ఒకదీర్ఘ నిశ్వాసం విడిచి ఊరకున్నాడు అచల తలయెత్తి ఛీత్కారం చేసింది "ధన్యోస్మి అపివేశారేం సురేషబాబూ! కాస్త ఉండి భాషలో ఎంత కుత్సితమైన వ్యంగ్యం ఉందో, ఎంత కటువైన అవమాన వాక్యాలు ఉన్నాయో—అన్నీ నాపై విశృంఖలంగా కురిపించండి"

[illegible]

ఇలా అన్నది—"అటు నాకు కావలసింది; ప్రజలవల్ల, భగవంతునివల్ల, మీ వల్ల నేను పొందగలిగే ఒక బహుమానం ఆశ"

సురేష రాయిలా నిలబడిపోయి చూస్తున్నాడు. ఆమె నుదుర్ల [illegible] క్రింద జారిపోతున్నవి. [illegible] తడిసి [illegible]

చీర మట్టిసోకి మలినమైపోయింది. తన ఉండేలుదెబ్బకు నేలబడి విలవిల కొట్టుకుంటూ ఉండే పిట్టవేపే తదేకదృష్టిని అవలోకిస్తూవుండే కొత్తవేటగాని వలె సురేశబాబు ... మరణవేదనలోవలె దోధూయమానమౌతున్న ఆ నారీమూర్తివేపే నిర్నిమేషదృష్టిని చూస్తూ నిల్చున్నాడు.

ఇంతలో రైలు స్టేషన్లోవచ్చి ఆగింది. "నిన్ను ఈ స్థితిలో ఎవరైనా చూచారంటే గోలచేస్తారు లేచి సరిగా కూచో. నేను నా పెట్టెలోకి వెళ్లిపోతున్నాను. తెల్లవారిన తరువాత నువ్వు ఎక్కడ దిగదలచుకుంటే అక్కడే దింపుతాను. ఎక్కడికి వెళ్లదలచుకుంటే అక్కడికే పంపిస్తాను"_అంటూ సురేశ తలుపు తెరచుకొని రైలుదిగి, మళ్లీ ఏమనుకున్నాడో, అక్కడే కాసేపు మౌనంగా నిల్చుండి, చివరకు ముందుకువంగి "నీకు నా మాటలు సరిగా అర్థమైవుండవు. కాని ఈ సమస్యా పరిష్కార భారం నా నెత్తిమీదే వేసుకుంటున్నానని నువ్వు నమ్ము. నీకేమీ అమంగళం జరుగదు. ఋణమంతా నేనే దమ్మిడీ అసలుఫాయిదాలతో తీరుస్తాను" అంటూ తన డబ్బాలోకి వెళ్లిపోయాడు.

రైలు మళ్లీ కదిలింది; రాత్రి ఎంతో గడిచింది సురేశ ఏలోకంలో ఉన్నాడో అతనికే తెలియటంలేదు. జ్వరం తగులుతుందేమోనని అనుమాన పడ్డాడు. ఇంతలో అతనికేదో పరిచిత కంఠం వినిపించింది. సురేశ తెలివి వచ్చి చూచాడు. రైలు ఏదో స్టేషన్లో ఆగివుంది. వర్షం తగ్గిపోయింది. తెల్లవారుతున్నట్లుంది. ప్లాటుఫారంమీద ప్రయాణీకులు గుమిగూడి ఉన్నారు అచల ఒక కూలీవాణ్ణి పిల్చి తన సూటుకేసు వాడికిచ్చి రైలు దిగి గేటువైపు నడిచి వెడుతోంది. సురేశ్ నిశ్చేష్టుడై చూస్తూవున్నాడు.

ఇంతలో బండి కదిలేందుకు గంట మోగింది ఆ మోత ప్లాటుఫారం ఈ మూలనించి ఆ మూలవరకు బంయిమని ప్రతిధ్వనిచ్చింది. దానితో సురేశ్ ప్రపంచంలోకి వచ్చాడు. తన్ను ఆశ్రయించివున్న జడత్వం విచ్చిపోయింది. వెంటనే సూటుకేసు తీసుకుని రైలు దిగాడు.

అచల.. టికెట్ కలెక్టరు [illegible] చూచేంతవరకూ తనవద్ద టికెట్ లేదన్న సంగతే స్ఫురణకు రాలేదు, గేటుదగ్గర అలాగే నిల్చుండిపోయింది.

"నిల్చున్నావేం, పద. నా టిక్కెట్టు యిస్తున్నాలే." [illegible] సురేశ్ వెనకాల రానే వచ్చాడు.

సురేశ్ కూడా రైలు దిగి వస్తున్నాడని ఆమెకేం తెలుసూ? ఉలిక్కి పడింది. సంకోచించింది అనుకు[illegible]. కాని పరులెవరూ తన పరిస్థితిని గమనించకుండా తన్ను తాను నిగ్రహించుకొని ముందుకు సాగిపోయింది.

"నువ్వు తిరిగి కలకత్తా వెళ్ళిపోతావేమో ననుకున్నాను. ఇక్కడ దేహారీలో దిగావేం? యిక్కడ నీ కెవరన్నా పరిచితులున్నారా?"

"కలకత్తాలో ఎవరింటికి వెళ్ళనూ?" — అన్నది అచల అటు ప్రక్కకు చూస్తూ.

"మరి యిక్కడ?"

అచల మాటాడలేదు కాసేపు ఊరుకుని సురేశ్ అన్నాడు—"ఇప్పుడు నువ్వు నా మాట విశ్వసించే స్థితిలో లేవు. అందుకు నిన్ను నే నేమీ తప్పుపట్టేది లేదు కాని నా కడసారి ప్రార్థన ఒకటి నువ్వు మన్నించాలి".

అచల పూర్వంలాగే మౌనంగా నిల్చుంది.

"నా మాటలెవరికీ అర్థంకావు అర్థమయేలాగు విశదీకరించే ఉద్దేశం నాకు లేదు మళ్ళీ ఇలాంటి అగ్ని సాహ్యాదయంలో ప్రవేశించకుండా ఉండే ఏ పరాయిదేశానికో ప్రయాణమై వెళ్ళిపోతాను నా చిరవాంఛితాన్ని మాత్రం నువ్వు ప్రసాదించాలి చేతులు జోడించి ప్రార్థిస్తున్నాను"— అన్నాడు సురేశ్.

ఈసారికూడా అచల పెదవులు విప్పలేదు. సురేశ్ ఇంకా ఇలా అన్నాడు—"నేను నిన్ను దూషించాను నీ మనస్సుకు చాల కష్టం కలిగించాను. కాని లోకం నిన్ను కులట అని నిందించేట్టయితే అది నేను సహించలేను. నామూలంగా నువు అంత దుఃఖభాజనవు కావటం నాకిష్టంలేదు."

అతని కంఠస్వరంలో ఏమి ఉందో భగవంతునికే తెలియాలి. వేడి అశ్రువులతో అచల నేత్రాలు నిండిపోయాయి, "నన్ను ఏం చెయ్యమంటారు? చెప్పండి—"అని మృదువుగా అడిగిందామె.

సురేశు జేబులోనించి రైల్వే టైంటేబిల్ తీసి బండివేళ గుర్తించి అన్నాడు—"నువ్వు చెయ్యవలసింది ఏమీలేదు మళ్ళీ సాయంత్రం వరకూ రైలు లేదు. ఈలోగా మాత్రం నువు నన్ను గురించి అన్యథా భావించకు. నావల్ల నీకేమీ అరిష్టం జరగదు. నీమీద ఒట్టువేసుకు చెబుతున్నాను నన్ను విశ్వసించు"

అచల జవాబేమీ చెప్పలేదు, కాని అందుకు సమ్మతించినట్టే కనప డింది.

తిరిగి స్టేషన్‌లోకివచ్చి 'వెయిటింగ్ రూము'లో కూచుందామన్న ఉద్దేశం ఇద్దరికీ లేదు. అనతిదూరంలోనే బాదుషాహ్ ధర్మసత్రం ఒకటి వున్నట్టు తెలిసింది. ఇద్దరూ తాత్కాలికంగా హృదయవేదనను మరచిపోయి బండీ యెక్కి అక్కడికి వెళ్లారు.

దారిలో ఒకరితో ఒకరు ఏమీ మాటాడలేదు ఒకరిముఖం ఒకరు చూడనూలేదు. బండి సత్రంముందు ఆగింది; బండి దిగుతూన్న సురేశ్ ముఖం చూచింది అచల ఆమె ఎందుకో ఆశ్చర్యపడ్డది. ఉద్విగ్నచిత్త అయింది. అతని కళ్లు ఎర్రబడినవి. ముఖమంతా నల్లబారింది ప్రపంచంలో అనేక రకాల ఆపదలను అనుభవిస్తూన్న వాళ్లను ఆమె చూచింది. కాని ఆ సమయంలో సురేశ్‌బాబును బోలిన దయనీయమూర్తిని ఆమె యెన్నడూ చూడ లేదు.

సంగతేమిటో అడుగుదామనుకుంది ఆమె; కాని అడగలేకపోయింది. "నువ్వు ఆ గదిలోకివెళ్లి విశ్రాంతితీసుకో. నేను ఆ పక్కగదిలోకివెళ్లి దుస్తులు మార్చుకుంటాను"-అంటూ సురేశ్ తన నూటుకేసు పుచ్చుకుని సురాపానమత్తునిలా తూలుతూ పక్కగదిలోకి వెళ్లిపోయాడు.

తన గదిలో సూటుకేనుమీద కూచుని అచల వీధిలో వచ్చేపోయే వాళ్లను చూస్తూవుంది.

---

# 29

ఆశలు, ఆశ్వాసనలు సృష్టించుకుంటూ అలా పెట్టెమీద ఎంతసేపు కూచుందో ఆమె ఎరగదు. సూర్యోదయమైంది. దిశలు తెలివి నొందుతున్నవి రాజమార్గాన ప్రఫుల్లచిత్తులై ప్రజలు వస్తూపోతూ ఉన్నారు. జట్కాలు కూడా పర్యటనం చేసుకుంటూ పరుగిడుతున్నవి. గొల్లకాపరులు పశువుల మందలను తోలుకుని పాటలు పాడుకుంటూ పొలాలకేసి వెడుతున్నారు. ఆ ప్రక్కనే ఒక పూరింట్లోనించి తిరుగలి విసురుతూన్న చప్పుడు వినిపి

స్తోంది. దానితోపాటు ఆయింటి కోడలు కాబోలు ఏదో పాటపాడుతోంది. అచలాదేవి హృదయవేదన తాత్కాలికంగా ఏమూలనో అణిగిపోయింది.

ఇంతలో ఇద్దరు పిల్లలెవరో అక్కడికి వచ్చారు ఆ ప్రక్కన నిల్చుని ఆమెకేసి విచిత్రంగా చూస్తున్నారు. అచల వాళ్లను చూచింది. ఇదివరకెవ్వరూ తనలాంటి విశిష్ట అంధులెవరూ ఆ పాంథశాలకు వచ్చియుండలేదేమో. అందుకే ఆపిల్లలు తనకేసి అలా తేరిపారచూస్తున్నారని ఆమె అనుకుంది. నిద్రలేచి ఆడుకునేందుకు వచ్చారుకాబోలు వాళ్లు.

వాళ్లను పలకరించి చూదామనిపించిందామెకు. కాని ఆమె తమకేసి చూడగానే ఆపిల్లలు గబగబా ఎక్కడికో పరుగెత్తుకుపోయారు. వెంటనే ఆమెకు సురేశ్ జ్ఞాపకం వచ్చాడు బట్టలు మార్చుకువస్తానని వెళ్లినవాడు రెండుగంటలయింది గదిలో నుంచి బైటికిరాలేదు ఇంతసేపటినించీ ఏంచేస్తున్నాడో తెలుసుకుందామని ఆమె లేచి గదిముందుకువచ్చి కాసేపుఅలాగే నిల్చుంది. తరువాత తిన్నగా తలుపు తెరచి లోపల ప్రవేశించింది. ఆమె శరీరమూ, మనస్సు రాయిలా అయిపోయినవి. అది ఒక చీకటిగది. ఒక్కటే కిటికీవుంది అందులోనించిమాత్రం ఒక వెలుగుకిరణం వస్తోంది. ఊపవలేదు_ పెట్టలేదు. ఆ మట్టినేలమీద పడివున్నాడు సురేశ్. దుస్తులు మార్చుకున్నట్టులేదు. సూటుకేసు తెరచివుంది. రెండుమూడు గుడ్డలేవో నేల మీద పడివున్నవి అతడు నిద్రపోతున్నట్టున్నాడు.

స్టేషన్ దాటివచ్చాక అతడన్న చివరిమాటలామెకిప్పుడు జ్ఞాపకం వచ్చాయి. అతడు డాక్టరు. ఇతర్ల ప్రాణాల్ని కాపాడటం ఎరిగినవాడు. ప్రాణంతీసే విధానాలుకూడా ఎరిగేవుంటాడు నేలపై పడివున్న అతని శరీరంకేసి చూస్తోంటే ఆమెలో ఏవేవో భయంకర భావాలు ఉత్పన్నమైనవి. తలుపు గట్టిగాపట్టుకుని ద్వారంచెంతనే నిల్చుంది. లోనికిపోయేధైర్యం ఆమెకు లేకపోయింది.

ఆమె కన్నుల్లోనుంచి అశ్రువులు ప్రవాహం కడుతున్నవి. పాపంఅతడు తనమూలాన ఎంతో అపకీర్తి నెత్తినవేసుకుని అలా ప్రపంచంనించి వెళ్లిపోయాడు అతని అపరాధం ఘోరమైనదే కావచ్చు. కాని ఈసమయాన అతని అవస్థచూచి జాలిపడి క్షమించలేని కఠిన హృదయం ఉంటుందా? ఆ సమయాన అచలకు మొదటిసారిగా తన అపరాధంకూడా స్పష్టంగా మనస్సుకు గోచరించింది.

సురేశ్‌తోడి ప్రథమపరిచయం అయిననాటినించి నేటివరకూ అడపా తడపా తనలో రేగుతూవచ్చిన భావాలను, కావించిన పొరపాట్లను ఆమె స్మరణకు తెచ్చుకుంది. సురేశ్‌తోబాటు తన తండ్రిగారి ప్రవర్తనకూడా ఆమెకు జ్ఞాపకం వచ్చింది. తన పాపాలనే కాదు, ఇంకా అనేకమంది పాపాలను కూడా తల మూటగట్టుకుని ఈనాడు సురేశ్ భగవంతుని పాదాలముందుకు చేరుకున్నాడు. ఆ మహాన్యాయకర్త విధించే శిక్షను కిమ్మనకుండా అనుభవిస్తాడు లేదా తన దుఃఖాలన్నీ విప్పిచెప్పుకుని, ఇతర్లు తనకు కావించిన అపచారాలను విన్నవించుకు క్షమాభిక్ష యాచిస్తాడు.

ఈవ్యక్తి అగర్భ శ్రీమంతుడు. భోగవస్తువుల కొరత యేమాత్రమూ లేదు. అయినా మనిషిలో లేశమాత్రంకూడా ఆడంబరం లేదు. సర్వం త్యజించి పాపం వెళ్లిపోయాడు. ఒక అవ్యక్తవేదన ఆమె హృదయాన్ని క్షోభ పెడుతున్నది. అతడు తన్ను హృదయపూర్వకంగా ప్రేమించినమాట అక్షరాలా నిజం. అందులో సందేహం లేదు.

కన్నీళ్లతో ఆమె బుగ్గలు తడిసిపోయినవి. ఆ రాత్రి రైల్లో తనకూ అతనికీ ఏమేమో అవాచ్యమైన సంభాషణే జరిగింది. అదంతా ఇప్పుడామెకు అర్థహీన ప్రలాపంలా తోచింది. ప్రేమకు జాతియేమిటి? ధర్మవిచారణ యేమిటి? మంచిచెడ్డల స్పష్టీకరణ మేమిటి? మానవసంఘం సృష్టించిన నీతినియమాలకు ఈ జీవి అతీతుడు. లేకపోతే ఇలా ప్రాణత్యాగం చేయగలడా? సంఘం విధించే విధినిషేధాలన్నీ స్పృశించలేవు

అచల పైటచెరగుతో కన్నీళ్లు తుడుచుకుంది. ఆమెగుండె దడదడ కొట్టుకోవటం ఆరంభించింది. ఏమి చెయ్యాలి ఈ శవాన్ని, ఈ అపరిచిత ప్రదేశంలో? ఇంతలో మూలుగుతూ సురేశ్ అటుప్రక్కకు తిరిగాడు. ఓ, అతడు చావలేదు, బ్రతికేఉన్నాడు. గబగబా వరుగున వచ్చి అచల అతని పాదాల మీద పడిపోయింది, "సురేశ్ బాబూ!" అంటూ.

సురేశ్ కళ్లుతెప్పి చూచాడు. ఏమీ మాటాడలేదు. అచలకూడా మరేమీ మాట్లాడలేకపోయింది. ఆమెకు దుఃఖం పొంగివస్తున్నది. కన్నీళ్లు ఏకధారగా ప్రవహిస్తున్నవి. కాని క్షణపూర్వం విడిచిన కన్నీళ్లకు ఈ కన్నీళ్లకు ఎంత భేదం వుంది?

ఇందాకటినించే ఆమెను అధికంగా పీడిస్తూన్న చింత ఏమిటంటే - ఈ అపరిచిత ప్రదేశంలో సురేశ్ శవాన్ని ఏం చెయ్యాలి? తనకాస్థితిలో

ఎవరు సహాయం వస్తారు. చూడవచ్చిన వారంతా అనేక ప్రశ్నలడుగుతారు, వాటన్నిటికీ తానేమి సమాధానం ఇవ్వాలి? ఒక వేళ పోలీసులు వచ్చి తన్ను తానాను తీసుకుపోవచ్చును. ఇలా ఆమె హృదయం పరిపరివిధాల విషాద భావతరంగాల్లో విచలితమాతూ ఉంది. ఇప్పుడు సురేశ్ బ్రతికే ఉన్నాడని తెలియగానే ఇంతసేపటి నుంచీ తన్ను తరిమస్తున్న ఆపదలు తొలగి పోయా యని గుర్తించినంతనే ఆమె దుఃఖం ఆగలేదు. సురేశ్ యెడల కృతజ్ఞతా పూర్ణములైన అశ్రువులు అవి.

కాసేపు గది అంతా నిశ్శబ్దం. చివరకు సురేశు అడిగాడు—"ఏడు స్తున్నావెందుకు అచలా?"

"మీరు ఇలా పడిఉన్నారేం? ఎంత గాభరా పెట్టారు నన్ను!"— అన్నది అచల గద్గద కంఠాన.

ఆమె కంఠస్వరంలో స్నేహభావం, కరుణ తొణికిసలాడి సురేశ్ హృదయంలో ఒక విచిత్రమైన మోహాన్ని పెంపొందించింది." అంత ఎక్కువగా నిద్రవస్తోంటే...నాతో చెబితే...గది ఊడ్చి పక్క వేసేదాన్నిగా. మళ్లీ సాయంత్రానికి గాని రైలు రాదాయెను —" అన్నది అచల.

సురేశ్ ఏమీ పలకలేదు, స్నేహపూర్వకంగా చూస్తూ ఆమె దక్షిణ హస్తాన్ని గ్రహించి తన నుదుటిపై అదుముకున్నాడు. ఒక దీర్ఘ నిశ్వాసం విడిచాడు.

"అరె, చాల వేడిగా ఉందే. మీకు జ్వరం వచ్చినట్లుంది"— అన్నది అచల ఉలికిపడి

"ఔను ఈ జ్వరం తేలిగ్గా నయమయ్యేదిగా కనిపించటంలేదు. బహుశా —"

నెమ్మదిగా అచల తన చేయి లాక్కుంది. అతని మాటలకు ప్రత్యుత్తరంగా ఆమె ఒక నిట్టూర్పు విడిచింది. క్షణపూర్వం ఆమెలో ఉబికిన స్నేహం, కరుణ మిళితమై పాషాణంగా మారిపోయాయి. తన ధైర్యాన్ని, సహనశక్తిని కూడదీసుకుని ఎలాగో సాయంత్రం రైలువేళ అయేవరకూ కాలం వెళ్లబుచ్చదామనుకుంది కాని తలవని తలంపుగా కొత్త ఆపదలు కమ్ముకు వస్తున్నవి నిరాశామహాంధకారం వ్యాపిస్తున్నది ఇక ఆమెకు మృత్యువు కంటె వేరే శరణ్యం కనిపించటంలేదు.

జ్వరగ్రస్తుడైన సురేశ్‌ను విడిచి తాను వెళ్లిపోతే బాగుంటుందా? అతనికీసమయంలో పలకిన సేవ చేయవలసిన భారం తన నెత్తిపై పడింది.

నా అన్నవాళ్లులేని ఈ ప్రదేశంలో తానేమి చేస్తుంది? ఎవరి సహాయాన్ని అర్థిస్తుంది? తనకు ఎవరి సానుభూతి లభిస్తుంది? రోజులు ఎలా గడుస్తాయి? — ఈప్రశ్నలన్నీ విద్యుత్ప్రవాహంవలె ఆమె మేధస్సులో భయంకరంగా మెరిశాయి. ఎక్కడికైనా పారిపోవాలా? నెత్తిబాదుకుని ఏడవాలా? ఆత్మహత్య చేసుకుని ఈ అభాగ్య జీవితాన్ని ఇంతటితో అంతంచెయ్యాలా? కర్తవ్యతావిమూఢయై రాపడిపోయిందామె.

---

# 30

ఆనాడు మహిమ్‌బాబును, అచలను రైలెక్కించి కేదారబాబు విచారంగా యింటికి తిరిగివచ్చాడు. ఆ సమయాన వర్షంలో ఏమాత్రమో తడిసి రావటంచేత నుస్తీచేసింది వాతం ప్రకోపించింది. శీతజ్వరంతో బాధపడుతున్నాడు. ఎన్నాళ్లకూ కూతురుదగ్గరనుంచి గాని, అల్లుడుదగ్గరనుంచి గాని కుశలంగా జబల్పూరు చేరుకున్నట్లు ఉత్తరమే రాలేదు. అదొక విచారం మనసులో బాధిస్తున్నది జబల్పూరులోని తన మిత్రునికి ఉత్తరం రాశాడు. "వాళ్లెవరూ ఇంతవరకూ జబల్పూరు చేరలేదు ఏమైనారో తెలియదు"— అంటూ ఆ మిత్రుడు తిరుగుజబాబు వ్రాశాడు. ఆ వాక్యమే పదిసార్లుచదువుకున్నాడు. ముఖం కళావిహీనమైపోయింది. శూన్యదృక్కులు బరువుగా కంటిజోడు అద్దాలు తుడుస్తూ కూచున్నాడు వాళ్లేమయినట్టు? ఎక్కడికి వెళ్లారు? వాళ్లకబురు తనకెలా తెలుస్తుంది? ఎవరికి ఉత్తరంరాసి కనుక్కోవాలి? ఎవరి సలహా తీసుకుంటే బాగుంటుంది? ఏమో, ఆయనకేమీ పాలుపోవటంలేదు ఏఆపదవచ్చినా మనఃపూర్వకంగా వ్యయప్రయాసలు లెక్కించక ఆదుకుంటూ వచ్చాడు సురేశ్. అతడుగూడా ఊళ్లోలేడాయె. వాళ్లతో పాటే వెళ్లాడు.

ఇంతలో నౌకరువచ్చి ఒక కవరు ఇచ్చి వెళ్లాడు. ఆత్రుతగా కళ్లజోడు తగిలించుకుని చూశాడు. అచలాదేవికి ఎవరో రాసినవుత్తరం అది. చిరునామాచూస్తే అది ఎవరో స్త్రీ రాసిన లేఖ అయివుంటుందని ఊహించాడు

కోవచ్చు. ఉత్తరం ఎక్కడినించి వచ్చిందో, యెవరు రాశారో తెలుసుకో
వాలన్న తీవ్ర కుతూహలంతో ఏమీ సంకోచించకుండా కేదారబాబు కవరు
చించాడు; ఉత్తరం ఎవరురాశారా అని చూచాడు మొదట. 'నీ మృణాళిని'
అన్నమాటలు కనిపించాయి. ఆతరువాత ఉత్తరమంతా చాలసార్లు చదువు
తున్నాడు. కళ్లజోడుతీసి అద్దాలు తుడుస్తూ శూన్యదృక్కులు బరపుతూ
కూచున్నాడు. అప్పుడాయన గుండెలో ఎలాటి భావాలు సందడించాయో
అభగవంతునికే తెలియాలి మళ్లీ కళ్లజోడు తగిలించుకుని ఇంకొకసారి ఉత్త
రం చదువనారంభించాడు. స్త్రీకి అవసరమైన సహనము ధైర్యము, క్షమ
మొదలైన గుణాలను మృదు మధుర వాక్యాల్లో ప్రబోధించి చివరకామె
ఇలా రాసింది.

"కాని బావ నిన్ను గురించిమాత్రం ఏమీ చెప్పటంలేదు నీ విషయమై
అడిగినకొద్దీ గంభీరముద్రవహిస్తున్నాడు. అయినా ఆడదాన్ని అంతమాత్రం
ఊహించుకోలేకపోతానా? అక్కా! మాటపట్టింపులు, కలహాలు ఎవరికి
ఉండవు చెప్పు! కాని శృతిమించిన కోపం తెచ్చుకోవచ్చునా? నీభర్త
శారీరికంగాను, మానసికంగాను జబ్బుస్థితిలో ఉన్నాడు. అకారణంగానే
ఏదో కోపం తెచ్చుకునిఉండవచ్చు అధీరుడై 'వెళ్లిపోతా'నని అంటే అన్నా
డేమో! అంతమాత్రాన "ఔను, వెళ్లిపో వనవాసానికి" అని తెగతెంపులు
చేసుకునేటంత అవజ్ఞారాలవు నువ్వు కాదనే నా నమ్మకం. వ్యాధిగ్రస్తుడై
సగం కృశించిఉన్న భర్తను ఎంత గుండెనిబ్బరంతో అలా అంత చులాగ్గా
అడవిలో విడిచిపెట్టేసి ఈ ఏడెనిమిది రోజులనుంచీ—రోజులుకావవి సంవ
త్సరాలు— ఎలా నిశ్చింతంగా పుట్టింట్లో ఉండగలుగుతున్నావో నా కాశ్చ
ర్యంగా ఉంది. సామానుతీసుకుని ఇంటికి వచ్చేశాడు. గుర్తించటానికే వీల్లే
కుండా ఉన్నాడు మనిషి. మీ భార్యాభర్తలకు ఎందుకు ఏవిషయంమీద
కలతలు ఏర్పడ్డాయో జబల్పూరు వెళ్లవలసినవాడు తిరిగి యెందుకు ఇంటికి
వచ్చేశాడో—ఆసంగతులన్నీ నాకు తెలియవు. తెలుసుకోవాలన్న కుతూహ
లమూలేదు. కాని ఈ ఉత్తరం చూచుకున్న తక్షణమే నువ్వు బయలుదేరి
రావాలి లేకపోతే నామీద ఒట్టు. ముసలిఅత్తగార్ని విడిచి నేనెక్కడికీ
కదిలేందుకు వీల్లేదని నీకు తెలుసుకదా! కాని అక్కా బావ మరీ జబ్బుస్థి
తిలో పడిపోయాడు లేకపోతే నేనే స్వయంగా వచ్చి నీ కాళ్లుపట్టుకుని
ఇక్కడికి తీసుకువచ్చేదాన్నే. ఒక్కసారి వచ్చివెళ్లు. ఒక్కసారివచ్చి అతని
పరిస్థితులు కళ్లారాచూడు. ఆసమయంలో కోపం తెచ్చుకుని నువ్వు యెంత

అన్యాయానికి ఒడిగట్టావో నీకే తెలుస్తుంది. ఇక్కడ ఈ యిల్లు నీదే. నేనూ నీ దాన్నే ఇక్కడికి వచ్చే విషయంలో నువ్వేమీ సంకోచించవద్దు. నీకోసం ఎదురు చూస్తూఉంటాను. నీ శ్రీచరణాలకు కోటి నమస్కారాలు. ఇంకో సంగతి నేనీ ఉత్తరం రాసినట్లు బావకు తెలియకూడదు. అతనికి చెప్ప కండానే నేనీఉత్తరం రాస్తున్నాను. ఇట్లు నీ మృణాళిని"

ఉత్తరం ముగించి మృణాళిన్ని చిట్టచివర మరి రెండుమాటలు కూడా రాసింది. భర్తమారగతుడై ఉండగా నువ్వు సురేశ్ బాబు ఇంట్లో ఉండవని నా నమ్మకం. అందుచేతనే ఉత్తరం నీపుట్టింటి అడ్రసుకు రాశాను"

కేదారబాబు చేతుల్లోనించి ఉత్తరం జారి నేల మీద పడ్డది. కళ్ల జోడు అద్దాలు తుడుస్తూ, శూన్యదృక్కులు బరపుతూ కూచున్నాడు. జబ ల్పూరు వెళ్లటానికి బదులుగా స్వగ్రామం వచ్చేశాడు అచల అతనితో లేదు. మరి ఆమె ఎక్కడ ఉంది? ఏస్థితిలో ఉంది? — ఆవిషయాలేమీ మహిమ్ బాబుకు తెలియవో, తెలిసికూడా చెప్పటాని కతనికి యిష్టంలేదో!

కేదారబాబు మనస్సులోని సరి విగాలపోయింది. అయితే సురేశ్ కూడా వాళ్లతోనే వెళ్లాడుగా! అతడెక్కడ ఉన్నట్టు? తిరిగి కలకత్తా వచ్చినట్టు లేదే! వస్తే ఒకసారి తన్ను చూడ్డానికి రాకండా ఉంటాడా? ఆయన హృద యంలో అకస్మాత్తుగా ఒక అనుమానం కూచంవలె పొడసూపింది. స్థిరంగా కూచోలేక పోయాడు, పడక కుర్చీలో వాలి కళ్లు మూసుకున్నాడు

రెండుగంటలప్పుడు దాసీదాన్ని పంపించాడు. సురేశుబాబు ఇంటికి. అది తిరిగి వచ్చి సురేశ్ బాబు దగ్గిరనించి ఉత్తరమేమీ రాకపోవటంచేత బామ్మగారుకూడా చాలా ఆతృతపడుతున్నారని వార్తవచ్చింది,

నాటిరాత్రి కేదారబాబు దీపపు వెలుగున మృణాళిని రాసిన ఉత్తరం మర్లొకసారి చదువుకున్నాడు, ఆయన ఆలోచనలు అప్పుడు ఎంతదూరం ప్రసరించాయో ఊహించటం కష్టం, తానిక ఏమూరుమూలలకు పోయి తల దాచుకోవాలి? తనకు అజన్మ పరిచితమైన కలకత్తా పట్నాన్ని, సమాజాన్ని బంధుమిత్రులను — అందరినీ విడిచిపెట్టి తానిక యెక్కడనో అజ్ఞాతవాసం చెయ్యవలసిందేనా? కష్టపు రోజులే వచ్చాయి, ఎలా గడుస్తాయో! కూతు రైవుండికూడా ఆభాగిని అచల తనకి వృద్ధాప్యంలో ఎంత కష్టం తెచ్చి పెట్టింది! ఆమెను ఏమనాలి? ఎలా శపించాలి?

ఆ రాత్రంతా ఆయనకు కన్నుమూతపడలేదు. తెల్లవారింది, ఆయనకు అమ్లపిత్త ప్రకోపించింది ఎవరితో చెప్పుకోటానికి మనసొప్పలేదు. శవంలా పక్కమీదపడివుండటానికీ ఇష్టంలేదు. లేచి స్టేషన్‌కు బండి పిల్చుకురమ్మని నౌకరుని పంపించి, గుడ్డలూ అవీ సర్ది పెట్టెలో పెట్టమని బేహారాను ఆజ్ఞాపించాడు.

# 31

సూర్యాస్తమయు మౌతోంది. సోననదీ సైకతాలుకరిణ తాతపకాం తిలో బంగారుఛాయన ప్రకాశిస్తున్నవి. ఒక బంగాళా మేడమీది వసా రాలో అచలాదేవి నిల్చుని సోననదివైపు చూస్తూన్నది ప్రకృతిఅంతా ఆమె కొక విరాట్ చిత్రంలా కనిపిస్తున్నది.

"అక్కా!"

అచల ఉలికిపడి వెనక్కు తిరిగి చూచింది. ఆనాడు అచలాదేవికి రైల్లో పరిచయమై తనపేరు 'రాక్షసి' అని చెప్పుకుని 'ఆరా' స్టేషనులో దిగిపోయిన యువతి ఈమే చేరువకు వచ్చి అచల ముఖం అత్యంత కాంతి హీనమై ఉండటంచూచి ఆమె అన్నది — "సురేశ్‌బాబుకు జ్వరం తగ్గి పోతున్నది, డాక్టరుకూడా మరేమీ భయం లేదంటున్నారు, నువ్వుమాత్రం రాత్రింబగళ్లు ఏకోబెంగ పెట్టుకుని విచారంగా నేఉంటున్నావు వచ్చిననాటి నించీ ఒక్క చిరునవ్వుకూడా నీపెదవిమీద నేను చూడలేదు. మా ఆయనకు జ్వరం, నొప్పి ఎప్పుడేనా వస్తే నేనుకూడా సగం చచ్చిపోయినట్టయి బాధ పడేదాన్ని కాని నీలాగా ఇంతఇదిగా బేజారైత్తే యిల్లాల్ని నేనెక్కడా చూడలేదు"

అచల ముఖం తిప్పి ఒక దీర్ఘనిశ్వాసం విడిచింది. జవాబేమీ చెప్ప లేదు.

"చాల్లేవమ్మా మరీను, ఊరుకో" అంటూ మందలిస్తూ ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకుని రాక్షసి మళ్లీ ఇలా చెప్పింది కరుణ చిలుకుతూ— "మీకు మాయింట్లో ఉండటం ఇష్టంలేకుండా ఉంది కదూ! అవసతిగా, ఇబ్బందిగా ఉన్నట్టుంది. ఔనా?"

అచల నదికేసి చూస్తూఉంది. అటునించి దృక్కులు మరలించకుండానే జవాబు చెప్పింది—“మీనాన్నగారు మాకు చేసిన ఉపకారాన్ని ఈజన్మలో మరచిపోతానా ?”

“అంత కృతజ్ఞత ఉండబట్టేనా మొన్న పూజామందిరంలో ఉండి ఆయన ఎంతపిలిచినా వినిపించుకోకుండా వెళ్లిపోయావు. బహుశా ముసలి వాళ్లంటే నీకు...” అన్నది రాక్షసి వ్యంగ్యధోరణిలో.

“ఎబ్బెబ్బే, అలా ఎప్పుడూ అనకు”

“మరి ఆయన పిలిస్తే ఎందుకు రాలేదు ? నాలుగైదుసార్లు పిల్చారాయన పూజ జరుగుతోంది. నీ కోసం నేను పరుగెత్తుకు వచ్చానప్పుడు, నువ్వు మెట్లు దిగి వెళ్లిపోనే పోయావప్పుడే ”

“మరి నేను మీ పూజామందిరంలోనికి రావటం—” అన్నది అచల సిగ్గుపడుతూ, అనుతాప సూచకంగా.

“రావద్దని నిన్నెవరు నిషేధించారు? అయినా నీకాసమయాన మనస్సు మనస్సులో లేదులెద్దూ అక్కా! ముసలివాళ్ల పిలుపు వినేస్థితిలో ఉన్నావా అప్పుడు? నీ మనసులో ఏమనుకుంటున్నావో చెప్పనా?”

అచల నదికేసిచూస్తూ మౌనంగా నిల్చుంది ఆవ్యంగ్యోక్తుల కన్నిటికీ జవాబు చెప్పేందుకు ప్రయత్నించ లేదు.

ఇక్కడ ఒకవిషయం చెప్పాలి. ఆయువతి అసలుపేరు వీణాపాణి ఆమె పుట్టగానే తల్లి చనిపోయింది, అందుచేత దాది ఆమెకు ‘రాక్షసి’ అని నామకరణం చేసింది. ఆదేవ్యవహార నామంఅయింది. అత్తగారింటికి వెళ్లినా ఆ పేరు మారలేదు.

అచల ముఖం తిప్పుకుని ఉదాసీనంగా ఉండటం వీణాపాణికి కష్టమనిపించింది. తన వ్యంగ్యోక్తులకు ఆమె మనస్సు నొచ్చిందేమో అనుకుని అనుతాప సూచకమైన కంఠంతో ఇలాఅన్నది. “కాసంత నవ్వుతూమాటాడరాదుటమ్మా అక్కయ్యా! నేను ఎగతాళిగా అన్నమాటలకు కోపం తెచ్చుకోకు సుమా! మానాన్నగారిపట్ల నీకున్న భక్తి శ్రద్ధలు నాకు తెలియనాదేమిటి? ఆనాడాయన బజారులో వెడుతూంటే నువ్వు ఏడుస్తూ డాక్టరు కోసం పోతూ కనిపించావుట. ఆయనకూడా నీవెంటనే వచ్చి మీఆయన్ను కూడా తీసుకుని ఇక్కడికి వచ్చారు లేకపోతే నువ్వు మాయింటికి ఎందుకు వస్తావు తల్లీ ఆనాడు రైల్లో “మాయింటికి ఒకసారి రమ్మని నిన్ను ప్రార్థిం

చానేగాని నువ్వు వస్తావని నాకు నమ్మకం మాత్రంలేదు "వస్తానని నువ్వు గట్టిగా చెప్పనూలేదు దైవవశాత్తు మాయింట్లోనువ్వు అడుగు పెట్టడం సంభవించింది కాని నువ్వెప్పుడూ ఏదో విచారంగానే ఉంటున్నావు. ఇక్కడ నీకేమన్నా ఇబ్బందిగా ఉందా చెప్పు."

అచల మాత్రం ఏమీ పలకలేదు. మరోవైపు చూస్తూ నిల్చుంది. ముసలాయన ఆమెను ఎంతో ప్రేమగా చూస్తున్నాడు, వీణాపాణికూడా ఆత్మీయంగా "అక్కా!" అనిపిలుస్తూ ఎంతో ఆపేక్షగా ఉంటున్నది. అంటువంటప్పుడుఆమె ఎప్పుడూ విచారంగా ఉండటం వీణాపాణికి ఇష్టం లేదు. బలవంతాన ఆమె ముఖాన్ని తనకేసి తిప్పుకుంది; కాని ఆమెనేత్రాలు అశ్రుపూర్ణములై ఉండటం చూచి నిస్తబ్ధయై నిల్చింది. అచల నెమ్మదిగా పైట చెరగుతో కన్నీళ్లు తుడుచుకుని మళ్లీముఖం తిప్పుకుంది.

మర్నాడు మూడుగంటలప్పుడు వీణాపాణి ఏదో మాసపత్రిక తెచ్చి అచలకు ఒక కథచదివి వినిపిస్తున్నది. అచల కొన్నివాక్యాలు వింటున్నది. కొన్నివాక్యాలు ఆమె చెవికి సోకటమేలేదు, ఇంతలో రామచరణబాబు "అమ్మాయి రాక్షసీ!" అనిపిలుస్తూ వచ్చాడు ఆయన రాగా సేయువతులిద్దరూ లేచినిల్చున్నారు వీణాపాణి ఒక కర్చీలాగి ఆయనకుఆసనం చూపింది.

వృద్ధ మహాశయుడు రామచరణబాబు మంచినిష్ఠానిధి ఆయనకుర్చీలో కూచుని వాత్సల్యపూర్వకంగా అచలకేసి చేస్తూ —"నీకు ఒకమాట చెప్పి పోవాలని వచ్చానమ్మా! ఇవ్వాళ్లనించీ మీ భార్యాభర్తల పేర్లతో సంకల్పంచేయించి పురోహితునితో జపంచేయించాను జపం రేపటితో సమాప్తమౌతుంది. రేపు మనింట్లోనే నారాయణపూజ జరుగుతుంది. కష్టమనుకోక నువ్వు రేపు ఉపవాసం ఉండాలి" అన్నాడు.

ఆ మాటలకు అచలాదేవి ముఖంలో నెత్తురులేకుండా పోయింది. అది ఆ ముసలాయన గమనించలేదు. కాని వీణాపాణి చూచింది. ఆమె హిందూయువతి. ప్రాచీన సంప్రదాయాలపట్ల గౌరవము ఆమెలో ఆ బాల్య ప్రవృద్ధమౌతూ వచ్చింది. జబ్బుపడిన భర్త తిరిగి సంపూర్ణారోగ్యం పొందటానికి, దైవపూజ చేయటానికీ, ఉపవాసం వుండటానికి ఏ స్త్రీ యైనా ఉత్సాహపడుతుంది. కాని అచలాదేవి ముఖలక్షణాలు చూశాక వీణాపాణి ఆశ్చర్యానికి మేరలేకపోయింది అయినా ఆమె తరఫున ఇలా అన్నది "నాన్నగారూ! సురేశ్ బాబు ఆరోగ్యంకోసమని పూజచేస్తున్నారు. ఆయనఉపవాసం ఉండనప్పుడు ఈమె యెందుకుండాలి?"

ముసలాయన మందహాసం చేశాడు "సురేశ్‌బాబూ, ఈమె వేరువేరు వ్యక్తులా యేమిటి? తల్లీ! ఇప్పుడున్న స్థితిలో సురేశ్‌బాబు ఉపవాసం ఉండలేడు కనుక ఈమె ఉపవసించవలసిందే. అలా శాస్త్రాలే చెబుతున్నాయి"__ అన్నాడు

ఇంతవరకు ఔనని గాని, కాదని గాని అచల యేమీ పలకలేదు. ముసలాయనకు అనుమానం కలిగింది సూటిగా అచలకేసి చూస్తూ__"ఉపవాసం ఉండటానికి నీకేమన్నా అభ్యంతరం ఉందా అమ్మా!"__అని ప్రశ్నించాడు.

ఈసారైనా అచల వెంటనే జవాబు చెప్పలేదు. కాసేపాగి మెల్లగా మృదువుగా అంది. "ఆయనతో చెప్పండి; బహుశా వారే ఉంటారు"

ఆ తరువాత ఎవరూ మాటాడలేదు. తన మాటలు తన చెవికే ఎంతో అపస్వరయుక్తంగా, కటువుగా ధ్వనించినవి. ఆమె హృదయంలో వ్యధ అంతర్యామికే తెలియాలి.

ముసలాయన లేచాడు. "సరే అలాగే చేస్తాను" అంటూ ఆయన వెళ్ళిపోయాడు చీకటి పడుతున్నది. నౌకరు వచ్చి గదిలో దీపం వెలిగించి పోయాడు. మాసపత్రికలో సగం చదివి ఆపివేసిన కథను పూర్తి చెయ్యాలన్న కుతూహలం అచలకూ లేదు, వీణాపాణికీ లేదు.

మరి కాసేపటివరకూ ఎవరూ మాటాడలేదు చివరకు వీణాపాణి ఏమాలోచించుకుందో మరి కుర్చీ అచలకు దగ్గరగా లాక్కుని ఆమె ఒడిలో తన చేయి ఉంచి__"అక్కా! నిన్నొకటి అడగాలనుకుంటున్నాను నీకు కోపం రాకపోతే..." అంటూ అర్థోక్తిలో ఆగిపోయింది.

ఏమి అడుగుతుందోనని అచల లోలోన భయాభీత అయింది. హృదయం కంపించింది ఎక్కువ మాట్లాడితే స్వరంకూడా ఎక్కడ కంపిస్తుందోనని__'రాదులే' అని మాత్రం పలికి మౌనంగా ఉండిపోయింది

"నువ్వు నా అక్కవు. నేను నీ చెల్లెల్ని, ఆనాడు రైల్లో మనకింత దగ్గర సంబంధం లేకపోవచ్చు అయినా నీ సమాచారం నాకు సరిగా ఎందుకు చెప్పలేదు? వారు నీ భర్త అయినా 'కాద'ని చెప్పావు నీ భర్త వేరే ఇంకో పెట్టెలో ఉన్నాడనీ, సుస్తీగా ఉండటంచేత జబల్పూరు తీసుకు వెడుతున్నాననీ అబద్ధం చెప్పావు. అయినా ఆయనే మీ ఆయన అని నేనప్పుడే పోల్చుకోగలిగాననుకో. పైగా ఇంకో సంగతి, మీరు బ్రహ్మ

సమాజమతస్థులని చెప్పావు. కాని మీవారిని చూస్తేంటే సనాతన బ్రాహ్మణ పురోహితులను మించిన ఆచారపరంపర తిరిగి కలిగి ఉన్నాడు. అలా అబద్ధాలాడవలసిన అవసరం నీకేమి వచ్చిందో చెప్పవమ్మా అక్కయ్యా కాస్త వింటాను."

"చెప్పకపోతే?" - అన్నది అచల నీరసంగా నవ్వుతూ.

"నేనే చెబుతాను. కాని నేనేకనుక నిజం చెప్పగలిగానంటే నాకేమి ఇస్తావో ముందుగా చెప్పు."

అచల హృదయంలో రక్తప్రసారం ఆగినట్టయింది. ఆమె ముఖం నిస్తేజమైంది. అది వీణాపాణి కనిపెట్టిందో లేదో చెప్పటం కష్టం కాని ఆమె మందహాసంచేసి -"చెప్పు, అక్కా! నేనే నిజంచెబితే నాకేమి మిఠాయి పెడతావు?"

అచల సగం తెలిసి సగంతెలియని స్థితిలో మౌనంగా ఉంది వీణాపాణి మళ్లీ ఇలా చెప్పింది-

"మావారునీ అసలుసమాచారం కనుక్కొని వచ్చారు"

"అసలుసమాచారమా ? ఏమనీ?" - అని అడిగింది అచల తన విక్షుబ్ధ హృదయాన్ని సంబాళించుకుంటూ.

"నిజమో, అబద్ధమో నాకైతే తెలియదు ఒకనాటిరాత్రి మావారన్నారు - 'మీఅక్కయ్య ఇంట్లో పోట్లాడి పారిపోయివచ్చింది తెలుసునా' అని, అందుకు నేను కోపం తెచ్చుకుని - "ఊరికే తెలిసీ తెలియని మాటలనకండి. ఆమాట మా అక్క విన్నదంటే ఈజన్మలో మళ్లీ మీ ముఖంచూడదు' అన్నాను.

అచల కుర్చీచేతులను దబాయించి పట్టుకుని ప్రాణం బిగబట్టుకుని ఆమాటలు విన్నది

వీణాపాణి ఇంకా ఇలా చెప్పింది __ "ఆమెనాముఖం చూడనీ, చూడకపోనీ. నేనుమాత్రం ఒట్టుపెట్టుకుని నిజమే చెబుతున్నాను. అడబిడ్డలతోనో, తోడికోడళ్లతోనో, అత్తమామలతోనో ఏదోపోట్లాట వచ్చి ఉంటుంది. మొగుణ్ణి తీసుకొని విరక్తితో ఇల్లు విడిచి లేచి వచ్చేసింది. మీ అక్కగనుక సురేశ్ బాబుతో 'వెళ్లి సముద్రంలో దూకమని'హుకుం జారీచేసిందంటే అందుకు విరుద్ధంగా నడచుకోగల శక్తి అతనిలో లేదు. ఆ సంగతిఅతని ముఖంచూస్తేనే తెలుస్తున్నది. మారుపేర్లు పెట్టుకునివిల్లిద్దరూ

అజ్ఞాతవాసం చేస్తున్నారు. తలిదండ్రులామెను ఇంటికి రమ్మని పిలువరు. ఇదీ అవిడ అసలు సమాచారం' అన్నారు వారు. అందుకు నే నేమన్నానంటే—"మీరు చెప్పింది నిజమేఅయివుండవచ్చు కాని ఆనాడు రైల్లో...నన్నామె ఎరగదుగదా...అయినా నాతోకూడా అబద్ధాలాడవలసిన అవసరం ఆమె కేమివచ్చిందంటారూ?" అందుకు మా వారు నవ్వి ఇలా చెప్పారు— 'అవిడ నీయంత తెలివితేటలు కలదిఅయితే అంత అవసరం ఉండేది కాదేమో నీవు ఉండేది డేహారీపట్నం అని తెలుసుకున్న తరువాత ఆమె నిజానికి డేహారీ వస్తూ జబల్పూరు వెడుతున్నానని చెప్పింది హిందూమతస్థురాలై బ్రహ్మసమాజ మతస్థురాలినని చెప్పింది జబల్పూరుకే టిక్కెటు కొనుక్కొని వెడుతున్నవాళ్లు అకస్మాత్తుగా డేహారీలో దిగిపోతారా? జబ్బుగావున్న భర్తను తీసుకుపోతున్న మనిషి ఏ బంధువుల యింట్లోనో, మిత్రుల గృహంలోనో బస చేస్తుందిగాని ఆ పాత సత్రంలో దిగుతుందా? ఇంతమాత్రం తెలుసుకోలేవా రాక్షసీ! అని"

చెబుతూ చెబుతూ వీణాపాణి లేచివచ్చి ప్రేమగా అచలాదేవి కంఠాన్ని కావిలించుకుని మెల్లగా ఆమె చెవిదగ్గిర చెప్పింది—"అక్కా! అసలు ఏమిజరిగిందో నాకు చెప్పవా? నేను ఎవరితోనూ చెప్పను ఒట్టు వేసుకుంటాను."

అసలు సమాచారం అంటూ వీణాపాణి చెప్పిన అసత్యగాధ అంతా అచల విన్నది. ఒక అచేతన పదార్థంవలె ఆమె ఆస్నేహితురాలి కౌగిలిలో ఇమిడిపోయింది అవిరళ అశ్రుధార తప్ప ఆమెలో ప్రాణం ఉందని సూచించే లక్షణం మరేదీ లేదు.

వీణాపాణి తన పైటచెరుగుతో మాటిమాటికీ ఆమె కన్నీళ్లు తుడుస్తూ—"అక్కా! నువు పెద్దదానివి, నేను చిన్నదాన్ని అయినా నీమంచి ఆలోచించి చెబుతున్నాను. నువు తప్పకుండా ఇంటికి తిరిగివెళ్లిపో. ఈ సంచారం ఏమీ బాగులేదు మీ ఆయనకు ఆరోగ్యం చిక్కింది; నీ పసుపుకుంకుమలు అక్షయం ఇంకా కోపం పెంచుకుని పెద్దవాళ్లను దుఃఖపెట్టకు. వాళ్ళు మీ కబురు తెలియక ఎంత అల్లాడిపోతున్నారో! తల వంచుకుని అత్తవారింటికి వెళ్లటం తప్పుకాదు అందువల్ల వచ్చే అప్రతిష్ఠ ఏమీ లేదు" అంటూ చెప్పింది. కాసేపు ఊరుకొని వీణ మళ్లీ ఇలా అన్నది—"మాటాడవేం అక్కా! వెడతావుకదూ! ఇంట్లో పెద్దవాళ్లతో పోట్లాడి

వచ్చినప్పటినించీ సురేశ్ బాబు ఆరోగ్యం కూడా బాగుందికాదు. 'తిరిగి ఇంటికి పోదాం' అని నువ్వు అంటే అయనకూడా సంతోషిస్తాడు"

వీణాపాణి తనపట్ల చూపుతూన్న శ్రద్ధావాత్సల్యాలకు అచల మౌనంగా ఉండలేకపోయింది. "మళ్లీ ఇంటికివెళ్లే యోగ్యత నాకు లేదు వీణా !"— అన్నది మెల్లగా.

"ఎందుకులేదు ? వాళ్లు నిన్ను తిరిగి ఇంటికి రానీయనంత మహాప రాధం నువ్వు ఎన్నడూ చెయ్యలేవు, అంత అభాగ్యురాలవు నువ్వు కాదని నేను గట్టిగా చెప్పగలను ఏమీ భయపడాలేదు. మీ అత్తగారి ఊరు ఎక్కడో నాకు కాస్త చెప్పు. మేము కూడా ఎల్లుండే బయలుదేరి ఆదేశం వస్తున్నాం. నేను నిన్ను తీసుకుపోయి మీ అత్తగారింట్లో దించుతాను. ఏమంటారో చూదాం గా !"

"మీరు ఎల్లుండి వెడుతున్నారా ? నాకిదివరకు చెప్పలేదేం ? అక్కడ నీకు బంధువులు ఎవరు ?"

"మా పెద్దత్తగారొకతె ఉంది పెద్దదై పోయింది చాలరోజులనించీ మంచంలోనే ఉంటున్నది. ఇంకా ఎన్నాళ్లో బ్రతకదు. మమ్మల్ని అందర్నీ ఒకసారి చూడాలనుకుంటున్నదట"

"ఆమె ఏవూళ్లో ఉంటున్నదీ ?"

"కలకత్తాలో పటల్ డాంగ వీధిలో"

అచలాదేవి ముఖం వివర్ణమైంది. "అయితే మేము రేపే ఇక్కడి నించి వెళ్లిపోవాలి ఇంకా ఉండటం బాగుండదు"

వీణ నవ్వింది "మేము వెళ్లిపోతున్నామని నిన్నుకూడా బయలుదేర మంటున్నానని అర్థం తీశావన్నమాట ! అక్కా నిన్ను 'వెళ్లు' అని నానోట ఎప్పుడూ అనను, తెలుసునా? ఈ యింట్లో నీయిష్టంవచ్చినన్నినాళ్లు ఉండ వచ్చు. ఏమాత్రమూ అభ్యంతరం ఉండదు."

"అయితే మీరు ఎల్లుండి వెళ్లటం నిశ్చయమైనట్టేనా?"

"అయింది. సామానంతా సర్దివేశారుకూడాను"

ఇంతలో దాసీది వచ్చింది. "అమ్మాయిగారూ ! అమ్మగారు వంటింట్లో ఉన్నారు. తమర్ని ఒకసారి రమ్మంటున్నారు."

"వస్తున్నా పద" అని దాసీదాన్ని పంపించేసి, పకపకా నవ్వుతూ అచలాదేవిని కంఠాశ్లేషంచేసి—"ఇన్నాళ్లనించీ మేమంతా ఉంటూంటే

ఈ యింట్లో మీకు ముళ్ళమీదఉన్నట్లుగా ఉంది. ఎల్లుండినించీ మేమెవరమూ ఉండము మీరిద్దరే హాయిగా, స్వేచ్ఛగా—" అంటూ ఆమె [illegible] బుగ్గమీద మెల్లిగా ప్రేమ్లానించి గబగబా వెళ్ళిపోయింది.

ఒక ఆనంద తరంగం వలె సౌభాగ్యవతి వీణ వెళ్ళిపోయింది. ఆమె చివరి మాటలు అచలవిని ఒక పాషాణ విగ్రహంలా అయిపోయింది.

# 32

ఇక సురేశ్‌బాబూ, తనూ ఈయింట్లో ఒంటరిగా రోజులు గడపాలన్నమాట ఇంకేం? ఏమీ అడ్డంకులుండవు, సిగ్గు ఉండదు.

"తలవంచుకుని అత్తగారింటికి వెళ్ళటం తప్పుగాదు, అప్రతిష్ఠకాదు" అంటుంది వీణాపాణి

తనకు భర్త ఉన్నాడు తనది అని చెప్పుకోదగిన... పరశురామ ప్రీతియైన... ఇల్లు ఉంది ఏమిలాభం?

స్వేచ్ఛగా తిరిగేందుకు వీల్లేక కట్టివేయబడిన పశువు నిల్చున్న చోటనే కుమ్ముకుంటూ ఉంటుంది. అలాగే ఆమెలోని నిరోధితాలైన కోరికలు సంకుచిత హృదయ క్షేత్రంలో హాహాకారం చేస్తూ బైటికి ప్రసరించాలని గింజుకుంటున్నవి.

చాలరోజులనించీ రాత్రిళ్ళు వీణకూడ తనకు చేరువనే మంచంమీద పడుకోటూ వచ్చింది, కాని ఇవాళ ఆమె భర్త వచ్చాడు. వాళ్ళగదిలో వెళ్ళి పడుకుంది ఆమె ఈర్ష్యావిలమైపోయిన తన హృదయం సిగ్గులో, అవమానంలో విదీర్ణమైపోకండా అచల ఆవిషయాన్ని గురించి ఆలోచించకండా ఉండేందుకు ప్రయత్నించింది. కాని వీణ భర్త ప్రక్కన పడుకున్నదన్న విషయం మాటిమాటికీ స్మరణకు వస్తూనే ఉంది. శరీరమంతా ఎందుకో విత్రస్తమాతంగానే ఉన్నది—విద్యుత్ప్రవాహం తనలో ప్రసరించినట్లు.

గడియారం రెండుగంటలు కొట్టింది. శాలువ కప్పుకుని అచల లేచి కూచుంది ఒడలుకొరికే చలివేస్తూన్నా ఆమె నుదుటిమీద చెమటచుక్కలు మొలచాయి. లేచి కిటికీ తెరచి బైటికి చూచింది ఆకాశాన కృష్ణపక్షు అష్టమీచంద్రఖండం ప్రకాశిస్తూంది. సోనవదీజలం వెన్నెలలో ధవళ

దీధితులు చిమ్ముతున్నది. ఒక చల్లని గాలి కెరటం ఆమె ముఖంపైన ఆశ్వాసిస్తున్నట్లుగా వీచింది. ఆకిటికీ చెంతనే కూచుని ఆమె తన ప్రస్తుత విషాద స్థితిని నెమరు వేసుకుంటున్నది.

ఏ దేవుని శాపంవల్లనో, ఏదురదృష్టంవల్లనో తాననుభవిస్తూన్న ఈదుఃఖగాధ అంతా ఇతర్లకు ఒక అద్భుతమైన నవలలాగ ఉంటుంది! ఈదుఃఖగాధ ఆరంభమైన నాటినించీ నేటివరకూ వివిధ భీభత్స సంఘటనలను జ్ఞాపకం చేసుకుంది. తనపైన తనకే కోపం వచ్చింది. హృదయం క్షోభించింది అభిమానం దెబ్బతిన్నది. కన్నీళ్లు కాల్వలై ప్రవహించాయి. నూత్నయౌవనదశలో ఉన్న తన మధుపాత్రను విషకలుషితం చేసిన భగవంతుడు ఎంత నిర్దయుడు? తనది వట్టి నగుబాటుబ్రతుకైపోయింది. భగవంతుడు అపార దయాసముద్రుడన్న మాట వట్టి అబద్ధం. "ఓ ఈశ్వరా ! నువ్వు ఏడిపించాలనుకుంటే నేనే దొరికానా? నీ ఆనందంకోసం నన్ను హింసపెడుతున్నావా ?"—అని మాటిమాటికీ గొణుక్కుంది.

తానెవరు? సురేశ్ ఎవరు? బ్రహ్మసమాజ మతస్థుల నీడసోకినా మహాపాపమని భావించేవాడు సురేశ్. బ్రహ్మసమాజంపట్ల అతనికి బ్రహ్మాండమైన ద్వేషం. కాని ఈ నా డతనికి బ్రాహ్మబాలికపైనే అత్యంత ఆసక్తి కలిగింది. ఆమెనే ప్రాణసమానంగా ప్రేమిస్తున్నాడు. ఎంత విపరీతం? అడ్డంకులన్నీ గడిచి ఎలాగైతేనేం తాను మహిమ్‌బాబును పెళ్లాడింది. కాని అదృష్టం బాగుండలేదు పిడుగులా వచ్చాడు సురేశ్‌బాబు. గ్రామంలో తన ఇల్లు తగలబడిపోయింది. దానితోనే మహిమ్‌బాబు మంచిరోజులుకూడా అంతరించాయి. ఇంత తెలిసికూడా రోగగ్రస్తుడైన భర్తను తాను సురేశ్‌బాబుకే ఎందుకు ఒప్పగించాలి?

అచల చేతులు రెండూ జోడించి "ఓ భగవంతుడా ! నాభర్తకు సంపూర్ణారోగ్యం చేకూరుతుంది. ఆయన నా తప్పుల్నిమన్నించి నన్నాశీర్వదిస్తాడు నాసమస్త అపరాధాల్నీ ప్రాయశ్చిత్తాగ్నిలో భస్మం చేసుకుందామని అనుకుంటున్నాను. ఇంతలోనే నన్ను మళ్లీమరో దుర్గతిలో తించావు. సురేశ్‌బాబును పూర్తిగా ఎరిగి వుండి కూడా మాతోబయలుదేరి జబల్పూరు రమ్మని, అహ్వానించటం నాదేతప్పు. ఈమహాపరాధం నన్ను పట్టి పాలారుస్తున్నది. ఈవచ్చిన కళంకం మాయదు. కాని దేవా! నువుకూడా నన్ను అపార్థం చేసుకున్నావా? అని ప్రార్థించింది! సర్వాంతర్యామిని నాహృదయంలోని వేదన నువ్వు ఎరగవా?"

తండ్రి ఎంతో చింతిస్తాడు; భర్తకూడా అపరిమితంగా విచారిస్తాడు అవిషయం అచల ఊహించుకోగలదు కాని ఆమె అందుకు ఎక్కువగా సంతాపపడటంలేదు. ఆమెకు మృణాళిని, బామ్మ జ్ఞాపకం వచ్చారు. "అమ్మా! సాధ్వీ' అంటూ వాళ్లు సంబోధించి ఆశీర్వదించిన వాక్యాలు జ్ఞాపకం వచ్చాయి ఏవేవో భావాలు, ఆమెలో తిరిగాయి హృదయానికి మర్మాంతకమైన ఆఘాతాలు తగిలాయి. చైతన్యం కోల్పోయి నట్లయింది. అట్టి నీరస స్థితిలో కిటికీచువ్వలకు అవనత ఫాలభాగం ఆనించి కూచుంది, కన్నీళ్లు వెల్లువగట్టినవి ఇంతలో అడుగుల చప్పుడు వినిపించింది. అచల ఉలికిపడి వెనక్కు తిరిగి చూచింది సురేశ్ బాబు మెల్లగా వస్తున్నాడు ఆమె ఆశ్చర్యపడ్డది. గుండె దడదడలాడింది. ఏదో మాటాడా లనుకుంది. కాని కంఠం అశ్రురుద్ధమై పోయింది. దుఃఖం ఆపుకునే శక్తి ఆమెకులేదు. మళ్లీముఖం తిప్పుకుని వెనకటివలెనే కిటికీచువ్వలకు నుదురు ఆనించి కూచుంది; కన్నీళ్లు ఇదివరకుకన్న ఎక్కువ వేగంగా ప్రవహిస్తున్నవి.

అది నీరవ నిశ్శబ్ద నిశీథసమయం. అంతా నిశ్శబ్దంగా ఉంది సురేశ్ ఒక రాతి విగ్రహంలా నిలబడి ఉన్నాడు. మరి కాసేపటికి అతని శరీరం యావత్తు వెదురుచెట్టు ఆకులా కంపించింది రక్తం పొంగింది. చెయిచాచి ఆమె ఉత్తమాంగాన్ని స్పృశించి, దగ్గరకు లాక్కుని, గుండె కదుము కున్నాడు.

అచల పట్టు విడిపించుకుని కన్నీళ్లు పైటచెరగుతో తుడుచుకుంది. కాని ఆశ్చర్యకరమైన విషయమేమంటే__తన యీ ప్రస్తుత విషాదస్థితికి మూలకారణం అతడే. అయినా అతడిప్పుడు వచ్చి తన్ను పైకొన్నందుకు ఏవగించుకోలేకపోయింది. పైగా మృదువుగా __ "మీరీగదిలోకి ఎందుకు వచ్చారూ?"_అంటూ ప్రశ్న వేసింది.

సురేశ్ మాటాడలేదు అతడు మాటాడగలస్థితిలో లేడు.

అచల కిటికీ మూసింది "చాల చలిగా ఉంది. మీచేతులు వొణుకు తున్నాయి కూడాను. వెళ్లి మీగదిలో పడుకోండి"__అన్నది.

సురేశ్ కన్నులు వింతగా ప్రకాశించాయి, అతని కంఠం కంపించింది. ఆమె చెయి అందిపుచ్చుకుని అస్ఫుటంగా __"నువ్వుకూడా నాగదిలోకి రా" అన్నాడు.

అచల క్షణంసేపు ఆశ్చర్యచకితయై అతని ముఖంలోకి చూస్తూ నిల్చుండిపోయింది. చివరకు చేయి విడిపించుకుని —"ఊహు ఇవాళ కాదు"— అంది.

ఆమె నిశ్చలంగా, శాంతంగా చెప్పింది జవాబు. దానిఅర్థమేమో సురేశ్‌కు పూర్తిగా గ్రాహ్యం కాలేదు. అందుచేత మౌనంగా, ఆలోచనగా నిల్చున్నాడు. అచల అతనికేసి చూడకుండానే ఇలా అడిగింది — "నేను మెలుకువతో ఉన్నానని తెలుసుకునే వచ్చారా యేమిటి?"

"లేకపోతే మరి నువ్వు నిద్రపోతున్నావని తెలిసి వచ్చాననుకున్నావా?"

అచల ముఖమెత్తి నవ్వింది. తీక్ష్ణంగా, కఠోరంగా ఉన్నదా నవ్వు. దీపపు వెలుగులో సురేశ్ ఆ నవ్వును చూచాడు. "ఓరి దుర్మార్గుడా! నిద్రపోతూన్న ఆడదాని గదిలోకి దొంగలాగా జొరబడటం తప్పురా"— అని చెబుతున్నట్టుగా ఉందానవ్వు. కాని ఆమె నోరువిప్పి అమాట పలుక లేదు. మరుక్షణమే ఆమె తన పక్కవైపు నడుస్తూ —"మీ ఆరోగ్యం బాగులేదు. రాత్రిళ్లు మేలుకుని ఉండకూడదు, వెళ్లి పండుకోండి" అని చెబుతూ తనపక్కమీద పండుకుని కంబళి కప్పేసుకుంది.

సురేశ్ నిస్తబ్ధుడై అక్కడే కాసేపు నిల్చుని తిన్నగా వెళ్లిపోయాడు.

# 33

ఒకరిద్దరు నౌకర్లు, రామచరణబాబు తప్ప కుటుంబమంతా కలకత్తాకు బయలుదేరి వెళ్లింది. ఏమి అవసరమైన పనులు చూచుకోవలసి వున్నదో మరి రామచరణబాబు మాత్రం వెళ్లాడుకాదు.

అందరూ వెళ్లి అయిదురోజులు అయింది. రామచరణబాబు ఎక్కువ కాలం ఇంటివద్ద ఉండటమే లేదు. ఆనాడాయన ఉదయమే లేచి "అమ్మాయీ! అచలా" అంటూ వసారాలోకి వచ్చాడు. చాల చలిగా ఉంది. ముసుగులు తీసి ఎవరూ పక్కలమీదనించి లేవలేదు. ముసలాయన పిలుపు విని అచల వెంటనే లేచి గదితలుపు తెరచుకొని బైటికి వచ్చింది. మరి కాసేపటికి

ఆ పక్క గదిలోనించి సురేశ్ బైటికివచ్చాడు. దంపతులిద్దరూ వేరువేరు గదులలోనించి బయటపడటం చూచి ముసలాయన విస్మితుడైనాడు. ఆయన విస్మయభావాన్ని సురేశ్ గమనించలేదు కాని అచల చూచింది.

"సురేశ్ బాబూ! సమయంగాని సమయంలో వచ్చి మీకు నిద్రాభంగం కలిగించినట్టున్నాను—"అన్నాడు రామచరణబాబుసానుతాపంగా.

"నేను మెలకువతోనే ఉన్నాను మీరు నిద్రాభంగం చేసిందేమీ లేదు. మీరు యింత వేకువనే ఎక్కడికో బయలుదేరారే!" అన్నాడు సురేశ్ నవ్వుతూ—

రామచరణబాబు అచలనుద్దేశించి, మందహాసంచేస్తూ—"ఇవాళ అచలాదేవికి కాస్త కష్టం కలిగించవలసి వచ్చింది. నేను పనిమీద వెడుతున్నాను. రెండుమూడు గంటలప్పుడుగానితిరిగి రాలేను. అప్పుడువచ్చి పొయ్యి అంటించటం బద్ధకమనిపిస్తుంది కాస్త నాకోసం అన్నం, పప్పువండి ఉంచాలమ్మా తల్లీ నువ్వు"—అన్నాడు.

ఆయన మహానిష్ఠగలమనిషి. భార్య, కూతురు తప్ప మరెవరు వండినా తినడాయన, ఆయన భోజనంచేసే గదికూడా ప్రత్యేకంగా ఉంటుంది. అందులోకి ఎవరూ వెళ్లటానికి వీల్లేదు. ఇన్నాళ్లనించీ ఇంట్లో ఎవరూ లేక పోవటంచేత స్వయంగా వండుకుతింటున్నాడు. అటువంటి మనిషి ఇవాళ తన్ను వంటచేసి పెట్టమని ఆదేశిస్తున్నాడు. అచలకు ఆశ్చర్యం వేసింది. మనసుకు ఆందోళన కలిగింది. భయవిహ్వలచిత్త అయింది.

రామచరణబాబు ఆమె ముఖభావాల్ని గ్రహించి అన్నాడు:— "ఈ ముసలివానికి భోజనవిషయంలో అనేకనియమా లున్నాయి. అవన్నీ ఇవాళ ఏమైనాయని అనుకుంటున్నావు కదూ! పరవాలేదులే అమ్మా! రాక్షసి వండితే తింటాముగా! నువ్వు వండితేమాత్రం నాకు అభ్యంతరం ఎందుకుంటుంది? మంచో, చెడో, ఏమైనాగానీ; మరి అంత ఆలస్యంగా వచ్చి చెయికాల్చుకోవటం నా చేతకాదు" అంటూ నిరుత్తరయై నిల్చిన అచలకేసి చూస్తూ ఇంకా ఇలా అన్నాడు—"ఈపని నాకు చెప్పకపోతే వంట బ్రాహ్మణుడున్నాడుకదా, ఆయనతో చేయించుకోరాదా' అని అనుకుంటున్నావేమో! వద్దమ్మా, వద్దు ఒక్కపూటైనా సంధ్య వార్చని ఈ వంటబ్రాహ్మణులచేతి కూడు నేను చచ్చినా తినను. ఈ కొద్ది రోజుల పరిచయంలోనే నాకు నీవు మా'రాక్షసి' లాగే కనిపిస్తున్నావని నేను చెబితే అది అన్నివిధాలా సత్యం కాకపోవచ్చు. కాని చూస్తున్నాను

గదా నీ వడవడి. నువ్వు వండి పెట్టినా అది అన్నపూర్ణాదేవి చేతి ప్రసాదమే కాగలదని నాకు నమ్మకం కలిగింది. ఇక నేను వెడుతున్నాను" — అంటూ ఆయన పోబోతున్నాడు. అచల వ్యస్తచిత్తయై, ఏమి చెప్పటానికీ తోచక, చివరకు బాలిక మీదికి వచ్చిన మాటేదో అనేసింది — "కాని మరి నాకు బాగావంట చెయ్యటం చేతకాదు. నేను వండిన పదార్థాలు మీకు రుచించవేమో !"

"ఆమాట నేను నమ్మను" — అన్నాడు రామచరణబాబు మందహాసం చేస్తూ.

"అందరికీ వంటచెయ్యటం చేతనౌతుందంటారా మరి ?

"అందరికీ చేతనౌతుందని నేను మాత్రం అన్నానా ?"

అచల ఆమాటకు జవాబేమీ చెప్పలేకపోయింది సురేశ్ ఆమె హృదయవేదనను గ్రహించాడు. ఆ వృద్ధమహాశయుని సంస్కారాలు, హిందూ ఆచారాలు...మంచివిగానీ, చెడ్డవిగాని ఆమె బ్రాహ్మ మతస్థురాలై వుండి తన చేతి వంటను ఆయన చేత తినిపించటం మోసంకింద వస్తుంది. అదీ ఆమె పడుతోన్న బాధ ఆబాధతోనే ఆమె ముఖం మరీ పాలిపోయింది. సురేశ్ ఇక తానిక్కడ ఉండటం బాగుండదని దంతధావన నెపంతో చల్లగా జారాడు.

"సరే వెడుతున్నాను" — అంటూ రామచరణ బాబు ఒక అడుగు ముందుకు వేశాడు క్షణమాత్రం అచల నిశ్చేష్టయై నిల్చింది. వెంటనే తెలివి తెచ్చుకొని "అయితే మరి" అన్నది —

ఆయన వెనక్కు తిరిగి చూచాడు అచల ఏమో చెప్పాలనుకుంది కాని చెప్పలేక తలవంచుకుని నేల చూపులు చూస్తూ నిల్చుంది. ఆయన ప్రేమగా తిరిగివచ్చి — "నీకొకమాట చెప్పాలి అమ్మాయి ! మీనాన్నకంటే బహుశా నేను పెద్దవాణ్ణి అయివుంటాను. నన్ను నువ్వు 'పెదనాన్నా' అని ఎందుకు పిలవవు ?"

ఆయింటికి వచ్చినప్పటినించీ ఆయన తన్ను ఎంతో ప్రేమగా చూస్తున్న సంగతి అచలకు తెలుసు. ఇప్పుడాయన ఎంతో వాత్సల్యపూర్వకంగా మాటాడేసరికి ఆమె కన్నులు అశ్రుసిక్తములైనవి

"ఏమిటో చెప్పదలచుకున్నావు కదూ ! చెప్పమ్మ !" — అన్నాడాయన.

"మా నాన్నగారు బ్రాహ్మమతస్థులు"— అన్నది అచల సంకోచిస్తూ.

రామచరణబాబు చకితుడైనాడు. "చాలా మందికి బస్తీ చేరితే కొత్తబుద్ధులు అబ్బుతూంటాయిలే. బ్రాహ్మ మతస్థులతో ఉన్నప్పుడు హిందువులమూ, హిందూమతస్థులతో ఉన్నప్పుడు బ్రహ్మసమాజికులమూ, నిజమైన బ్రాహ్మమతస్థులు గాని, హిందూమతస్థులగాని నోటపలుకరాని వాక్యాలతో దూషిస్తారు మీ నాన్నకూడా అలాంటివాడేనా? అయితే ఫరవాలేదు." అన్నాడు

ఆ మాటలకు అచల చిన్నబుచ్చుకుంది "మా నాన్న అలాకాదు. ఆయన నిజమైన బ్రాహ్మ మతస్థుడు" అని చెప్పింది

రామచరణబాబు ద్వైవిధీభావంలో పడ్డాడు. కాని కానేపటికి ప్రసన్నవదనుడై "మీ నాన్న బ్రాహ్మ మతస్థుడైతే కావచ్చు. కాని నువ్వు సురేశ్‌బాబు ధర్మచారిణివి. అతడు హిందూమతస్థుడు. అతని మెడలో యజ్ఞోపవీతం శోభిస్తున్నది. మీ నాన్నగారి కర్మ నిన్నంటదు. నువ్వు ఏదో వంకపెట్టుకుని తప్పించుకోవాలని చూస్తున్నావు ఏమైనాకానీ నువ్వు ఇవాళ నాకు పాకం చేసిపెట్టవలసిందే, తప్పదు. అసాదు నువ్వు ఉపవాసం ఉండటానికి యిష్టపడకపోవటానికి మీ నాన్నగారి తర్బీదే కారణమన్నమాట! ఔనా?" అన్నాడు.

"మరి పెదనాన్నగారూ! నేను నిజంగా బ్రాహ్మ మతస్థురాలినైతే నేను వండిన అన్నం మీరు తినరన్నమాటేగా!"

"తినను. కాని అతడు బ్రాహ్మ మతస్థుడుకాడు, నువ్వూకాదు"

"ఒకవేళ అయితే నేను మీకు అస్పృశ్యురాల్నే అన్నమాట!"

"అస్పృశ్యురాల వెందుకవుతావు. నీ చేతిమీదిగా నేను భోజనం చెయ్యను. అంతే"

"ఎందుకు తినరు? అంత ద్వేషం దేనికి?"—అన్న అచల ఊరుకుండలేక—ఆయన్ను గిసురించి తద్విషయమై ఇంకా వివరాలు తెలుసుకోవాలన్న తలంపుతో.

ముసలాయన వెంటనే జవాబు చెప్పలేదు, తదేక దృష్టిని ఆమెకేసి చూస్తూ ఉండిపోయాడు

"పెదనాన్నగారూ! మీరు చాలాదయామయులు, ఎందరికో ఎన్నో ఉపకారాలు చేసి ఉన్నారు. అందుకు మేమే ఒక ప్రత్యక్షనిదర్శనం, అంత

ఉదారహృదయులుకూడా ఈమాత్రానికే ఎందుకు బ్రాహ్మ మతస్థులను ద్వేషిస్తున్నారో నాకు అర్థంకావటం లేదు"

"నేను ద్వేషిస్తున్నానా? అదేమిటమ్మా అలాఅంటావు?"—అన్నాడాయన వ్యాకుల చిత్తుడై.

"ఒక వ్యక్తివండిన అన్నం మీకు నిషేధమైనప్పుడు మీరావ్యక్తిని ద్వేషిస్తున్నా రన్నమాటే ద్వేషిస్తూన్న సంగతి మీరు అంగీకరించక పోయినా ద్వేషిస్తున్నారనే అనుకోవలసి వస్తుంది. మీ వంటబ్రాహ్మణుని చేతిమీదిగా మీరు భోజనం చెయ్యరు ఆసంగతి మీరే ఒప్పుకున్నారు ఇది దేశానికి ఎంతహాని ఎంత అవనతి! ఈ సంగతి మీరు—"

రామచరణ బాబు ఆమె మాటలు విన్నాడు ఆమె కనబరచిన ఆవేశాన్నీ గమనించాడు "మేము ఏ వ్యక్తినీ ద్వేషించము. మమ్మల్ని గురించి నువ్వు అన్నమాటలే ముసల్మానులూ అంటారు. వాళ్ల దగ్గర నించే ఆపాఠం మీనాన్న నేర్చుకొని వుంటాడు. ఆయన నీకు నేర్పాడు. అంతేగాని మానవుడు భగవంతుని స్వరూపం అన్నసంగతి వారికే కాదు, మాకూ తెలుసు, సరే నేనువెడతాను అన్నం, పప్పూవండు, చాలు మరేమీ వద్దు. నేను తిరిగి వచ్చాక తీరిగ్గా మాట్లాడుకుందాం, మేము ఎవర్ని ద్వేషిస్తున్నామో, అందువల్ల దేశానికి ఎంత అవనతి దాపురిస్తున్నదో అవిషయాలన్నీను."—అంటూ ఆయన వెళ్లిపోయాడు.

# 34

సాయంత్రం మూడుగంట లప్పుడు రామచరణ బాబు తృప్తిగా భోజనం చేసి లేచాడు "నేటితో మీ బ్రాహ్మణ్యం పోయిందని మీకు తెలిసిన నాడు నామీద కోప్పడకండిసుమీ?" అన్నది అచల. రామచరణ బాబు చేయికడుక్కుంటూ ఆమె మాటలకు మందహాసం చేశాడు.

అచల మేడమీదికి వెళ్లి వసారాలో కుర్చీవేసుకుని కూచుంది...సోన నదికేసి చూస్తూ. పనిలేనప్పుడల్లా ఆమెకదేపని. శీతాకాలం కాబట్టి అప్పుడే పొద్దువాలిపోతున్నది. రామచరణబాబు కూడా పైకివచ్చాడు. ఒక

కుర్చీ లాక్కుని కూచుంటూ మందహాసపూర్వకంగా;—"ఈ దయాన లేగినవివాదం ఏదీ? మళ్లీ ఆరంభించు. బ్రహ్మజ్ఞానియైన మీ నాన్న మాటలు నిజమో, నామాటలు నిజమో...ఏదో తేల్చుకునిగాని నేనిక్కడినించి వెళ్లను. కానీవమ్మా! నీతర్కం ఏమిటీ?"

"నాకు తర్కం ఏమి తెలుసును పెదనాన్నగారూ!"

"అమ్మో! నీకు తెలియకేం? నువ్వు సామాన్యురాలివా!"—అన్నాడాయన పరియాచకంగా.

అచల ఆసమయాన వాదవివాదాలు చేసే స్థితిలో లేదు. "మీరే గెలిచినట్టులెండి. పోనిద్దురూ; ఎందుకు వచ్చినట్టు"—అని ఉదాసీనంగా అన్నది.

రామచరణబాబు వెంటనే ఏమీ అనలేదు. ఆయన వయోవృద్ధుడు. ప్రపంచంలో సమస్తమూ చూచినవాడు. కావలసినంత అనుభవం ఉంది. అచల కంఠధ్వనిలో అంతర్లీనమైయున్న వేదన ఆయన పసిపట్టకలిగాడు. కారణమేమిటో తెలియదుగాని, ఆమె మానసికంగా ఏదో బాధపడుతూన్నట్టు ఆయన ఊహించాడు. ఈ ఊహను ఆమె ముఖంలోని వైవర్ణ్యం బలపరుస్తున్నది. "అదికాదమ్మాయి! ముసలివాణ్ణి ఏదో వాగుతూ ఉండటం అలవాటు. నీతో కాస్త బాతాఖానీ వేసి పొద్దుపుచ్చుకుపోదామని వచ్చాను" అన్నాడు చివరకు.

"సరే కానీయండి అయితే. ఏ విషయాన్ని గురించి ఆరంభిస్తారు?" అన్నది అచల నవ్వుతూ.

"నువ్వు అడిగిన ప్రశ్న ఎంత మహావక్తనుకూడా నోరు మూయించేటువంటిది. నన్ను బలేయిబ్బందిలో పెట్టావే!"

"మరి పెదనాన్నగారూ! ఇవాళ బలవంతాన నా చేతిమీదుగా అన్నం వండించుకుతిన్నారు. ఏనాటికైనా నా స్నేహ పట్టినీచురాలిననీ, నాకన్నా భ్రష్టురాలీ ప్రపంచంలో మరెవరూ ఉండరనీ మీకు తెలుస్తుందనుకోండి. అప్పుడు ప్రాయశ్చిత్తం చేసుకుంటారా?"

ముసలాయన మాటాడలేదు.

"అప్పుడు నామీద మీకు ఎంతైనా కోపంవస్తుందికదూ!"

"ఎప్పుడమ్మా?"

"నాకు కులంలేదని మీకు తెలిసిపోయిననాడు"

"ఈకాలంవాళ్ల మాటలెందుకో నాకు అర్థంకావమ్మాయి నా కొడుకులు, కూతుళ్లుకూడా నీలాగే వాదిస్తూవుంటారు. ఈ 'అస్పృశ్యత' వల్లనే మన దేశం సర్వనాశనమైపోతుందని వాళ్లంటారు, ఈ అస్పృశ్యతకు ద్వేషమే మూలహేతువుట. ద్వేషమే నాశహేతువుట."

అచలకు ఆశ్చర్యం కలిగింది. వీరి యింట్లోకూడా ఇలాంటి చర్చలు సాగుతూ ఉన్నాయన్నమాట! అలాగని ఆమె ఎన్నడూ అనుకోలేదు. "అయితే ఆమాట అబద్ధమంటారా మీరు?"__అని అడిగిందామె.

రామబాబు నవ్వాడు "అబద్ధమో కాదో నేను చెప్పను. సత్యం మాత్రంకాదు. శాస్త్రాల్లో చెప్పిన విధినియమాలను పాటిస్తూ జీవయాత్ర గడుపుకు వస్తూన్నవాణ్ణి నాకన్నా శ్రోత్రియపరులు__అంటే మాగురువుగారిలాంటి పెద్దలు స్వహస్తపాకమే ఆరగిస్తారు కన్నకూతురు వండినా తినరు. దాన్నిబట్టి వారు తమ ఏకైకపుత్రికను కూడా ద్వేషిస్తున్నారనే మీరు సిద్ధాంతీకరిస్తారా?"

జవాబేమీ చెప్పలేక అచల మౌనంగా ఉండిపోయింది. రాంబాబు ఇంకా ఇలా చెప్పాడు__"అమ్మాయి! నావయసులో చాలదేశం తిరిగాను. వనాలు, అడవులు, పర్వతాలు, పట్నాలు చూచాను. రకరకాల మనుష్యులను, వారి వారి ఆచార వ్యవహారాలను గమనించాను. వాళ్లతోపాటు ఉన్నాను కొన్నాళ్లు ఎవరూకూడా నన్నూ, నా మడినీ, నిందించిన వాళ్లే లేరు. మీరు కాస్త ఆంగ్లవిద్య అభ్యసించారాయెను ఆంగ్లేయులు పాలకులై, సంపద్వంతులై, ఉన్నతిలో ఉన్నజాతికదా! వాళ్లు కనక 'కాళ్లు పైకెత్తి తలక్రిందుగా చేతులమీద నడవటమే నాగరికత' అని చెప్పారంటే మీరంతా కూడా 'భేష్, భేష్' అంటారు. 'ఔను, అలా నడవటమే ఉన్నతికి మార్గం' అని అంగీకరిస్తారు"

ఈరకమైన వాదం ఆమె సనాతనాదుల పత్రికల్లో చాలసార్లు చదివింది. అందుచేత కేవలం మందహాసం చేసి ఊరుకుంది. ఆ మందహాసంలోని వ్యంగ్యార్థాన్ని ఆయన గ్రహించలేదు. _"నేను శ్రీధామశ్రీక్షేత్రం వెళ్లి వచ్చాడు ఎరిగినవాళ్లు, ఎరగనివాళ్లు ఎంతోమంది కలిసిమెలిసి సంచరించాం. అక్కడ ఈ అస్పృశ్యతాసమస్య అనేదే రాలేదు సర్వం జగన్నాథంగా ఉన్నది అక్కడ. ఈర్ష్యాద్వేషాలు ఉంటే అలా జరుగుతుందంటావా? నేను యితర్లువండిన అన్నం తినకపోవచ్చు. కాని నేనెన్నడైనా ప్రపంచంలో దీనదుఃఖితులపట్ల ద్వేషంచూపించానా?"అన్నాడు

"నేను మిమ్మల్ని ఎరగనా పెదనాన్నగారూ! దయ, దాక్షిణ్యం మీలో ఉన్నాయి." అన్నది అచల వ్యగ్రవ్యాకుల కంఠంతో.

"దయకాదు తల్లీ, ప్రేమ"

ఇంతలో సురేశ్‌బాబు అక్కడికి వచ్చాడు రామబాబు అతనికేసి తిరిగి అడిగాడు—"ఏం సురేశ్‌బాబూ! నువు హిందువుడివికదా! కులభేదమును నువు అంగీకరిస్తావా లేదా?"

సురేశ్‌బాబు తక్షణమే ఏమీ జబాబు చెప్పలేదు. అది ఆకస్మికంగా ఊడిపడిన ప్రశ్న. తటపటాయించాడు కాసేపు అనాలోచితంగా అడుగు వేస్తే ఏ ఊబిలో దిగబడిపోతానో అనే అతనికి సర్వదా భయం ఎట్టి పరిస్థితులలో ఆ ప్రశ్న పుట్టిందో తెలుసుకోవాలని ఒకసారి అచలకేసి తిరిగాడు. ఆమె ముఖం అటు తిప్పుకుని కూచుంది ఎటూ పాలుపోక సురేశ్ నీరసంగా నవ్వి—"మేమెవరమో మీకు తెలియనిదేముంది రామబాబూ!" అన్నాడు.

"ఔను ఎరుగుదుననే నేనూ అనుకుంటున్నాను. కాని మీ ఆవిడ అంతా తల్లక్రిందు చెయ్యాలని చూస్తున్నది జాతిభేదమనేది ఉండరాదట అది సర్వనాశన హేతువట మ్లేచ్ఛులచేతి అన్నం తిన్నా తప్పులేదట అలా చెబుతున్నది చిన్నతనంనించీ ఇవేసంగతులు ఆమె తండ్రిగారి దగ్గర అభ్యసించింది కాబోలు! అందుకు ఆమెకిప్పుడు ప్రాయశ్చిత్తం చెయ్యాలా, అక్కర్లేదా అని ఆలోచిస్తున్నాను ఏమంటావు నువు?"

సురేశ్ మాటాడలేదు. అచలకు తనపట్ల నానాటికీ విద్వేషం పెరిగిపోతున్నట్లు సురేశ్‌కు తెలుసును. ఈనాడా విద్వేషాగ్ని ఎంత తీవ్రంగా జ్వలిస్తున్నదో అతనికి తెలియదు. మందహాసం చెయ్యటానికి ప్రయత్నించాడు కాని నవ్వలేకపోయాడు. ముఖం వికృతంగా తయారైంది. "మీతో ఆమె పరాచికం ఆడుతున్నది" అన్నాడు రామబాబుతో—

రామబాబు గంభీరముద్ర వహించాడు. "భర్త ఆరోగ్యంకోసం హిందూయువతి తనకర్తవ్యాన్ని పాలించకపోవటం—పూజరోజున ఉపవాసం ఉండవలసివస్తే నిరాకరించటం—అది కూడా నవ్వులాటకేనా సురేశ్‌బాబు! అయితే అది భయంకరమైన నవ్వులాటే సుమీ! అయితే మీ పెళ్లి హిందూమతరీత్యా అయిందేనా?"

"ఔను" అన్నాడు సురేశ్.

"ఔనవనే నేనూ అనుకుంటున్నాను" అంటూ రామబాబు అచలవైపు తిరిగి — "నీతో నేను చాల సంగతులు చెప్పవలెననుకుంటున్నాను అమ్మాయి! మీనాన్న బ్రాహ్మమతస్థుడైతే ఇబ్బంది యేమీ లేదు ఉంటారు అలాంటి వాళ్లు చాలమంది. సమాజంలోకి వెళ్లి కళ్లుమూసుకుని గద్గదస్వరాన ప్రార్థనలు చేస్తారు. ఇంకా చాలా అనాచారానికి లోబడతారు. కాని కూతురు పెళ్లి చేసేటప్పుడు మాత్రం వ్యవస్థకు కట్టుబడిపోతారు సరే దానికేమిటే. నా అనుమానం ఒకటి నివృత్తి అయిపోయింది, చాలు" అన్నాడు,

సురేశ్‌కు కూడా ఆరంభంలో ఆవేశించిన భయం తీరిపోయింది! "మీరు బాగా చెప్పారు రామబాబూ! అలాటివాళ్ల సంఖ్యే ఇప్పుడు జాస్తి అయింది వాళ్లు —"

సురేశ్ వాక్యం పూర్తికాకముందే అచల అడ్డువచ్చింది. అతన్ని తీవ్రదృష్టిని అవలోకిస్తూ "చేసిన అపరాధాలు చాలక ఇంకా అలాంటి మాట ఉచ్చరించటానికి మీకు సిగ్గులేదూ! అది కూడా నేనిక్కడ ఉండగానే! మానాన్న నిష్కపటిఅని మీకు తెలును. ఆయన త్రికరణశుద్ధిగా బ్రాహ్మమతస్థుడని మీరెరుగుదురు" — అంటూ తీక్షణంగా పలికి అక్కడినించి లేచి వెళ్లిపోయింది.

సురేశ్‌కు మొదట గుండె దడదడ లాడింది. కాని రామబాబు విస్మయ విస్ఫారిత దృక్కులను చూచేసరికి అతనికి కోపం పొర్లివచ్చింది, "నేనన్నదానిలో అబద్ధం ఏముంది? కూతుర్ని హిందూమతస్థుడైన యువకునికిచ్చి పెళ్లిచెయ్యటానికి మీ నాన్న ఇష్టపడలేదూ! అబద్ధమేమో నువ్వే చెప్పు పోనీ!" అన్నాడు

"ఆవిషయం నన్నడగటం ఎందుకు? అందుకు కారణభూతులు మీరేగా! మీకే తెలియకుండా ఉందా? నేనెవరినో, మానాన్న ఏ మతస్థుడో మీకు బాగానే తెలును ఈ విషయాలన్నీ నాతో వాగేందుకు వాకైనా సిగ్గు ఉండవద్దూ! మీయిష్టం వచ్చినట్లు అబద్ధాలు, సుబద్ధాలు కల్పించి చెప్పుకోండి; నేను వినదలుచుకోలేదు." అంటూ గబగబా తనగదిలోకి వెళ్లిపోయింది అచల రామబాబు, సురేశ్ — ఇద్దరూ రాతిబొమ్మలవలె ఉండిపోయారు కాసేపు! చివరకు రామబాబు గొంతు సవరించుకుని — "నీ ఆరోగ్యం ఎలా ఉంటున్నదేమిటి?" అని అడిగాడు

అన్య మనస్కుడై యున్న సురేశ్ ఆ ప్రశ్న విని ఇలా అన్నాడు—
"బాగానే ఉంటున్నది. కాని గుండెలో మాత్రం నొప్పి వస్తూనే ఉంది. అది నిన్నటి నించీ మరీ ఎక్కువైంది ఎందుచేతనో—"

"మరి రాత్రిళ్లు కూడా ఈచలిలో ఇంత ప్రొద్దు పోయేవరకూ తిరగటం ఎందుకూ?"

"తిరగటం కాదు రామబాబూ! అదిగో అయిల్లు కొనబోతున్నాను రెండువేల రూపాయిలు బయానా ఇచ్చివస్తున్నాను."

రామబాబు ఆశ్చర్యపోయాడు. "నది ఒడ్డున ఇల్లు; బాగానే ఉంది కాని నన్నడిగితే కొనవద్దనే చెప్పేవాణ్ణి అనాటి సంభాషణ బట్టి అచలా దేవికి మాయింట్లో ఉండటం ఇష్టంలేదని గ్రహించాను. అయినా—ఇదినువ్వు ఆమె నడిగి చేసిన పనేనా? నీ స్వంత నిర్వాహకమా?"

"మేము ఇక్కడే ఉండక పోవటానికి ఏమీ కారణం లేదనుకోండి సంసారం గడవటానికి కావలసిన సామానులకు కలకత్తాకు అర్డరు ఇచ్చాను. రేప ల్లుండిలో వస్తాయి"

రామబాబు కాసేపు స్తబ్దుడైయుండి చివరకు ఏమి ఆలోచించు కున్నాడో "అమ్మాయి, అచలా!" అంటూ కేక వేసి పిల్చాడు.

అచల పలకలేదు. కాని తన గదిలోనించి బైటికివచ్చి మౌనంగా కుర్చీలో కూచుంది.

"అమ్మాయి! మీ ఆయన ఈదేశంలో ఒక పెద్ద భవనం కొన్నాడు' కాని నువ్వు మా యిల్లు విడిచి ఎక్కడికీ వెళ్లటం నాకిష్టంలేదు."

అచల మౌనముద్ర వీడలేదు రామబాబు మళ్లీ ఇలా అన్నాడు—
"ఇల్లూ, ఇంటికి కావలసిన సామానుమాత్రమే కొనటంకాదు ఒక గుర్రపు బండీకూడా వస్తున్నదట—నేను విన్నాను. ఏమైనా అంతా నీకోసమేనట" అంటూ నవ్వుతూ అటు సురేశ్ వైపు, ఇటు అచలకేసి చూచాడు. కాని ఆ ఇద్దరి ముఖాల్లోనూ ఆనందరేఖ అంటూ లేనేలేదు గంభీరంగా కూచుని ఉన్నారు. రామబాబు అది గమనించాడు. అచలతో —"కానిఅమ్మాయి! నీ యిష్టం ఏమిటో..."అన్నాడు

"నా యిష్టంతో అవసరం ఏమిటి పెదనాన్న గారూ!"—అన్నదిఅచల,
"అదేమిమాట తల్లీ! నిజానికి నీ యిష్టప్రకారమే ఏదైనా—"

అచల లేచి నిల్చుంది. "కాదు కాదు పెదనాన్నగారూ! నా యిష్టప్రకారం జరుగుతున్నదేదీ లేదు. మీకింకా చాలవిషయాలు తెలియవు. అవన్నీ నేను చెప్పుకోలేను కూడాను."

ముసలాయన మరేమీ మాట్లాడలేకపోయాడు, మాటాడవలసిన అవసరమూ లేదు ఇంతలో ఒక నౌకరు పళ్లెంలో నిప్పుకణికలు పోసుకుని వచ్చాడు. రామబాబు ఆశ్చర్యాన్వితుడైనాడు ఆయన అడక్కముందే సురేశ్ చెప్పాడు — "నేనే నిప్పు తీసుకురమ్మని చెప్పాను కొంచెం కాపు పెట్టుకోవాలి, ఇవాళ గుండెలో నొప్పి మరీ..."

రామబాబుకు ఇప్పుడు నిప్పుకణికల ఆవశ్యకత అర్థమైంది. ఎవరు కాస్తారు, అయితే? ముసలాయన అచలకేసి చూచాడు. ఆమె ముఖం తిప్పుకుని "నేను వెడుతున్నాను. అంటూ ఎవరి ప్రత్యుత్తరమూ అపేక్షించకుండానే అక్కడినించి వెళ్లిపోయింది. తనగదిలోకి వెళ్లి గడియవేసుకుంది.

రామబాబు లేచి నౌకరు చేతిలోనించి పళ్లెం అందుకుని — "పద సురేశ్ బాబూ!" అన్నాడు.

"మీరా?"

"ఔను నేనే కాచుతాను పద, నాకావని బాగానే చేతవును. ఈ నాజీవితంలో అనేకమందికి ఇలా ఉపచరించాను" అంటూ సురేశ్ బాబును తనగదిలోనికి తీసుకుపోయాడు.

సురేశ్ ముఖం సంకోచంతో మ్లానమై ఉంది. అది గమనించి ముసలాయన మృదువుగా అతని చెయిపుచ్చుకుని సాంత్వనపూర్వకంగా — "సురేశ్ బాబూ! ఇలా ఎన్నాళ్లని సంసారం చేస్తావుపాపం? మీ యిద్దరిలో ఏవో మనస్పర్థలు ఏర్పడ్డాయి తెలుస్తూనే ఉంది నాతో చెప్పు" అన్నాడు

సురేశ్ నోటివెంట ఒక్కమాటైనా రాలేదు మొదట అతని పెదవి మాత్రం కాసేపు కంపించింది. పసిపిల్లవాడిలా వడివున్నాడు మరుక్షణమే అతని కన్నుల వెంట అశ్రువులు ప్రవహించాయి. ముఖం తిప్పుకుని పడుకున్నాడు.

# 35

సురేశ్ మంచంమీద పడుకున్నాడు చేరువనే కుర్చీలో కూచుని రామబాబు అతని గుండెమీద కాస్తున్నాడు. అంతలో ఎవరో తలుపు తోసుకుని వచ్చిన చప్పుడైంది ఇద్దరూ అటువైపు చూశారు. అచలలోనికి వచ్చి - "పెదనాన్నగారూ! చాల పొద్దుపోయింది ఇక మీరు వెళ్లి పడుకోండి" __ అని నిరాడంబరంగానే పలికింది.

"అందుకోసమనే నువ్వు వస్తావేమోనని ఎదురుచూస్తూకూచున్నాను" అంటూ రామబాబు లేచినిల్చుని సురేశ్ ను లక్ష్యిస్తూ-"మీరిద్దరూ వ్యర్థంగా స్పర్థలు పెంచుకుంటున్నారు అలా చేయవచ్చునా?"-అని ఇటు అచలకేసి తిరిగి-"అమ్మాయి! ఎవరు చేయవలసిన పని వాళ్లే చేయటం ఉచితం, రా, ఇలా కూచో, నేనిక వెళ్లి పడుకుంటాను"-అంటూ బైటికివెళ్లి తలుపులు వేస్తూ-"కునికిపాట్లుపడుతూ చేతులు కాల్చుకోకుసుమీ" అంటూ నవ్వుతూనిష్క్రమించాడు.

సురేశ్ మంచందగ్గర కుర్చీలో కూచుంది అచల. "మళ్లీ నొప్పి ఎందుకు ఆరంభమైంది. నొప్పి ఎక్కడేమిటి?" అని మెల్లిగా అడిగింది.

సురేశ్ కళ్లుమూసుకుని తెరవనేలేదు నోరువిప్పి మాటాడనూలేదు. కేవలం గుండెదగ్గర చెయిపెట్టి చూపించాడు గదిఅంతా నిశ్శబ్దంగా వుంది. అచల ఫ్లానల్ గుడ్డ వెచ్చచేసి గుండెపై కాస్తున్నది. సురేశ్ అకస్మాత్తుగా ఆమె చేతిని తన గుండెపై అదుముకున్నాడు. అచల ముఖంలో ఉద్వేగమేమీ పొడచూపలేదు. "కాపనీయండి మరి!" అనిమాత్రం అన్నది

సురేశ్ చెయి వదలిపెట్టాడు. కాని మరుక్షణమే అతడు లేచి కూచుని కుర్చీలోఉన్న అచలను బాహువులు చాచి ఒడిలోకి లాక్కుని, గాఢాశ్లేషంలో బంధించి ఆమెను ముద్దులవర్షంతో తడిపివేశాడు. ఒకక్షణం ముందు ఊహ్యానరహితమైన, ఆవేగపూర్ణమైన ఈ ఉన్మత్తనాటకం ఆ భయంకర మానవసముద్రంలోనే పర్యవసిస్తుందని ఆమె అనుకుంది కాని కాలం గడుస్తున్నకొద్దీ ఈ నిగ్గుమాలిన ఉన్మాదానికి అంతంలేదు; దేశకాలాలను అతిక్రమించి అనంతమూ, అక్షయమూ, ఔతుంది; యుగయుగాలకూ ఇది తప్పదు అని ఆమెకు తోచింది.

అచల ఏమాత్రమూ అడ్డగించలేదు; అనుకూలించనూలేదు, శాంతంగా, శాతిబొమ్మలాగ ఉండిపోయింది. సురేశ్ ఈ లోకంలో లేడు అతని కన్నులకు కటికచీకటి యేదో కమ్మివేసింది. లేకపోతే అలా ముద్దులు పెట్టుకోవటంలో సిగ్గు, అవమానము అనుభూతం కాకండా ఉండేవా? కాస్త అలసట తీర్చుకునేందుకుగాను అతని ఉత్సాహం తగ్గింది అప్పుడు అచల తిన్నగా పట్టు విడిపించుకుని తన స్థానంలో వచ్చి కూచుంది.

సురేశ్ ఒక దీర్ఘనిశ్వాసం విడిచాడు. "ఇలా మనం ఎన్నాళ్లు గడుపుతాం?" అంటూ ప్రత్యుత్తరం అపేక్షించకండానే—"నీ యిబ్బంది ఏమిటో నేను తెలుసుకోగలను కాని నా విషాదాన్ని కూడా నువ్వు కాస్త గమనించు నేను జీవచ్ఛవాన్ని"

"మీరిక్కడ ఇల్లు ఖరీదు చేశారా?" అని అడిగింది అచల అతని మాటలకు జవాబు చెప్పకండా.

"నీకోసమనే కొన్నాను అచలా?"

"ఇంకా సరంజామా, గుర్రపుబండీ కూడా తెప్పిస్తున్నారా?"

"ఔను"

ఇంకా ఆసంగతులను గురించి తరచి అడగటం అనవసరమని అచల అనుకుంది. కానేపు ఊరుకుని—"రాంబాబుగారితో మా నాన్నగారిపేరు చెప్పారా మీరు?"—అని ప్రశ్నించింది.

"లేదు"

"ఇంకా కాపు పెట్టాలా?"

"అక్కర్లేదు."

"అయితే నేను వెడతాను. నిద్రవస్తోంది" అంటూ అచల లేచి గుమ్మందాకా వచ్చేసింది సురేశ్ పక్కమీద లేచికూచుని—"నీ ఉద్దేశం చెప్పివెళ్లు అచలా! మనం మరింకెక్కడికేనా వెడదామా!"

"ఎక్కడికి?"

"ఎక్కడికైనా సరే మనలను ఎవరూ గుర్తించలేనిచోటికి. ఆచోటు ఎంతదూరమైనాసరే—"

ఆవేశంతో సురేశ్ కంఠస్వరం కంపించింది.

"ఇక్కడైనా మనల్ని ఎవరూ ఎరగరు. ఇంతవరకు ఎవరూ గుర్తించలేదు"—అన్నది అచల శాంతంగా సరళ స్వరంతో.

ఆ మాటతో సురేశ్ కు ఉత్సాహం వచ్చింది. —"కాని ముందు ముందు —"అన్నాడు

అచల అర్థోక్తిలో అందుకుని — "ముందుముందు పట్టుపడతామంటారా? ఆ భయం ఏ దేశంవెళ్ళినా ఉన్నదేగా!"

"అయితే ఇక్కడే ఉందామంటావా? అదేనా నీ ఉద్దేశం? మర్మం విడిచి మాట్లాడు అచలా!"—అన్నాడు సురేశ్ ఉల్లాసంగా. కాని అచలాదేవి విసురుగా తలుపువేసి తన గదిలోకి వెళ్ళిపోయింది. సురేశ్ పక్కమీద నిస్తబ్దుడై కూచున్నాడు

* * * *

చాలరోజులనించీ ఆకాశము మేఘనిర్ముక్తము కాకుండా ఉంది. సూర్యరశ్మి అంటూ లేదు. సురేశ్ కొత్తగా కొన్న యింట్లో సామానుఅంతా అస్తవ్యస్తంగా పడివుంది. జాగ్రతగా ఎక్కడిదక్కడ సర్దుదామన్న ఉద్దేశం ఎవరికీ ఉన్నట్టు లేదు. రెండుగుర్రాలు కొట్టంలో ఉన్నాయి ఖరీదుగల బండికూడా ఒకటి అక్కడ ఉంది

రోజులు ఒకరకంగా గడిచి పోతున్నవి. ఒకనాడు రాంబాబు ఒక కవరు పుచ్చుకుని సురేశ్ గారింటికి వచ్చాడు. అచల ఆసమయాన ఒక పేము సోఫాలో పడుకుని ఉంది ముసలాయన్ను చూడగానే ఆమెలేచి కూచుంది.

"ఇదిగో రాక్షసి నీకు ఉత్తరం రాసింది తల్లీ! ఇన్నాళ్లనించీ నీకు ఉత్తరం రాయాలంటే తీరిక చిక్కలేదుట. అందుకు నిన్ను క్షమాపణ వేడుకుంటూ, నీకు సహస్రప్రణామాలు చెప్పమంటూ నాకు రాసింది. ఆమెను నువు క్షమించాలి"—అంటూ రాంబాబు ఉత్తరం ఆమె చేతికిచ్చి, ఒక కుర్చీలో ఆసీనుడైనాడు

అచల ఆఉత్తరాన్ని రెండుసార్లు చదువుకుంది. "అయితే ఎల్లుండి ఉదయానికల్లా అందరూ వచ్చేస్తున్నారన్నమాట! ముసలమ్మట ఎవరు పెదనాన్నగారూ! ఇంకా రాజకుమారి, రాజకుమారుడు, 'ట్యూటర్'..."

రాంబాబు మందహాసం చేశాడు. "రాక్షసి హాస్యరసధోరణిలో రాసిందన్నమాట! ముసలమ్మంటే నావితంతు సోదరి. ఆమెకూతురే రాజకుమారి. ఆ అమ్మాయిని భండారపురంలో భవానీబాబుకు ఇచ్చి వివాహం చేశారు నా చెల్లెలి కొడుకు పదేళ్ళవాడు. వాణ్ణి రాక్షసి 'రాజకుమారుడని' పరిహాసం చేస్తూ ఉంటుంది. ఆ 'ట్యూటర్' ఎవరో మాస్టేగాని చెప్పలేను,

గలుగుతూ వచ్చి కులాసాగా నాలుగురోజులుండి పోతారు. సంతోషమే. కాని మాయిల్లు చిన్నది. అందరూ వస్తే చాలదు మాయిల్లు గనక—"

"కాని వ్యవధి లేదుకదా పెదనాన్నగారూ! పైగా వేరే ఇక్కడ వారికి వసతిగా ఉంటుందా?"

"వ్యవధి లేకపోలేదు. ఈ నిమిషంనించే అన్నీ యేర్పాట్లూ చేయిస్తాను. ఇందాకనే సురేశ్‌బాబుతో మాట్లాడాను. వెంటనే అతడు ఇంకో యిల్లు అద్దెకు తీసుకున్నాడు. అక్కడ కొయింటి యేర్పాట్లు నువ్వు చూచుకోవలసిందే, కాని మా యింట్లు చేస్తే నీకు నచ్చకపోవచ్చు. మాబండిలో తీసుకు వెళ్లి నిన్నక్కడ దిగబెట్టి వస్తానుమరి!"

అచల క్షణకాలం మౌనముద్రలో ఉండి పోయింది. వెంటనే లేచి— "మంచిది; దుస్తులు మార్చుకువస్తాను ఉండండి"— అని చెప్పిలోనికి వెళ్లింది.

చెప్పతలచుకున్న దంతా రాంబాబు సుస్పష్టంగానే చెప్పాడు. ఆయన బంధువు లెవరోవస్తున్నారు వారి కోసంతనయిల్లు ఖాళీచేసి తాను వేరే ఇంకో యింటికి వెళ్లవలసి ఉన్నది. ఈసంగతి అచలకు సుబోధకమైంది. కాని ఆమె హృదయం ఎందుకో బాధపడుతున్నది.

చాలరోజులనించీ ఆమె యిల్లువిడిచి బైటికి రానేలేదు. అందుకు మనస్కరించ లేదుకూడాను. ఇవాళ ఆమె రాంబాబు వెంట వీధిలోకి వచ్చి చూచే సరికి అంతా కొత్తగా, విచిత్రంగా కనిపించింది బండీ సిద్ధమైఉంది బండీవాడు యజమానురాలిని చూచి సలాం చేశాడు ఆమె బండీ ఎక్కింది. రాంబాబు కూడా యెక్కి కూర్చున్నాడు. అచలకు అంతా ఏదో స్వప్నం లాఉంది.

రోడ్డుమీద చక్రాలు చప్పుడు చేసుకుంటూ బండిసరసా త్తిపోతోంది ఆ ధ్వని ఆమెకు అస్పష్టంగా వినిపిస్తోంది. ఆమె బహిరింద్రియాలు పనిచే స్తున్నాయో లేదో! ఇంతలో రాంబాబు కంఠధ్వని చెవినోకి ఆమెకుచి కివడ్డది. ఆయన అభినవంచేసి చూపుతూ—"అమ్మాయి! నౌకర్లు అక్కడ సామానంతా యథావిధిగా ఈపాటికి సర్దుతూ ఉంటారు కాని తల్లీ! నీ బంగారు పడకగదిలో మాత్రం ఎవర్నీ అడుగుపెట్టవద్దని గట్టిగా నిషేధిం చాను—"అంటూ ఆమె లజ్జాపూర్ణ మంద హాసాన్ని ఆశించాడు. కానిఆమె ముఖంచూచి అకస్మాత్తుగా నిస్తబ్ధుడైనాడు.

ఆయన భావపరివర్తనను అచల గమనించింది. కారణం తెలుసుకుంది. అందుచేత కొత్తయింటివద్ద వచ్చి బండీ ఆగేంతవరకూ ఆమె తన నిస్తేజమైన ముఖాన్ని ముసలాయనకు కనిపించకుండా పక్కకు మళ్ళి కూచుంది.

బండీ ఆగిన చప్పుడు వినగానే సురేశ్ బైటికివచ్చాడు దాసదాసీ జనం తమతమ పనులను మానివేసి కొత్తయజమానురాలిని చూడవచ్చారు కాని ఆమె ముఖం చూచి అందరూ నిరుత్సాహపూర్ణులై తిరిగి వెళ్ళారు,

రాంబాబుతో పాటు అచల బండి దిగింది. సురేశ్ వైపు ఆమె ఒక్క సారైయినా ముఖమెత్తి చూడలేదు ముగ్గురూ మెల్లగా మౌనంగా ఇంట్లోకి వెళ్లారు అచుట్టుపక్కల వాతావరణంలో ఎక్కడా ఆనందకిరణలేశం కూడా కనిపించలేదు.

# 36

కొత్తయింట్లో ఎక్కడి వక్కడ చక్కగా సర్దటం అయింది ఊడ్చి నీళ్లుచల్లి పరిష్కృతం చేశారు అంతా అయిన తరువాత ముగ్గురూ బండిఎక్కి తిరిగి వచ్చేస్తున్నారు.

కొంచెం పొద్దుపోయింది. సప్తమి చంద్రుడు ఆకాశాన పరుగుపెడుతున్నాడు. ప్రకృతి ప్రశాంతంగాఉంది. మేఘశకలాలు నదివైపుగా పయనించి దిగంతాన్ని చేరుకుంటున్నవి. పుచ్చపూవులా వెన్నెల కాస్తున్నది వృద్ధరాంబాబు ప్రకృతి సౌందర్యావలోకన కుతూహలుడై కిటికీలోనించి బైటికి ముఖం పెట్టి ఆనందిస్తున్నాడు వృద్ధులు కానివారూ...,చక్కని వయసులో ఉండి సంపూర్ణ రసాస్వాదన చేయదగిన ఆయిద్దరూ బండీలో తలవంచుకుని, కళ్లుమూసుకుని ముడ్చుకుడిగి కూచున్నారు

చాలకాలంనాటి సన్నివేశం ఒకటి అచలాదేవికి జ్ఞాపకం వచ్చింది. ఒకనాటిరాత్రి కలకత్తాలో సురేశుతో కలిసి అతని యింటినించి బండి రెక్కి వస్తున్నది, ఆరోజుల్లో సురేశుబాబు సంపద, విపుల భోగసామగ్రి ఆమెను మహింబాబు చేరువనించి చాలదూరం ఆకర్షించినవి అనాడు ఈ సురేశు చేతుల్లోనే తాను ఆత్మ సమర్పణ చేసుకుని వుండేది. ఈవిషయం ఇప్పుడు తనకు ఎందుకు జ్ఞాపకం వచ్చిందా అని అంతర్వీక్షణ చేసుకుంది,

అచల తన మనఃస్థితిఆమెకు స్పష్టంగా అనుభూతమైంది, మరుక్షణమే ఆమె లజ్జాభిమానాలతో కుంగిపోయింది.

సిగ్గు! సిగ్గు! సిగ్గు! ఈ బండి ఆభవనం— ఇంతదగ్గా ఏమిటిది? ఇంట్లోని దాసదాసీజనం అంతా ఇప్పుడు తన పట్ల అత్యంత గౌరవ మర్యాదలు చూపుతూ ఉన్నారు. ఏనాటికైనా తన నిజస్థితి బైటపడవచ్చు. ఆనాడు తన లజ్జాభిమానాలను ఎలా భరిస్తుంది? ఎక్కడ పోయి తాను దాక్కుంటుంది?

ఇల్లు చేరిన వెంటనే రాంబాబు సంధ్యాదికాలను నిర్వర్తించుకునేందుకు వెళ్లాడు. తల నొప్పిగా ఉన్నదన్న వంకతో అచల తనగదిలోకి వెళ్లి లోపల గడియ వేసుకుని, పక్కపై పడుకుంది తన మూలాన తండ్రికీ భర్తకూ దుఃఖావమానాలు లభించబోతున్నాయి బంధువులు కూడా ఎంతో విచారిస్తారు ఇలాఈ రకమైనఆలోచనలతో ఆమె మనస్సు నిండిపోయింది. ఇతర దుఃఖాలన్నీ ఆసమయంలో అంతర్హితములై పోయినవి నిజస్థితి బైట పడిననాడు తనగతి యేమిటి? అదీ ప్రస్తుతం ఆమెచింత

అచల బ్రహ్మసమాజంలో పుట్టిపెరిగింది. భూశయనము, వృక్షతల నివాసము అభిలషించేవారెవరూ ఆసమాజంలో ఆమెకు కనిపించలేదు, ఆహారవిహారాదులలో ఎవరూ వైరాగ్యభావాన్ని ప్రదర్శించటం ఆమె యెరగదు. హిందూధర్మాన్ని గురించీ, ఆశయాలను గురించీ, ఆమెకు పరిచయంలేదు. అయినా పరలోకాసక్తిలో ఇహలోక సుఖాలను త్యజించగల కఠిన నిష్ఠ ఆమె ఎక్కడా చూడలేదు. ప్రపంచంలో ప్రతివ్యక్తీ తీవ్ర వాంఛలతో వేగిపోతూ ఉంటాడనే ఆమె ఉద్దేశం,

కనుక 'ఇదంతామిథ్య' అని భావించి ఐశ్వర్యాన్ని తృణీకరించగల స్థితిలో ఆమె లేదు. ఏ వస్తువునూ ఆమె తుచ్ఛంగా భావించి నిస్పృహతో ఉండలేదు. ఆమె అజన్మశిక్షా సంస్కారాలు అట్టివి. ఈ భవనంలో, ఈ సంపదతో, ఈ దేశంలో దుఃఖాలు మరచిపోయి సుఖంగా ఉందాం'— అన్న దుర్నివార్యమైన మోహం ఒకటి ఆమెలో ప్రవేశించింది.

ప్రస్తుతం అనుభవంలో ఉన్న దుస్సహ దుఃఖం'నించి విముక్తిపొందవలెనన్న అస్ఫుటవాంఛ ఆమెలో పనిచేస్తోంది.

బ్రహ్మసమాజంలోనూ, తదనురూపములైన యితరసంఘాలోనూ వితంతువులకు పునర్వివాహం చెయ్యటం లేదూ? హిందూయువతులవలె కట్టుకున్నవాడినించి చచ్చిపోయేవరకూ ఒకే ఒక భర్తను అంటిపెట్టుకుని ఉండే

వాళ్లు మరెక్కడా లేరు. కాని భర్త ఉండగానే మరొకర్ని భర్తనుగా స్వీకరించటం అపరాధం కాదూ, అవమానం కాదూ! అచలను వేధిస్తున్న భావం అదిగాని ధర్మలోప భయం కాదు; పరలోక చింత కాదు.

ఇంతలో రాంబాబు బైటినించి తలుపు తట్టుతూ—"భోజనం చెయ్యకండా పడుకున్నావేం అమ్మాయి! ఒంట్లో బాగాలేదా?"—అని అడిగాడు

అచలాదేవి ఆలోచనలు తెగిపోయాయి. మొట్టమొదట ఆపిల్చేది తనతండ్రి యేమోనని ఉలికిపడ్డది. ఆయనకూడా ఇలాగే...తను కోపం వచ్చి పడుకున్నప్పుడు...తలుపుతట్టి పిలుస్తాడు.

తాను అప్పుడు ఎట్టిస్థితిలో ఉన్నా ఆముసలాయన అంత స్నేహ వాత్సల్యాలతో పిలుస్తోంటే ఉదాసీనంగా ఉండలేకపోయింది. కళ్లలో నీళ్లు తిరిగాయి. పైటచెరగుతో తుడుచుకుని, లేచి వచ్చి తలుపు తెరిచింది.

"పెదనాన్నను ముసలివాణ్ణిచేసి ఆడిస్తున్నావా? రా తల్లీ"—అంటూ ఆమెగడ్డం పుణికి, చెయిపట్టుకుని వరండాలోకి తీసుకువచ్చి కుర్చీలో కూచోబెట్టాడు. సురేశ్‌కూడా అక్కడ వేరే కుర్చీలో కూచునిఉన్నాడు. తలయెత్తి ఒకసారి అచలకేసి చూచాడు; మళ్లీ తలవంచుకున్నాడు

రాంబాబు అన్నాడు—"సురేశ్ బాబూ! మీ ఆవిడ వచ్చి తెల్లదొరసాని అయిపోయిందయ్యా. తిథి, వారం, వర్జం—ఏదీ అడగదూ, పెట్టదు. నాకుమాత్రం అరవైయేళ్లుగా ఉంటూవచ్చిన యీ పూర్వాచారపు పిచ్చి ఇవాళ వదిలిపోదు. మీరేమైన అనుకోండి; నేను చెప్పకతప్పదు; రేపు ఉదయం ఏడుగంటలకు లగ్నం మంచిది—" "దేనికి లగ్నం?"—అన్నాడు సురేశ్ ఆశ్చర్యాన్వితుడై, ముసలాయన భావన చప్పున అర్థం కాక.

అందుకు రాంబాబు సూటిగా జవాబు చెప్పకండా అన్నాడు "రేపు ఉదయం తప్పితే మరి వారంరోజులదాకా మంచి ముహూర్తం లేదు."

ఈసరికి సురేశ్ ఆయనభావం అవగతం చేసుకోగలిగాడు. జవాబేమీ చెప్పలేదు. ప్రక్కకు తిరిగి అచలకేసి చూచాడు. ఆమె అతనికేసే తదేకంగా చూస్తూ—"అయితే మరి రేపు తెల్లవారుఝామునే కొత్తయింటికి వెళ్లిపోగలమా?"—అని సూటిగా అడిగింది.

"అక్కడ సున్నం కొట్టినగోడలు ఇంకా పచ్చి ఆరలేదు. నేలకూడా బాగా పరిశుభ్రం చేశారుకాదు. అటువంటి యింట్లో అచలకు ఏమన్నా ఆరోగ్యం చెడుతుందేమోనని —"

అచల అర్థోక్తిలో అందుకుని, ఒక రకంగా నవ్వుతూ అన్నది— "చాలు చాలు ఊరుకోండి. కుక్కలు, పందులు కూడా తమ నెలవులు విడిచి బైటికిరాలేని నాటి తుఫానురోజున నన్ను మీరు లాక్కొచ్చి ఎక్కడో నా అన్నవాళ్లెవరూ లేనిచోట, ఒక చెట్టుక్రింద తెచ్చి దిగబెట్టిన వారుకాదూ! ఇవాళ మీరు నా ఆరోగ్యభంగానికి వెరుస్తున్నారా? ఆనాడు చావకండా బ్రతికినదాన్ని ఈనాడు చచ్చిపోతానా యేమిటి?"

ఆ తరువాత అచల రాంబాబు కేసి తిరిగి "మీరేమీ దిగులుపెట్టుకోకండి పెదనాన్నగారు! మేము రేపు ఉదయమే వెళ్లిపోతాం కొత్త యింటికి. మీఋణం మేము ఎన్ని జన్మాలకు తీర్చుకోలేం"— అంటూ ఆమె వెక్కివెక్కి యేడుస్తూ గబగబా తనగదిలోకి పోయి తలుపు వేసుకుంది.

రాంబాబు నిర్ఘాంత పోయాడు ఒక సారి ఘటుతల వంచుకుని కూచున్న సురేశ్ వైపు, ఒక సారి అటు అచలాదేవి గదివైపు చూచాడు విహ్వాల దృష్టితో. "అరె ఏమిటిది!" అనిఉచ్చరించాడు. కాని అదియేమిటో...ఆమెలోని మర్మాంతకవేదన యెట్టిదో ఆ అంతర్యామికి వినా మరెవరికి తెలుసు?

# 37

మరునాటి ఉదయం ఆకాశం మేఘాచ్ఛాదితమైనది ప్రకృతి మ్లానముఖం పెట్టింది. భవనం ముందు బండీ సిద్ధమై ఉంది. ట్రంకులూ, పరుపుచుట్టలూ బండీలో పెట్టేశారు. రాంబాబు చెప్పిన శుభముహూర్తాన అచల వచ్చి బండి యెక్కేముందు ముసలాయనకు పాదాభివందనం చేసింది. నవ్వుతూ అన్నాడు—"ముసలి తండ్రివల్ల ఎప్పుడూ ఏదోఇబ్బంది ఉంటూనే ఉంటుంది అమ్మా! నాకు నమస్కారం చెప్పి, రెండుమైళ్లదూరం వెళ్లిపోయినంతమాత్రాన నాతోసంబంధం విడిపోయిందనుకోకు సుమీ!"

"నేను అలా ఎప్పుడూ అనుకోను పెదనాన్నగారు!" అన్నది అచల ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

ఇన్నాళ్లుగా తన సమక్షంలో ఉండిన అచల ఇవాళ రవంత దూరమై పోతున్నదని రాంబాబు నేత్రాలుకూడా బాష్పాకులమయినవి. "నువ్వు నీభర్తతో వెడుతున్నానంటే నాకు సంతోషం కలగవలసినది. కాని ఎందుకో కన్నీళ్లు ఆపుకోలేకపోతున్నాను. నువ్వు దగ్గిర ఉన్నన్నినాళ్లూ ఏదో మంచీ, చెడూ కనుక్కుంటూ ఉన్నాను. కొంచెం దూరమౌతున్నాం. అయినా వచ్చి చూచిపోతూ ఉంటానులే తల్లీ"

సురేశ్ ఆవెనకనే నిల్చిఉన్నాడు అతడుకూడా భక్తిపూర్వకంగా ముసలాయనపాదాల్ని స్పృశించాడు.

"నువ్వు ఎప్పుడూ ఏదో విచారంగానే ఉంటున్నావు సురేశ్! చూస్తున్నానుగదా! త్వరలోనే నీకు తృప్తి సంతోషం చేకూరాలని నా హృదయపూర్వకమైన ఆశీర్వాదం" — అన్నాడు, ముసలాయన.

సురేశ్ జవాబేమీ చెప్పలేదు మరొకసారి నమస్కారం చేసి బండీలో యెక్కి కూచున్నాడు. రాంబాబు ఒక నిట్టూర్పు పుచ్చి తిరిగి వస్తూ అనేక ఆలోచనలలో మునిగిపోయాడు.

బంధువులంతా రాకముందే వీళ్లను మరొకయింటికి పంపించివెయ్యటం మంచిపనే అయిందని ఆయన సంతృప్తిపడ్డాడు తన వితంతు సోదరి అసాధ్యపుమనిషి. పరాయి వాళ్లను స్తనశల్య పరీక్ష చేస్తుంది. రావటంతోనే అచలను అనేక ప్రశ్నలువేసి తీయతుంది ఆపిల్లనుగురించి అంతా తెలుసుకుని ఆమెను ఏవగించుకుంటుందేమో కూడాను.

అచలను గురించిన పుట్టుపూర్వోత్తరాలేమీ రాంబాబుకు తెలియవు. ఆమెప్రవర్తనబట్టి ఒక భద్ర మహిళ అని ఆయన నిశ్చయించుకున్నాడు. ఆమె యెన్నడూ అబద్ధం చెప్పదు తాను బ్రాహ్మమతస్థురాలిననీ; మడీ, మైలాపాటించననీ, దేవుళ్లపై తనకు నమ్మకం లేదనీ—ఇలాంటి విషయాలన్నీ దాచుకోకండా చెప్పేస్తుంది. అది ఆయన బంధువులువింటే వారికి కంపర మెత్తుతుంది.

రాంబాబుకు పిల్లలు లేరు, రాక్షసిని ఆయన చిన్నప్పటినించీ పెంచాడు. మొట్టమొదట ఒక ఆడపిల్ల పుట్టి వెంటనే చనిపోయింది ఆపిల్ల బ్రతికి వుంటే అచలాదేవి తల్లియంత వయసులో ఉండేది. సురేశ్‌బాబుకు ఆనాడు జ్వరంరాగా దిక్కు, దివాణం లేక అచల ఏడుస్తూ డాక్టరు కోసం తిరుగుతూన్నప్పుడు రాంబాబు ఆమెను ప్రథమంగా చూచాడు అక్షణంలోనే తనకు సంతానంలేని దిగుల్ను పూర్వంకన్న శతాధికంగా అనుభ

వించాడు. అనేకసంవత్సరాలుగా తాను వాంఛిస్తున్న సంతానం అప్పుడు కళ్ళముందు ప్రత్యక్షమైనట్టు తోచింది. నాటినించీ అచలపై ఆయనకు మమత అధికతరం అవుతూ వచ్చింది. కాని రానురాను ఆమె జీవితంలో ఏదో గంభీర రహస్యం ఇమిడియున్నట్లు ఆయనకు అనుమానం కలిగింది. కాని ఆరహస్యాన్ని తెలుసుకోవలెనని ఆయన పట్టుపట్టలేదు.

ఒకనాడు రాక్షసి ద్వారా ఆయనకు ఒక విషయం తెలిసింది. బహుశః సురేశ్ బాబు తన కుటుంబీకులతో పోట్లాడి, భార్యను తీసుకొని వచ్చేశాడేమోనని ఆమె సూచించింది. ఆ తరువాత అచల తాను బ్రాహ్మ మతస్థురాలినని స్వయంగా చెప్పుకుంది. సురేశ్ బాబు మెడలో యజ్ఞోపవీతం ఉంది. ఈవిషయాల్ని బట్టి... హిందూ మతస్థుడైయుండి సురేశ్ బాబు ప్రేమను పురస్కరించుకుని కాబోలు బ్రాహ్మబాలికను వివాహమాడి స్వజనానికి దూరమైనాడని రాంబాబు ఒకవిధంగా నిశ్చయించుకున్నాడు. రానురాను అదే నిజమని విశ్వసించాడు కూడాను.

రాంబాబు నిజమైన హిందూ మతాభిమాని. హిందూమతధర్మాన్ని ఆయన అవగతం చేసుకున్నాడు. కాని హిందూ సంఘములోని కాఠిన్యత ఆయనలో లేదు. బ్రాహ్మణ సంతానమైన సురేశ్ బాబుకు ఈదుర్గతి సంప్రాప్తించక పోయినట్లయితే ఆయన సంతోషించేవాడే. అయినా ప్రేమించి వివాహమాడటం, తమ్ముళ్లను బంధువులను కూడా త్యజించి రావలసిన అవసరం ఏర్పడటం — ఈ మొదలైన విషయాలన్నీ ఆయన్ను ముగ్ధుణ్ణి చేసినవి. ఆప్రేమ దంపతులకు ఆశ్రయం ఇచ్చేందుకు ఆతృత పడ్డాడు. కాని చివరకు ఆదంపతుల మధ్య కూడా తగినంత అనుకూలత లేకపోవటం చూచి ఆయన ఎంతో నొచ్చుకున్నాడు. కొత్త యింట్లో ఏకాంతంగా ఉండటం వల్లఇద్దరూ పవిత్ర ప్రేమలో ఏకమౌతారేమోనని ఆయన ఆశించాడు.

స్నానానికి వేళ అయింది బుజాన అంగవస్త్రం వేసుకుని రాంబాబు నదికి బయలు దేరాడు దారిలో ఆయన ఇలా అనుకున్నాడు — "పిచ్చిపిల్ల అచల! వెళ్ళేటప్పుడు నామీద ఆమెకు చాల కోపం వచ్చినట్టుంది మరి రెండు మూడురోజుల్లో ఆకోపమంతా ఆమె మరచి పోయి నన్ను చూడగానే ముఖంలో పువ్వులు వికసించక పోతే ఊరుకుంటానా? 'ఏం అమ్మాయి ఇంకా నీలో ఆనాటి కోపం ఎంత మిగిలి ఉందో కాస్త చెప్పు?' — అని అడుగుతాను. ఏమి జవాబు చెబుతుందో చూస్తాను"

ఇలా అనుకుంటూన్న ఆయన మనోవీధిలో అచలదేవి సాక్షాత్కరించింది. బర్ఫీ తయారుచేసి పళ్లెంలో పెట్టుకుని తీసుకువచ్చి—"పెదనాన్నగారూ నేను మీకోసం ఇది స్వయంగా తయారుచేశాను. తినకపోయారంటే మీకూ, నాకూ, లడాయి తప్పదు"— అని అంటున్నట్టుగా ఆయనకు మాటలువినిపించాయి. శాంత–నిర్మల– మందహాసోద్భాసిత మైంది ఆయన ముఖం. ఆట్టి మధురభావాలతో ఆయన స్నానం ముగించుకుని ఇల్లు చేరాడు

అందరూ రేపుసాయత్రం వస్తారు. అలాగని టెలిగ్రాం వచ్చింది. తన సోదరి, ఆమెకొడుకు, కూతురు——ఇంకా చాల పరివారం కూడావస్తుంది. ఈలోగా తనకు చాలా పని ఉంది ఇంటి దగ్గిర వర్షం వచ్చేట్టుగా ఉంది ఒక వంక. ఒకవేళ వర్ష జోరుఅయిందంటే వెళ్లటం పడదేమోనని...ప్రొద్దు గూక ముందే బండీ చేసుకుని రాంబాబు కొత్తయింటికి ప్రయాణమైనాడు. గమ్య స్థానం చేరక ముందే కాస్తకాస్తవర్షం ఆరంభమైంది,

"మేఘాలు అలా కమ్ముకుంటూ ఉంటే మీరెందుకూ రావటం పెదనాన్నగారూ? కాస్త ఆలస్యమైతే తడిసి పోయేవారేకదా !" —అని అడిగింది రాగానే అచల.

అచలాదేవి కంఠస్వరంలో సంతోష చిహ్నమే లేదు. ముసలాయనకు నిరుత్సాహమైంది. చిరునవ్వు తెచ్చుకుని —"వర్షంలో తడవటానికి భయపడను. కాని బిడ్డల్ని విడిచి ఎవరుండగలరు చెప్పమ్మా !" అన్నాడు.

ఆమాట విన్న వెంటనే అచల అప్రయత్నంగా ముందుకు వచ్చి ఉన్నాదినివలె ఆయన వక్షస్థలాన వాలిపోయి వెక్కి–వెక్కి యేడుస్తూ, "అవమానంతో పాతాళానికి కుంగి పోతున్న నామీద మీకెందు కంత ప్రేమ పెదనాన్నగారూ? "అన్నది—.

ఆమె యెప్పుడూ రాంబాబుకు ఒకజటిల సమస్యలాగే ఉంది, మొగడ, రాత్రి ఆమె ప్రవర్తన వల్ల ఆయన ఆశ్చర్య చకితుడైనాడు; అప్పుడు పూర్తిగా దిగ్భ్రాంతుడైనాడు. ఆమె ఇలా ప్రవర్తిస్తుందని తాను కలలో కూడా అనుకోలేదు,

రాంబాబు ఏమీ మాటాడలేదు. ఒకచేతితో ఆమెను తన గుండెల కదిమిపెట్టుకుని మరొక చేతితో ఆమె తలనిమురుతూ నిల్చున్నాడు. సమాజం అనుమతించని వివాహము, తద్వారా ఆత్మీయులతో విరోధము, అందర్నీ విడిచిపెట్టి వచ్చి ప్రవాసంలో ఉండటం—ఈమొదలైన విషయాలన్నీ

ఆమె హృదయాన్ని కలచి వేస్తున్నా యని ఆయన భావించాడు. చాలసేపు మౌనంగానే ఉండి రాంబాబు చివరకు—"అవ మానమంటున్నా వేమిటి తల్లీ! నువు సాధ్విష్ఠవు. చాలకాలం క్రింద రెండు రోజులు మాత్రమే నా ఒడిలో ఉండి నన్నలరించి మటుమాయమై పోయిన లక్ష్మీవి, నామీది మమకారం విడిచిపెట్ట లేక ఇన్నాళ్లకు మళ్లీ నా దగ్గిరకు వచ్చావు. నువు కనిపించగానే నాకూతురివేనని గుర్తించాను ఇందులో అవ మానమేముంది తల్లీ" అని సాంత్వన వచనాలు పలుకుతూ వాత్సల్య పూర్వ కంగా ఆదరించి చేరువనే ఒకకుర్చీలో కూచోబెట్టి—"ఒకప్పుడు ఆదిశక్తి యైన సతీదేవి కూడా భర్తకోసంగాను తల్లిదండ్రులను విడిచి పెట్టేసి వెళ్లి పోయింది విచార పడకు. ఈనాడు నీకు విముఖులైన వాళ్లు రేపు నీయెడ ప్రసన్నులౌతారు, నీఅత్తింటి వాళ్లు కూడా కొడుకునూ కోడల్నీ పిలిపించు కుని ఉచితరీతిని ఆదరించి తీసుతారు. చూస్తావుగా అమ్మా! నా యీ ఆశీర్వాదం నిష్ఫలంకాదు" అంటూ ఇలాగ రాంబాబు ఆ ఆవేశంలో ఏమేమి వాగొన్నాడో చెప్పలేము.

ఆయన మాటలకు అచల మరీ కుంగిపోసాగింది. వర్షం జోరైంది. సురేశ్‌బాబు వర్షంలో బాగాతడిసి అప్పుడే ఇల్లు చేరుకున్నాడు. అతన్ని చూడగానే అచల కన్నీళ్లు తుడిచి వేసుకున్నది; మెల్లగా లేచివచ్చి తన యథాస్థానంలో కూచున్నది. ఆమెకన్నీళ్లకు కారణం సురేశ్‌బాబుకు తెలియకూడదని ఆచలాదేవి ఉద్దేశమైనట్టు రాంబాబు గ్రహించాడు.

సురేశ్ రాంబాబును చూచి ఆశ్చర్యపోయాడు. ఏదో మాటాడాలని ప్రయత్నంచేస్తోంటే రాంబాబు గమనించి అన్నాడు—"తరువాత సావధా నంగా మాటాడుకుందాం. ఇంతలో నేనెక్కడికీ పారిపోను, వెళ్లి గుడ్డలు మార్చుకురా"

సురేశ్ నవ్వాడు. "ఏం పరవా లేదులెండి"—అంటూ అక్కడ ఒక కుర్చీ లాక్కుని కూచున్నాడు.

"పెదనాన్నగారి మాట వింటే తప్పొచ్చిందామీకు? అంతజబ్బుపడి లేచారు. స్వస్థతైనా కాలేదు. ఇంకా నన్నెంతగా బాధపెట్టాలని చూస్తున్నా రేమిటి?"— అన్నది అచల సురేశ్‌ను లక్షించి.

సురేశ్ మెల్లగా లేచి లోనికి వెళ్లాడు. రాంబాబు వీధిలోకిచూస్తూ కూచున్నాడు.

రాత్రి గడుస్తూన్న కొద్దీ వర్షపు జోరు ఎక్కువైంది. "ఈ వర్షంలో మీరు ఇంటికి వెళ్లలేరు పెదనాన్నగారూ! ఈరాత్రికి ఇక్కడే ఉండి పోండి" — అన్నది అచల.

"ఈచీకటిరాత్రి, ఈ జడివానలో, ఈకొత్తచోట మిమ్మల్ని ఒంటరిగా విడిచి వెళ్లటం నాకుఇష్టంలేదు కాని మరికేపుఉదయాని కల్లాచుట్టాలందరూ వస్తారాయెను; కావలసినంత పని ఉంది. ఇంటి దగ్గర. కాబట్టి ఈ రాత్రి ఎలాగైనా ఇంటికి వెళ్లక తప్పదు, అయినా ఈవాన ఇంకో గంట వరకూ ఉంటుందేమో! అంతదాకా ఉంటాను"

రామన్న చుట్టాలను గురించి ఆరంభమై వారి ప్రసంగము ప్రపంచ ధర్మము, సంఘము, పాపపుణ్యాలు, ఇహలోక పరలోకాలు — ఈ మొదలైన అంశాలపై ప్రసరించింది. ఇద్దరూ ఆ యా విషయాలనుగూర్చిన చర్చలో పూర్తిగా నిమగ్నులైనారు. రాత్రి ఎంత గడిచిందో కూడా వారుగమనించలేదు. బైట వ్యాపించి పోయిన అంధకారము, అప్పుడప్పుడు తళుకు మంటోన్న మెరుపులు, వారి దృష్టిని ఆకర్షించలేక పోయినవి

ఆవృద్ధ మహాయోగిలో చిరకాల సంచితములైయున్న భక్తి జ్ఞాన వైరాగ్యములను ఈసమయాన ఆయన గంభీర వాక్యరచనలో దర్శించగలిగింది అచల ఇంతలో నౌకరు వచ్చాడు "అమ్మగారూ! చాలపొద్దు పోయింది సుమారు పన్నెండు కావచ్చింది, భోజనం చెయ్యరూ మరి?"

అచల చకితురాలైంది. "అప్పుడే పన్నెండయిందా? బాబుగారు—"

"బాబుగారు అప్పుడే భోజనం చేసి, పడుకొని నిద్రపోతున్నారు"

సురేశ్ అప్పుడనగా లోనికివెళ్లి రానేలేదన్న సంగతి అచలకప్పుడు స్మరణకు వచ్చింది. రాంబాబు లజ్జాన్వితుడైనాడు, "అరె, నాదే పొరపాటై పోయింది మీ ఆయన సరిగా భోజనం చేశాడో లేదో... నువ్వువెళ్లి చూడకుండా నిన్నిక్కడమాటలతో అరికట్టేశాను. వెళ్లమ్మా! వెళ్లి భోజనం" అన్నాడు.

అచల ఆయన మాటలకు జవాబుచెప్పలేదు. నౌకరు కేసిచూస్తూ అడిగింది —"బండివాడు బండీసిద్ధంచేసి సమయానికి తీసుకు వచ్చాడు కాదేం?"

"గుర్రాలు కొత్తవి ఈచీకటిలో, వర్షంలో సరిగా వెడతాయో లేదో నని అనుమానించాడు"

"అయితే మరి అద్దెబండి అయినా ఎందుకు తీసుకురాలేదు?"

నౌకరు మాటాడలేదు. అంటే తనతప్పు ఒప్పుకున్నట్టుకాదు—దాని అర్థం. "మీరు మాకట్టి హుకుం ఇవ్వలేదు"—అని చెప్పటమే అమానంలోని అంతరార్థం.

"ఎబ్బె, బండీ అక్కర్లేదు. నేనిప్పుడు ఇంటికి వెళ్లక పోయినా ఇబ్బంది లేదు, కాస్త తెల్లవారు ఝామునే లేచి స్టేషనుకు వెళ్లగలిగితే చాలు. నేను రాత్రిళ్లు భోజనం చేసేది లేదుకదా! కాబట్టి నువ్వు భోజనం చేసివచ్చి పడుకో. మాటలతో చాల పొద్దు పోయిందినీకు నాదే పొరపాటంతాను"—అంటూ బలవంతాన అచలను చెయిపుచ్చుకుని లాగి భోజనంచేసి రమ్మని క్రిందికి పంపించాడు.

భోజనానంతరం అచల తిరిగి వచ్చింది. "ఇక ఒక్క నిమిషం కూడా ఆలస్యం చెయ్యకు అమ్మా! వెళ్లి పడుకో. నేనిక్కడ సోఫాలో హాయిగా నిద్రపోతాను. ఏంపరవాలేదు"—అన్నాడు రాంబాబు.

ముసలాయన అంత పట్టుదలగా చెబుతున్నాడు. పైగా తన మనస్సు కూడా ఉత్తేజితమైఉంది. ఆయన తన శ్రేయోభిలాషి. తండ్రివలె ఆదరిస్తూ ఉన్నాడు తన్ను. అచలాదేవికి ఏదో వాగురలో చిక్కుకున్నట్టుగా ఉంది. ఒక అజ్ఞాతశక్తి తన్ను సురేశ్ బాబు శయనమందిరం కేసి ఆకర్షిస్తున్నట్టుంది. నేడు వలెనే బాగా చీకట్లు క్రమ్ముకుపోయి, జోరుగా వర్షం కురుస్తూన్న ఒకనాటిరాత్రి తాను భర్తనించి వేరుకావలసి వచ్చింది. మళ్లి అలాంటిదే ఈరేయి కూడా ఇప్పుడు మళ్లీ దురతిక్రమ్యమైన విధి తన్ను ఏకటికి చీకటిలోనికి త్రోసి వెయ్యాలని చూస్తున్నది. తెల్లవారితే తాను దుస్సహ—అవమానపంకంలో కంఠదఘ్నంగా ఉగబడిపోతుంది. తప్పదు అయినా ఆఖరాన ఆమెను అభిమానమూ, మోహమూ ముంచుకున్నవి ఒకసారి వెనుదిరిగి చూచింది. మారుమాట చెప్పకుండా సురేశ్ బాబు శయన మందిరంలోనికి వెళ్లిపోయింది.

బైట ప్రకృతి మదోన్మత్తయై ఉన్నది! గాఢాంధకారంలో మెరుపు తీగలు వికటహాసం చేస్తున్నవి.

* * * *

కొత్తచోటు కావటం చేత రాంబాబుకు సరిగా నిద్రపట్టలేదు. కొంత సేపటికి పక్కమీదినించి లేచి చూచాడు. వర్షం జోరుగా కురుస్తూనేఉంది నౌకర్లు లేవారేమో చూదామని ఆయన వరండాలో అటువైపుకు నడిచి వెళ్లాడు. అక్కడ టేబిల్ మీద తలవాల్చి ఎవరో పడుకుని ఉన్నారు. అది

చూచి రాంబాబు చకితుడైనాడు. దగ్గరకు వెళ్లి చూస్తే ఆమె ఎవరోకాదు అచల. "అమ్మాయి! ఇక్కడ ఉన్నావేం? ఇంత తొందరగా నిద్ర లేచావెందుకూ?"__అని అడిగాడు ఆశ్చర్యాన్వితుడై.

అచల ఒకసారి తలయెత్తి చూచింది. మళ్లీ టేబిల్ మీద తల వాల్చేసుకుంది. ఆమె ముఖం పాలిపోయింది. కనురెప్పల కింద కప్పువేసింది నల్లరాతి మీదుగా ప్రవహించే సెలయేరువలె ఆమె కన్నుల్లోంచి అశ్రువాహినులు సాగివస్తున్నవి.

రాంబాబు నోటినించి ఆశ్చర్యార్థ సూచకమైన ఒక స్ఫుటశబ్దం బయట పడ్డది. సగం చచ్చినట్లు పడివున్న ఆయువతికేసి అలాగే చూస్తూ నిల్చుండి పోయాడు. ఒక్కమాట కూడా ఆయన నోటినించి వెలువడలేదు.

# 38

ఉదయాన్నే దంత ధావనచేసి, టీ సేవించి, కేదారబాబు తృప్తిసూచకమైన నిట్టూర్పు విడిచాడు. ఖాళీగ్లాసులు తీసుకు పోదామని మృణాళిని వచ్చింది.

"అమ్మాయీ! నువ్వు చేసి పెడుతూన్న పూరీలు, తేనీరు అమృతంలా ఉంటున్నాయి. వచ్చి నెలరోజులైంది. మళ్లీ వెళ్లిపోదామంటే మనస్కరించటం లేదు"__అన్నాడు కేదారబాబు మృణాళినితో.

"దబ్బున ఇక్కడినించి పారిపోవాలని చూస్తున్నారా యేమిటీ పెదనాన్నగారూ!" అన్నది మృణాళిని నవ్వుతూ. ఆయన్ను "పెదనాన్న నాన్నగారూ" అని పిలవటం ఆరంభించింది కొన్నాళ్లనించి.

"ఎందుకు పారిపోతానమ్మా! నీవిచ్చే తేనీరు, నీవు వండి పెడుతున్న అన్నం, నీయీ పూరీలు విడిచి స్వర్గానికి వెళ్లటానికైనా నేనంగీకరించను. భగవంతుడు అనుగ్రహించిన నాజీవితశేషాన్ని ఇక్కడే... ఈ అడవిలోనే... కలకత్తా పట్నాన్ని పూర్తిగా విస్మరించి... గడుపుదామని నా కోరిక"

తన చిరకాల నివాసమైన కలకత్తా పట్నాన్ని విడిచి పెట్టాడు. సమాజాన్ని త్యజించాడు. అవన్తాటూళ్లో ఒకపూరియింట్లో జీవిత శేషాన్ని గడుపు

కుందామని అభిలషిస్తున్నాడు. అట్టి కేదారబాబు హృదయంలోని ఆవేదన ఎట్టిదో మృణాళిని గ్రహించింది. ఏమీ బదులు చెప్పకుండా ఖాళీ గ్లాసులు తీసుకుని లోనికి వెళ్లింది.

కేదారబాబు ఇక్కడికి వచ్చి నెలరోజులైంది. తిరిగి వెళ్లిపోవటానికి ఇష్టంలేకుండా ఉంది. మహిమ్‌కు జబ్బుచేసినప్పుడు అయన మృణాళినిని ప్రథమంగా చూచాడు. ఆమెతో ఆనాటిపరిచయం అంత గాఢమైనదికాదు; కాని ఇప్పుడు ఈనెలరోజులతో అతని తను-మనస్సులు ఆమెకేసి సంపూర్ణంగా ఆకర్షితములై పోయినవి. కలకత్తాలో తనకు ఎన్నో అవసరమైన పనులున్నా వెళ్లాలనిపించటంలేదు.

కేదారబాబు మహిమ్‌ను కలుసుకోలేక పోయాడు. అయన వస్తాడన్న వార్త తెలియగానే మహిమ్ ఊరు విడిచి వెళ్లిపోయాడు. అతన్ని వెళ్లకుండా ఆపేందుకు మృణాళిని ప్రయత్నించలేదు. మహిమ్ ఆత్మసంయమనశక్తి కలవాడు, సహన శీలి, వివేకి, బుద్ధిమంతుడు. మృణాళిని ఉత్తరం చూచుకుని కేదారబాబు కూతుర్ని తీసుకొని వస్తున్నాడని మహిమ్ ఉద్దేశపడ్డాడు. అలావచ్చిన అచలనుచూడ్డం అతనికి ఇష్టంలేదు కాబోలు, అందుకే ఊరు విడిచి వెళ్లిపోతున్నాడని మృణాళిని ఊహించుకుంది.

అచలా సురేశ్ బాబుల నిజసమాచారం ఏమిటో ఇంతవరకు తెలియ రాలేదు. ఆకాశం విరిగి ఎప్పుడు మీదపడుతుందో అన్నంత భయంగా కేదారబాబు రోజులు గడుపుతున్నాడు.

సురేశ్ బాబు సంగతి అతని బామ్మకు కూడా తెలియదు. ఆమెఎంతో వ్యాకుల పడుతూ మృణాళినికి ఉత్తరం రాసింది. కేదారబాబు కూడా ఆ ఉత్తరం చదివాడు. మహిమ్‌బాబు కూడా ఒక జమీందారు గారింట్లో ట్యూషన్ మాస్టరుగా ఉంటున్నానని ఉత్తరం రాశాడు. అనేకసార్లు ఈ ఉత్తరాన్నికూడా కేదారబాబు చదువుకున్నాడు. ఏమైనా తన కూతుర్ని గురించిన వార్త యేమీ తెలియరావటంలేదు. కాని ఒకభయంకరమైన అనుమానం మాత్రం హృదయంలో శూలంలా పొడుస్తూనే ఉంది.

అచల అయనకు ఒక్కతేకూతురు. తల్లి చనిపోయిన నాటినించీతానే ఎంతో గారాబంగా పెంచుకున్నాడు. ఆమె భావి సౌఖ్యం కోరి తన ఆరోగ్యాన్ని కూడా నిర్లక్ష్యం చేశాడు. బంగారు చాయగల తన శరీరం నల్లబడి పోయింది ఈనాడు.

గ్రామంలో ఇరుగు పొరుగు పెద్దలు అప్పుడప్పుడు వచ్చి కేదార బాబుతో మాట్లాడిపోతూ ఉంటారు. ఆయన మాత్రం తానై ఎవరింటికీ పోడు. మృణాళిని ఎప్పుడైనా ఆ ప్రసంగం తెస్తే—"నావంటి మ్లేచ్ఛుడు ఎవరింటికీ వెళ్లకండా ఉండటమే మంచిది"—అంటూ ఉంటాడు.

"మరి వాళ్లే ఎందుకు వస్తున్నారు?"—అని అడుగుతుంది మృణాళిని,

ఆమాటకు జవాబేమీ చెప్పకండా ఆయన ఉత్తరీయం వేసుకుని పొలాల కేసి షికారు వెళతాడు. అక్కడ రైతులతో చీకటిపడే వరకూ ఆసంగతులు ఈసంగతులూ మాట్లాడి ఇంటికి వస్తాడు. రోజూ సాయంత్రమప్పుడు ఆయన కార్యక్రమం అదీ.

చిన్నప్పటి నుంచి కేదారబాబు కలకత్తాలోనే కాపుర మున్నాడు. దేశంలోని అసంఖ్యాకములైన పల్లెలతో ఆయనకే సంబంధమూ లేదు. బ్రహ్మ సమాజంలో చేరిన తరువాత బంధువులూ దూరమైనారు. ఏనాడూ బస్తీ ముఖం ఎరగని పల్లెప్రజలంటే పశువులని భావించేవాడు కేదారబాబు. వాళ్ల ఆచార వ్యవహారాలంటే ఏవగించుకునే వాడు. కాని విధివైపరీత్యం వల్ల ఆయన కలకత్తాను, తనసమాజాన్ని విడిచి రావలసి వచ్చింది. ఇక్కడనానాటికీ పల్లె ప్రజలతో సంబంధం పెరిగింది. రానురాను వాళ్లమీద ఆయనకు ప్రేమప్రవృద్ధమైంది. దానితోపాటు స్వీయ సమాజంమీద, ఆసామాజికుల సంస్కృతి సభ్యతలపైని, వాళ్ల ధర్మంపట్ల అసహ్యం కలిగింది.

ఎక్కువవిద్యా వ్యాసంగం లేకపోయినా ఈపల్లె ప్రజలు ఎంతో మర్యాదస్తులు. భారతీయప్రాచీన సభ్యత వారినిత్య జీవితంలో ప్రతిఫలిస్తున్నది. నీతినియమబద్ధులే అందరూను. అన్యమతాల పట్ల వీరికి ద్వేషంలేదు. అన్నిమతాలసారమూ ఒక్కటేనని వారి నమ్మిక. ముక్కోటి దేవతలను ఆరాధిస్తూ కూడా 'దేవుడొక్కడే' నన్న సిద్ధాంతాన్ని వారు అంగీకరిస్తారు. హిందువుల ఈశ్వరుడు, ముసల్మానుల అల్లా ఇద్దరూ ఒకటేనన్న సత్యాన్ని వారున్నూ విశ్వసిస్తున్నారు.

"ఈ పల్లెప్రజలు నాగరికుల మని విర్రవీగే వారికన్న ఎందులో తక్కువ? వారికంటే మనకు ఎక్కువగా తెలిసిందేమిటి? వీళ్లందరినీ విడిచి పెట్టి మనం ఎక్కడికో దూరం వెళ్లిపోయాము దేనికి? చిట్టచివరకు మనం వీరిముందు మ్లేచ్ఛులమై పోయినా మెందువల్ల?"—అని మాటిమాటికీ అనుకుంటూ ఉంటాడు కేదారబాబు.

ఇలా ఆలోచించుకుంటూ ఒకనాడు ఆయనఇంటికి వచ్చేసరికి పదిగం టలు దాటింది

"నిన్న మీకు ఒంట్లో బాగులేదన్నారు. ఇవాళ చెరువుకు స్నానానికి వెళ్లకండి. వేడినీళ్లకాస్తున్నాను"—అన్నది మృణాళిని వచ్చి.

ఎదురు చెప్ప లేకపోయాడు కేదారబాబు అప్పటికి మటుకు. మృణాళిని స్నానం చేసి దైవపూజకు కూచుంది. వెంట్రుకలు విరబారి ఉన్నవి. పట్టువస్త్రం కట్టుకుంది. ముఖం మిక్కిలి ప్రసన్నంగా ఉంది. శుచి, శుభ్రత ఆమెలో మూర్తీభవించినవి.

"నా స్నానానికి నీవు ప్రత్యేకంగా ఏమీ ఏర్పాటు చెయ్యనక్కర్లేదు తల్లీ. కలకత్తాలో ఉన్నన్ని నాళ్లూ పంపుల్లో నిలువ ఉంచిన నీళ్లు కాదూ స్నానం చేసేవాణ్ణి! చన్నీళ్లు బాగా అలవాటే, చెరువుకే వెళ్లి స్నానం చేసివస్తాను. అంతమాత్రాన నాకు జబ్బేమీ చెయ్యదు"—అన్నాడు కేదారబాబు మెల్లగావచ్చి.

"వద్దు, పెదనాన్నగారూ! మీకు ఒంట్లో బాగున్నట్టులేదు. నేను వెళ్లి నీళ్లు తెస్తాను. ఇంతలో మీరు నూనె రాసుకుంటూ ఉండండి"— అంటూ ఆమె బిందెపుచ్చుకుని వెళ్లబోతూంటే కేదారబాబు "సరే కానీ;- మరియేమి చేస్తాను? కాని నిజం చెప్పు మృణాళినీ! పరాయివాళ్లకు కూడా ఇలా సేవచేసే బుద్ధి నీకెవరు నేర్పారు? ఇంత సేవా నిరతి నేను ఎక్కడా చూడలేదు సుమీ!"అన్నాడు—

"మీరు నాకు పరాయివారా పెదనాన్నగారూ?"

"కాదు, కాదు; నేను నీ ఒడిలో పసివాడిని. కాని నువు నాప్రశ్నకు జవాబు చెప్పాలి తప్పదు"

"ఇది పట్టుపట్టి నేర్చుకోవలసిన పాఠంకాదు. పుట్టుకతో వచ్చేవిద్య అది. ఉండండి, మీ స్నానానికి కాచిన నీళ్లు చల్లారిపోతాయేమో మళ్లీ"

చల్లారి పోతే పరవాలేదు మనుష్యుడు నేర్చుకుంటేనేగాని ఈదలేడు. జలచరాలకు ఈదటం పుట్టుకతోనే వచ్చేవిద్య. అలాగే నీకు ఈసేవా నిరతిని ఆజన్మతః ప్రసాదించిన నీసమాజాన్ని గురించి నేను తీవ్రంగా ఆలోచిస్తున్నాను—"

"నీళ్లు బాగా చల్లారి–"

"పరవాలేదు లేఅమ్మా! చెరువులో కావలసినన్ని నీళ్లు ఉన్నాయి. నేను చెప్పే దేమంటే—పసిపుత్రవాడు తనతల్లి దగ్గిర అనేకవిషయాలు అభ్య

పిస్తాడు. నేనుకూడా నీదగ్గిర చాలసంగతులు నేర్చుకున్నాను. నాతల్లివి నువ్వు అలా దేవపూజ చేస్తూన్నప్పుడు చూస్తూంటే... నాకుకూడా జందెం వేసుకుని పూజాపాత్ర పెట్టుకుని దైవారాధన చేదామనిపిస్తున్నది.

"అర్థమిటి పెదనాన్నగారు. స్వధర్మాన్నీ, స్వసమాజాన్నీ విడిచిపెట్టి ఇతర్ల ఆచారాలను అనుసరించటం దేనికి_? మీరుప్పాటించే మతంలోమాత్రం ఏమిదోషం ఉందనీ ?"

"దోషంఉండటం లేకపోవటం అది వేరేవిషయం. మంచిది కానీ చెడ్డది కానీ_ ఈవయసులో ఆమతాన్ని విడిచిపెట్టగల శక్తి నాలో లేదు ఈజీవితం ఇక ఆదారిన గడచి పోవలసిందే; కాని ఇంతచిన్నతనంలో నే నీ వైరాగ్యం, నిష్ఠ_ అంతా చూస్తూంటే...నువ్వు నాతల్లివిలా కనిపిస్తున్నావు. నాసమాజంమీదే నాకు అసహ్యం పుట్టుకొస్తున్నది"

తన వ్యక్తిగత జీవితంలో దురదృష్టవశాత్తుఏదో, ఆపత్తు దాపురించినంత మాత్రాన కేదారబాబు సమాజాన్ని యావత్తూ నిందించడం మృణాళినికి అన్యాయంలా తోచింది. _"ఇప్పుడు మీరుకనపరచిన దృక్పథంలోచూచేట్టయితే మాసంఘంలో కూడా దోషాలు, లోపాలు చాల కనిపిస్తాయి, మేము కూడా మా దోషాల్ని సంఘంపై మోపటానికిచూస్తూ ఉంటాం మని మీకు గోచరిస్తుంది. మేముకూడా__"అన్నది

"నేను తొందరపడి మాటాడటంలేదు తల్లీ! మీమతంలో లోపాలు దోషాలు ఉంటే ఉండవచ్చు. కాని ఆమతంలో నువ్వు ఉన్నావు. నీవంటి వస్తువు మా సమాజంలో కన్నులు చించుకున్నా కనిపించదు"

మృణాళిని సిగ్గు పడిపోయింది. "మీరు ఇలా నన్ను అస్తమానం పొగుడుతూ. ఉంటే నేను ఎక్కడికేనా పారిపోతాను. మళ్లీ. మీకు కనిపించను"

కేదారబాబు కానేపాగి__"నిన్ను అలా పారిపోనిస్తానా అమ్మాయి నువ్వు నా కళ్లకు వెలుపు, నువ్వు నా తల్లివి. నిరాశ్రయుడైన ఈ అకర్మణ్యునికి నువ్వు ఆశ్రయం యిచ్చావు" అన్నాడు ఆయన కన్నులు అశ్రుపూర్ణములైనవి, కన్నీళ్లు తుడుచుకుంటూ__ "మహిమ్నను కలనులో లేకపోయాను ఎందుకు అతడుపారిపోయాడో నాకర్థంకావటలేదు. ప్రాణాలతో ఉన్నాడో లేదోమరి!"_ అన్నాడు కేదారబాబు.

"అలా భయపడతారేం పెదనాన్నగారూ !"

"బిడ్డల చావునుమించిన భయకారణం తండ్రికి వేరే యేముంటుంది తల్లీ !"

# 39

ఏకైక పుత్రికా విరహమేకాదు, దాన్నికూడా మించిన దుర్గతి దాపురించి విచారసాగరంలో ఉక్కిరిబిక్కిరౌతున్నాడు పాపం కేదారబాబు. మృణాళిని ఆసంగతి గ్రహించుకుని మౌనంగానే ఉంది చాలసేపటి వరకూ. కేదారబాబు గడ్డం తడుముకుంటూ మౌనంగా నిల్చుని, చివరకు ఒక దీర్ఘ నిశ్వాసం విడిచాడు. తిన్నగా అలమారు వద్దకు నడిచి నూనెసీసా అందుకున్నాడు.

నాటి ఉదయనించీ ఆకాశం నిర్మలంగానే ఉంది. మధ్యాహ్నం రెండు గంటలయింది. కేదారబాబు మంచంమీద కూచుని పడమటి వేపు కిటికీగుండా బైటికి చూస్తున్నాడు. జామచెట్టు బాగా పూచి ఉంది పిట్టలేవో కిలకిల్లాడుతూ చెట్టుచుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నవి. మృణాళిని ఎంతో ప్రేమగా పెంచుతూన్న ఆవుపెయ్య ఒకమూల గడ్డిమేస్తున్నది. ఆపైని గ్రామస్థుల కాలిబాట కూడా కనిపిస్తున్నది కిటికీలోనించి.

"తేనీరు పట్టుకురానా పెదనాన్నగారూ"

"అప్పుడే త్రాగమంటావా అమ్మా!"

"టైము కాలేదనుకుంటున్నారా ఇంకా?"

కేదారబాబు దిండుక్రింది నించి గడియారంతీసిచూచాడు. "ఇంకా మూడుగంటలు కూడా కాలేదు"

"కాకపోతే యేమిలెండి. ఉదయంకూడా మీరు సరిగా భోజనం చెయ్యలేదు—"

ఇక ఆమెముందు అడ్డుపాకులు లాభంలేదనితోచి—"సరే, పట్టుకురా పోనీ" అన్నాడు కేదారబాబు.

మృణాళిని కాసేపు అక్కడే నిల్చుని—"పెదనాన్నగారూ! మీకు వేడివేడిగా రొట్టెలంటేయిష్టమని చెప్పారుకాదూ?"

"ఔను. ఇందులో అబద్ధం ఎక్కువ లేదు"

"కాసిని గారెలుకూడా పట్టుకురానా?"

"ఊఁ, తీసుకురా"---అంటూ కేదారబాబు బలవంతాన నవ్వాడు.

మృణాళిని లోనికి వెళ్లింది కేదారబాబు కిటికీలోనించి బైటికి చూస్తున్నాడు. ఎందుకో అంతా మసకగా కనిపించింది. మరుక్షణమే వేడిఅశ్రువులురాలి ఒడిలో టపటప పడినవి. తొందరగా ఉత్తరీయంతో కన్నులు తుడుచుకున్నాడు. ఎమర్సన్ గ్రంథం ఒకటి ముందు పెట్టుకుని మామూలువలె కనిపించటానికి ఎంతో ప్రయత్నం చేశాడు.

మరికాసేపటికి తేనీరు, గారెలు తీసుకుని మృణాళిని వచ్చింది. అవి అందుకుంటూ కేదారబాబు అన్నాడు---"నాకు ఇవాళ సరిగా కడుపు నిండలేదన్న సంగతి ఇప్పుడు తెలుసుకున్నాను. కాని అమ్మా!---"

"మీరు మాటల్లోకి దిగారంటే, అన్నీ చప్పగా చల్లారిపోతాయి"

కేదారబాబు మారుమాట చెప్పకుండా తేనీటిగ్లాసు అందుకుని పూర్తిగా తాగి, కింద పెట్టేశాడు

"అమ్మాయి! మృణాళినీ! ముందు జన్మలో నువ్వు నాకు కూతురివై పుట్టాలి. ఆప్యాయంగా గుండెలపై పెట్టుకుని, పిల్లల్ని ఎలా పెంచుతారో ఆ విద్య నాకు బాగానే తెలుసు"—ఇలా పలుకుతూ ఉన్న కేదారబాబు కంఠం కంపించింది.

ఆయన హృదయావేదన గమనించి మృణాళిని నవ్వి "సరే, కానీ యండి మీకు పుట్టే బిడ్డలలో నేనూ ఒకతెనై అవతరిస్తాలెండి"—అన్నది.

"అనేకమంది బిడ్డలు నాకు వద్దు, తల్లీ! వద్దు. నువ్వు ఒక్కతెవే నాకు కూతురువై పుట్టాలి. నాగుండెలోని వాత్సల్యమంతా నీ ఒక్కదానికే చెందాలి. ఇప్పుడు నీవద్ద నేను నేర్చుకుంటూన్న విషయాలన్నీ ముందు జన్మలో కూతురకు బోధించుకుంటాను. ముసలివాడనై పోయి మళ్లీ ఆకూతురుదగ్గిరే శుశ్రూష చేసి మరొక జన్మ ఎత్తటానికి సిద్ధమై ఉంటాను"—అంటూ కేదారబాబు కన్నులొత్తుకున్నాడు.

"మీరు నన్ను ఊరికే పొగడుతున్నారు, పెదనాన్నగారూ! నిజానికి నాకేమి తెలుసునని?"

"చూడరాదూ! నే నివాళ సరిగా భోజనం చేయలేదన్న సంగతి నేను తెలుసుకోగలిగానా? నువ్వు తెలుసుకున్నావు మరి!"

"అది కూడా పెద్ద తెలివి తేటలే నంటారా? కన్నులున్న ప్రతివాళ్ళ కూ తెలుస్తుంది ఆసంగతి"

"కాని అలాంటి కళ్లు అందరికీ ఉంటాయామరి! భగవంతుడు మనల్ని నిజంగా ఆత్మీయులనబడేవారితో ఎక్కడ, ఎప్పుడు ; ఎలా కలుపుతాడో చెప్పలేము. అట్టి స్వజనుల సమక్షంలో జీవనసాఫల్యాన్ని అనుభవించి గడిచి పోయిన బ్రతుకంతా వ్యర్థమేనని భావిస్తాను"

"అంటే నేను మీ కూతుర్ని, ఇన్నాళ్లనించీ ఇక్కడ ఈ అడవిలో ఉంటున్నానని మీకు కబురు తెలియనే లేదన్నమాట !"

"ఎలా తెలుస్తుందీ? భగవంతుని ఆజ్ఞ కావద్దూ! ఆయన ఆజ్ఞ కావటంతోనే పరుగెత్తుకు వచ్చాను కాదూ! మనం ఈనెలరోజులనించే పరస్పరం ఎరిగి వున్నామని గ్రామస్థు లనుకుంటూఉంటారు. కాని ఎన్ని యుగాల నించో నేను నీ నీడలో విశ్రమిస్తూ వస్తున్నాను."

మరి కానేపటివరకూ ఎవరూ మాటాడలేదు మృణాళిని నేలవైపు చూస్తూ నిల్చుంది. చివరకు కేదారబాబు అన్నాడు — "నేను ఒకమతాన్ని స్వీకరించాను కాని ఇంతకాలానికి నేను తెలుసుకో గలిగిన విషయం ఏమి టంటే — పోట్లాట కొట్లాటలవల్లా, వాద ప్రతివాదాల వల్లా ధర్మం అవగత మయే వస్తువు కాదు"

"ఔను అలాగే తోస్తుంది. 'ధర్మం' అనేది ఒకవిశిష్టమైన వస్తువు' అది అనుభూతం కావటానికి వాదప్రతివాదాలు అనవసరమనే నా ఉద్దేశం."

"కాని ఒక్కొక్కప్పుడు తప్పనిసరిగా చేయవలసిన అవసరం వస్తుంది. మనం ఏమి త్యాగంచేసినా ప్రేమపూర్వకంగా చెయ్యాము. ద్వేషమే ప్రధానంగా మమ్మల్ని వెన్నాడుతూఉంటుంది మీరుమాత్రం జన్మతః సంక్రమించిన మీ ధర్మాన్ని అనుసరిస్తూ కాలం గడుపుకుంటూవుంటారు. చూడమ్మా మీకూ, మాకూ గల ఈ అంతరం"

ఆ మాటలకు ఏమి జవాబు చెప్పాలో తోచక మృణాళిని మౌనంగా ఉన్నది. కేదారబాబు మళ్లీ ఇలా అన్నాడు — "ఎన్నాళ్లనాటి సంగతులో నాకిప్పుడు జ్ఞాపకం వస్తున్నాయి తల్లీ ! ఇన్నాళ్లనించీ ఇవి ఎక్కడ దాగి వున్నాయో మరి!"

"ఎవర్ని గురించి పెదనాన్నగారూ ?"

"నా సంగతులే అమ్మాయీ! నేను గొప్ప బుద్ధిశాలినేమీ కాదు. భగవంతుడు నాకు అసాధారణ ప్రజ్ఞలను ప్రసాదించలేదు నేనొక మామూలు వ్యక్తులలోనే సంచరిస్తూ జీవితము గడుపుతూ వచ్చాను. మాసమాజపు పెద్దల యెడ భక్తిశ్రద్ధలు గలిగి, వారి ఉపదేశాలను మన్నించాను కాని ఈ నాడు తెలుస్తున్నది వారి మాటల్లో ఎన్నిపొరపాట్లు ఉన్నాయో. ధర్మాన్వేషణ సందర్భంలో వాదప్రతివాదాలు నిష్ప్రయోజనమని నువు అన్నావుకదూ! నేనూ అలాగే అనుకునేవాణ్ణి. కాని వాటి అవసరముకూడా ఉన్నదని నాకు ఇవాళ తోస్తున్నది. మాసమాజంవారు దేశవిదేశాల్లో హిందువులకుతలవంపులు కలిగిస్తున్నారనీ, అంతటి ద్రోహం క్రిస్టియన్ ఫాదరీలుకూడా చేయటంలే దనీ—కొందరంటున్నారు. ఆమాట అబద్ధమని నేను ఇప్పుడనలేను నిజానికి మావంటివారంతా పాశ్చాత్యుల చేతుల్లోని విభీషణులమే."

మృణాళిని విస్తుపోయి వింటూ నిల్చుంది.

"మృణాళినీ! మా సామాజికులలో ద్వేషభావం లేకపోలేదు. ఎలుగెత్తి పిలుస్తారు; 'ఓ ప్రజలారా! మీరు నరకంలోపడి చావకండా ఉండాలంటే మా సమాజంలో వచ్చి చేరండి' అంటూ, భక్త్యావేశంలో వారి రక్తం ఎంతగా వేడెక్కుతుందో, శ్రద్ధాభావంలో వారంతగా కృద్ధులైపోతూ ఉన్నారు. నువ్వేమన్నా చెప్పు వారు ఉపదేశకులైతే కావచ్చు, ధర్మపరులు మాత్రం కాదు. ఔను. ధర్మం వారిలో లేశమాత్రమైనా లేదు"

"ఈ విషయాలన్నీ నాకెందుకు చెబుతారు పెదనాన్నగారూ!! వారంతా నాకు వందనీయులే" అంటూ మృణాళిని వ్యథితకంఠస్వరాన పలికి, చేతులు రెండూ జోడించింది.

నమ్రభావంతో, నతమస్తకయై నిలిచిన ఆమెను చూస్తూ కేదార బాబు నిశ్చేష్టుడైనాడు. ఇంతలో దాసీది ఎందుకో పిల్చింది. మృణాళిని అచ్చోటు వీడి వెళ్లిపోయింది కేదారబాబు అలాగే నిశ్చేష్టుడై వున్నాడు.

మరి కాసేపటికి మృణాళిని తిరిగి వచ్చింది కేదారబాబు ఆవేగపూర్ణుడై "మృణాళినీ! నా జీవితమంతా ఇలా ఇతర్ల తప్పులను వెదకుతూ గడిచిపోవలసిందేనా? నాకేమైనా మోక్షంఉందంటావా?" అనిఅడిగాడు.

"మీ లాల్చీ ఆచివర రవంత చినిగి పోయింది కుట్టి పెడతాను ఉండండి"—అంటూ మృణాళిని సూదీ, దారం తీసుకు వచ్చింది. నిరంతర కర్మనిరతయైన ఆబాలిక నతమస్తకాన్ని తదేకంగా చూస్తూ మౌనంగా కూచు

న్నాడు కేదారబాబు. మాటిమాటికీ అకారణంగాకన్నులు చెమ్మగిలుతూంటే ధోవతి చెంగుతో తుడుచుకుంటున్నాడు.

కుట్టటం అయిపోయింది. సూదీ, దారం యథాస్థానంలో పెట్టివచ్చింది మృణాళిని. వచ్చి "రాత్రికి మరి వంట యేం చెయ్యమంటారు?" అనిఅడిగింది.

కేదారబాబు దీర్ఘంగా నిశ్వసించాడు బలవంతాన చిరునవ్వు తెచ్చుకున్నాడు. "రాత్రి భోజనం సంగతి ఇప్పటినించే ఆలోచన దేనికి? అప్పుడు చూచుకోవచ్చు...

"అలాగంటారేం పెదనాన్నగారూ! నేనెప్పుడైనా మీమీదకోప పడ్డానా చెప్పండి"

"ఛెబ్బెబ్బే, లేదమ్మా ఎన్నడూ కోప్పడలేదు. నువ్వునా తల్లివి. నేను నీముసలి కొడుకును, నా ఆగడమంతా నువ్వునవ్వుతూ సహిస్తున్నావు. ఇందాకటినించీ నేను కావించిన ప్రేలాపనలో ఇతర్లను నిందించాలన్న దుర్బుద్ధి నాకు లేదు. ఈనాజీవితంలో ఈనాటికి నేను గ్రహించ గలిగిన సత్యాన్ని నీకు చెప్పుకుందా మనుకున్నాను. ధర్మం అనే వస్తువును అమాంతంగా గుప్పెటలో పట్టేసుకుందామని మానవులు ఆతృత పడతారు. కాని అది అంత తేలికగా లభ్యమయే వస్తువు కాదు. జీవితపు అంత్య దశలో దుఃఖాలన్నీ మూగి వచ్చినప్పుడు వేదనా పూర్ణమైన హృదయం మీద అధర్మదేవత ఒంటరిగా వచ్చి నిలుస్తుంది. అంతే"

మృణాళినికి ఈ రకమైన ప్రసంగం ఎప్పుడూ ఇష్టంలేదు మారుపలక్కుండా గప్‌చిప్‌గా వింటూ కూచుంది.

"అమ్మాయీ! ఈ విశాల ప్రపంచంలో ఇవాళ నాకు నువ్వు దక్క నా అన్నవాళ్లెవరూ మరి లేరు. ఔను తల్లీ ఒక్కరైనా లేరు. ఈమాట ఎన్నిసార్లు చెప్పుకున్నా నాకు తృప్తిఅనిపించటంలేదు. నా పాలనా, పోషణా సమస్తభారమూ నీపై వచ్చిపడింది. ఎలా పడిందో అర్థం కాకుండా ఉంది. అంతా ఆ భగవంతుని లీల. ఆదిలో నీ సముఖాన ఏమి మాటాడ్డానికీ రవంతసంకోచించేవాణ్ణి. కాని ఇప్పుడు ఆ జంకు గొంకులేమీ లేవు"

మృణాళిని తలయెత్తి రవంత మందహాసం చేసింది.

"కాని ఒక్క సంగతిమాత్రం నా గొంతు పెగిలి రావటంలేదు తల్లీ!"

"పోనీయండి పెదనాన్నగారూ! ప్రమాదంలేదు."

"కడుపులో ఉన్న మాట ఇకనీకు చెప్పకుండా దాచుకోలేను తల్లీ! నా అనుమానం ఏమంటే__ అఖరుకు మన అచల సురేశ్ బాబుతో__"

అదే అనుమానంతో మృణాళినికూడా చాలరోజులనించీ బాధపడుతూవుంది. అందుచేత కేదారబాబు మాట కామె ఏమీ ప్రత్యుత్తరం చెప్పలేదు కానేపు నిశ్శబ్దం. చివరకు ముసలాయన బలవంతాన గొంతు సరిచేసుకుని_"ఒక్కసారి మహిమ్‌బాబును కలుసుకుని అతడేమి చెబుతాడో వినాలని నాకు రాత్రింబవళ్లు ఆతృతగా ఉంది. కాని ఒంటరిగా వెళ్లి అతనికి నా ముఖం చూపించేందుకు ధైర్యంచాలటంలేదు" అన్నాడు

మృణాళిని తలయెత్తి లజ్జావనతుడైయున్న ఆ ముసలి పెదనాన్నకేసి చూచింది జాలిగా.

"మీరు ఒక్కరే వెళ్లటమెందుకు పెదనాన్నగారూ! వెళ్లాలంటే ఇద్దరమూ కలిసేవెళదాం"

"నిజంగా మరి నువ్వుకూడా వస్తావా అమ్మా!"

"ఎందుకు రాను? అదీగాక మిమ్మల్ని ఒక్కర్నీ ఎక్కడికీ వెళ్లనీను. ఈ స్థితిలో మీరు ఒంటరి ప్రయాణాలు చెయ్యకూడదు. నాకుకూడా కాస్త గాలి మార్చాలనిపిస్తున్నది."

మరి ఇంకా అధికంగా సాంత్వన వచనాలేమీ పలుకలేకపోయింది. గర్హ్యతమమైన కూతురి అపభ్యప్రవర్తన తలచుకుని తలచుకుని క్రుంగి కృశించిపోతూన్న ఆయన్ను ఓదార్చగల శక్తి మృణాళినిలో ఏముంది?

తరువాత చాలసేపు గడిచింది. కేదారబాబు లేచికూచుని__ 'అమ్మాయీ!' అని పిల్చాడు.

అప్పటి ఆయన ముఖం చూస్తుంటే మృణాళినికి కడుపు తరుక్కుపోయింది. "ఏమిటి పెదనాన్నగారూ!" అని అడిగింది, పొంగివచ్చే దుఃఖాన్ని బలవంతాన ఆపుకుని.

"ప్రపంచంలో ఇంత దుస్సహవేదనలుకూడా ఉంటాయని నేనెన్నడూ అనుకోనుకూడాలేదు. ఈబాధ తప్పించుకునే ఉపాయం లేదా? లేనేలేదా?"

"కాని పెదనాన్నగారూ! దుర్ఘటమైన మరణవేదనకూడా సహించజాలిన శక్తిమంతుడుకదా మానవుడు!"

"ఆ పిల్ల నాకెక వచ్చినవాళ్లలో జత. అదేకాదటమ్మా నువ్వు నాకు చెప్పదలచినమాట? నేనూ ఆనేకసార్లు అలాగే అనుకున్నాను. మనుష్య

వేదన తీవ్రమైనదే. కానిఅందులో శాంతి, మాధుర్యం ఉన్నవి. ఈ విష యంలోమాత్రం సాంత్వనము లేదుకదా! ఈగ్లాని, ఈ లజ్జ నన్ను పాతాళానికి లాక్కుపోతున్నవి. శాంతి నున్నా" — అంటూ కేదారబాబు కన్నులు మూసుకుని, ఛాతీపై చేతులు ముడుచుకుని కాసేపు మౌనంగాకూచున్నాడు. మరికొంతసేపటికి మళ్లీ ఇలా అన్నాడు—"అమ్మాయీ! సంతానం మరణించినప్పుడు అందుకు కారణభూతుడైన భగవంతుని లీలలు అగమ్యములు అని ఆయన్ను క్షమించి ఊరుకుంటాం మనం..."

మృణాళిని అర్ధోక్తిలో అందుకున్నది. "అలాగ భగవంతుడినే మనం క్షమించి విడిచిపెడుతున్నప్పుడు...పూర్తిసంగతి సందర్భాలేమిటో తెలియకండా ఒక వ్యక్తిని దుయ్యబట్టుకోవటం తప్పుకాదూ పెదనాన్నగారూ!"

కేదారబాబు ఆ మాటకు చలించాడు రాతివిగ్రహంలా ఆమెకేసి అలాగేచూస్తూ కూచున్నాడు.

మృణాళిని సిగ్గుపడుతూ మెల్లిగా మళ్లీ ఇలా అన్నది; "అదీగాక 'మానవుడు క్షమించజాలని మహాపరాధం ఏదీ ప్రపంచంలో లేదు' — అని మా బావే చెబుతూండేవాడు"

"ఏమిటీ? ఇలాంటి అపరాధంకూడా క్షమించతగినదేనంటావా? క్షమించగలరా ఎవరైనా?"—ఉత్తేజితుడై అడిగాడు కేదారబాబు మృణాళిని మాటాడలేదు.

"ఊహు. తండ్రినైయుండికూడా నేనామెను క్షమించను. ఒక్కనాటికీ క్షమించన్నా. క్షమించటం ఉచితంకాదు క్షమించతగిన మనిషికాదా పిల్ల"

"క్షమించటమంటే ఉచితానుచిత విచారణకాదు. అర్హతానర్హతల విచక్షణ కాదు. క్షమయొక్క ఫలితం అపరాధికేనా? క్షమించిన వారికేమీ దక్కదంటారా?"

ఆమాటలకు కేదారబాబు, ఆశ్చర్యాన్వితుడైనాడు ఆమెమాటలోని శాంతం, స్నిగ్ధత ఆయన్ను ఓడించాయి.

"ఇప్పుడు నువ్వు సూచించిన పంథాలో నేనెన్నడూ ఆలోచించనే లేదు. ఇంకొక కొత్తతత్వం నీవద్ద నేర్చుకుంటున్నాను. రూపాయలో పదహారు అణాలఅర్థి కేదక్క, దాతకు ఏమీమిగలకండా పోతుందా? ఊహు. పోదు. అపరాధంచిన్నదో, పెద్దదో—అరకమైన విచారణ అంతా మనకక్కర్లేదు.

కేవలం క్షమించి వెయ్యటమే మన ధర్మం. అదేకదూ తల్లీ నీ ఉపదేశం?" అన్నాడు—

"అలా నన్ను పెద్దజేసిమాటాడకండి పెదనాన్నగారూ!"

"అచలాదేవివంటిదానికి కూడా ఈప్రపంచలో స్థానం ఉందంటా వమ్మా!"

మృణాళిని హఠాత్తుగా లేచి నిల్చుంది. "అత్తగారు పిలుస్తున్నట్టుంది వెళ్లి వస్తాను" అంటూ లోనికి పోయింది.

# 40

మృణాళిని వెళ్లిపోయిన సంగతే కేదారబాబుకు తెలియదు. తనఅలో చనలో తాను నిమగ్నుడై ఉన్నాడు. తనలో తాను ఇలా గొణుక్కుంటు న్నాడు. "నాకుతీవ్రమైన దుర్గతి దాపురించింది; మృత్యువుకన్నా నాకు మరి శరణ్యం లేదనిపించింది. అట్టి పరిస్థితులలో అమ్మా, మృణాళినీ నువు నాకొక రాజమార్గం చూపించావు; మోక్షం ప్రసాదించావు. 'క్షమ' అన్న శబ్దమే నాకిదివరకు స్ఫురించలేదు. తండ్రినైయుండి నేనే క్షమించలేక పోతే మరె వరు క్షమిస్తారు?"

కేదారబాబు తలెత్తి మేఘాచ్ఛన్నమైన ఆకాశం కేసి చూచాడు. "నేను క్షమించేశాను. సురేశ్ బాబూ! నిన్ను కూడా నేను క్షమించాను. పశువులను, పక్షులను, కీటకాలను సమస్త జీవరాసులను నేనిప్పుడు క్షమించ గలను. నాకెవరి మీదా కోపంలేదు. నాకు శాంతి చేకూరింది. పరమానంద మైంది."

ఆయన కన్నులు నిమీలితములైనవి. చేతులురెండూ గుండెమీద అని నవి. పెదవులు స్పందించినవి.

"అమ్మా అచలా! ఎక్కడున్నావమ్మా! ఒక్కసారి మీనాన్న దగ్గి రకు రావూ? నేను నీతండ్రిని ఈచేతులతో పెంచాను, పెద్దచేశాను. నీసమస్త అపరాధాలనూ నేను క్షమించి వేస్తాను. ఒక్కసారి నాఒడిలో వచ్చి కూచోవూ? నీకు తగిలిన గాయాన్ని నాహృదయంతో కట్టుకట్టి [illegible] సంఘం మనల్ని వెలిపెట్టేటట్టయితే అజ్ఞాతంలోనే నువ్వూ, నా..."

"పెదనాన్నగారూ !"

కేదారబాబు అచలను చూచాడు, తన్నుతాను సంబాళించుకోటానికి వ్యర్థ ప్రయత్నం చేశాడు. దుఃఖం పొంగివచ్చింది. కూచున్నవాడు నేలకు ఒరిగిపోయి పిల్లవాడులాగ వెక్కి వెక్కి ఏడ్చాడు..."అమ్మా ! మృణాళినీ ! పాపం అచలను ప్రపంచమంతా అసహ్యించుకుని, హింసిస్తుందికదా!" అన్నాడు గద్గద స్వరాన.

మృణాళిని దగ్గిరే కూచుని ఆయన తలను ఒడిలో పెట్టుకుని దువ్వుతున్నది. ఆమె కన్నులు కూడా చెమ్మగిల్లినవి.

అది ఫాల్గుణమాసం. ఆకాశం మేఘాచ్ఛన్నమై ఉన్నది కేదారబాబు మెల్లగా లేచికూచున్నాడు. "మృణాళినీ ! మహిమ్‌బాబుకు ఉత్తరం రాస్తే జవాబు రాయడూ?"

"ఎందుకు రాయడు? రేపో, ఎల్లుండో జవాబు రావచ్చు."

"అయితే నువ్వు ఉత్తరం రాశావేమిటి?"

"రాశాను"

"ఏమి రాసిందో అడగటానికి ఆయనకు ధైర్యం చాలలేదు. "సాయంత్రం కావస్తున్నది. కాస్త అలా తిరిగి వస్తాను" అంటూ లేచి ఉత్తరీయం వేసుకుని, చేతికర్ర పుచ్చుకుని బయలుదేరాడు. పోతూపోతూ ఆగిఅన్నాడు "అయితే మరి అమ్మాయీ !..."

"ఏమిటి పెదనాన్నగారూ !"

"మనం వెడితే మహిమ్ కోపగించుకుంటాడేమో సుమా !"

అభయం మృణాళినికీ ఉంది. కానితడుముకోకుండా జవాబు చెప్పింది "ఇప్పటినించే ఆ ఫికరు మనకెందుకులెండి. తీరా మనం వెళ్లాక అతడును బయటికి గెంటిస్తే అప్పుడే చూచుకోవచ్చు"

"అయితే నువ్వూ నాతో వస్తావు కదూ?"

"నేను మీతో రావటంకాదు; మీరే నాతో బయలుదేరుదురుగాని"

కేదారబాబు ఇంకా ఏమో మాటాడదామనుకున్నాడు. కానిముఖం త్రిప్పుకుని షికారు వెళ్లిపోయాడు.

* * * *

ఆదే ఫాల్గుణ మాసంలో ఒకనాటి సాయంకాలం సురేశ్‌బాబు ఒక స్టీలు ట్రేపైన కవరు తీసుకువచ్చి అచలాదేవికి ఇచ్చాడు. "ఈకవరు చాలరోజుల

నించీ నీకు ఇవ్వాలని అనుకుంటున్నాను కాని ధైర్యం చాలిందికాదు. ఇవాళ ఇక ఇవ్వక తప్పలేదు"

"ఏమిటిదీ?"

"దానంతట అదే తెలుస్తుంది ఎప్పటికైనా. నామూలంగా ఎంతో దుఃఖం, అవమానం కిమ్మనకండా స్వీకరించు"

"ఈకవరులో ఏముందీ?"

"ఇంతవరకూ నేను నీవద్దనించి ఏమైనా పొందగలిగితే... అది బలవంతంగా జబర్దస్తీగా లాక్కున్నదే. ఇవాళ నిన్ను నేనొక్కటి వేడుకుంటున్నాను అందులో ఏముందో తెలుసుకునేందుకు నువు ప్రయత్నించవద్దు"

అచల మారు పలకలేదు. సురేశ్ మాటలామెకు అర్థం కాలేదు.

"బయట బండీవాడు తొందర చేస్తున్నాడు బాబూ! ఇంకా ఆలస్యం చేస్తే దారిలోనే చీకటిపడి అక్కడికి చేరుకునే సరికి చాలాపొద్దుపోతుందని అంటున్నాడు"—అని నౌకరు బైటనించి కేక వేశాడు.

అచల ఉలికిపాటు సూచించి "ఏమిటి? ఇప్పుడు మళ్లీ వెళుతున్నారా?"

సురేశ్ మందహాసం చేశాడు. "ఔను వెళ్లాలి. ప్లేగు నయంచేయగల డాక్టరెవడూ లేడు. గ్రామాలన్నీ స్మశానం కింద మారిపోతున్నాయి. ఈసారి ఆయిదారు రోజులదాకా తిరిగి రానేమో! అసలు మరెప్పటికీ రాలేనేమో కూడా. పరిస్థితు లెలా ఉంటాయో ఎవరికి తెలుసు?"

అచల కొయ్యబొమ్మలా సురేశ్ కేసి చూస్తూ నిల్చుంది. అక్కడికి ఏడెనిమిది మైళ్లదూరాన ఉన్న గ్రామాల్లో మహామారి వ్యాపించి, ఆ ప్రదేశమంతా వల్లకాడుగా మారిపోతూవున్నదని ఆమె విన్నది. బీదా, దిక్కూదిక్కులేక మృత్యువుకు ఆహుతిఅవుతున్నారు కుగ్రామాల్లో డాక్టర్లు ఉండరాయెను. సురేశ్ బాబు కావలసినంత డబ్బు ఇచ్చించి, మందులు తెప్పించి ఉచితంగా గ్రామస్థులకు ఎంతో సేవ చేస్తున్నాడు. ఒక్కొక్కనాడు ఇంటికి చాలా ప్రొద్దుపోయి వస్తున్నాడు. ఒక్కొక్కరోజు అసలు ఇంటికి రావటమేలేదు. ఇవ్వాళ ఇల్లువిడిచి, ఆమెనుకూడా విడిచి మళ్లీ మృత్యుగహ్వరంలోకి పోనుద్యుక్తుడౌతున్నాడు. అచల కాసేపు నిశ్శబ్దంగా నిల్చిపోయింది. మహాపాపిష్ఠుడు, నాస్తికుడు, పాపపుణ్య విచారణ చేయలేని మనిషి, మిత్రద్రోహి, నిరపరాధినియైన మిత్రుని ఇల్లాలిపై నిస్సంకోచంగా అత్యాచారం చేయ ప్రయత్నించినవాడు—అతని ముఖంకేసి చూచినప్పుడల్లా

ఆమె హృదయం విరక్తిభావంతో నిండిపోయేది_అట్టి సురేశ్‌కేసి చూస్తూంటే ఇప్పుడామె హృదయం విషంతో కాదు, విస్మయంతో అంచులువారింది! అతని పెదవులపై ఒక చిరునవ్వు వెలుగుతోంది. ఆ చిరునవ్వు రేఖలోనే సంపూర్ణ వైరాగ్యభావం ఆమెకు కనిపించింది! అతను మృత్యుగహ్వరం లోనికి నడుగుపెడుతున్నాడు. కాని అతని ముఖంలో ఉద్వేగంలేదు, ఆశంకలేదు. ఈ నిరీశ్వర వాదికికూడా, ప్రాణాలమీద ఎంత తెగింపు! ఈ భోగపరాయణునికికూడా ఇంత త్యాగమా? ఈ స్వార్థచిత్తునికికూడా ఇంత వైరాగ్యమా? ఔను ఇతను మళ్లీ యింటికి తిరిగి రాకపోవచ్చు.

హఠాత్తుగా అచల విచలచిత్త అయింది. చేతిలోని కవరు చూచు కుంది. "ఇది నీ వీలునామా?" అని అడిగింది.

"ఆ విషయం అడగవద్దని ప్రార్థించానుకదా అచలా!"

"అయితే సరే; కాని నేను మిమ్మల్ని వెళ్లనీయను"

"ఏం?"

"నాకోసంగా మీరు చనిపోతూంటే నేను ఊరుకోను"

సురేశ్ మాటాడలేదు. అచల తానన్నమాటలకు తానే సిగ్గుపడింది. "నీకోసం నేనెందుకు మరణిస్తున్నాను? నేను బీదప్రజల రక్షణార్థం వెడు తున్నాను" అని మీరంటారు. బాగా నేవుంది. కాని వారికోసమైనా మీరు చనిపోవటం నేను చూస్తూఊరుకోను"

ఈ సందర్భంలో సురేశ్‌కు మహిమ్‌బాబు జ్ఞాపకవచ్చాడు. అతని గుండెలోనించి ఒక దీర్ఘనిశ్వాసం వెలువడి గదినిండా వ్యాపించింది. తనకు ఈ ప్రపంచంమీద లేశమాత్రమూ మమత లేదన్న విషయమూ, తాను అతి తేలికగా తన సర్వస్వాన్నీ త్యాగం చేయగల ఉదారుడనీ తెలిసిన వాడు ఒక్కడే ఉన్నాడు. అతడే మహిమ్. తానిప్పుడు తలపెట్టిన ప్రయాణం పరలోక ప్రయాణంగానే పరిణమించేట్టయితే...సురేశ్‌బాబు లోభంచే కాదు, క్షోభచేకాదు. ద్వేషంచేకాదు, ఇహపరసుఖాపేక్షచేకాదు; కేవలం మృత్యువు వచ్చింది, మరణించాడు__అని మహిమ్ విశ్వసిస్తాడు.

సురేశ్‌కు అప్పుడు దుఃఖం పొంగింది. కాని నిగ్రహించుకున్నాడు, బలవంతాన చిరునవ్వు తెచ్చుకున్నాడు. "నేనెవరికోసమూ చచ్చిపోవటం లేదు అచలా! చేతులు ముడిచిపెట్టుకుని ఇంట్లో కూచోటం ఇష్టంలేదు. కాస్త అలా తిరిగి వద్దామని బయలుదేరాను. అంతేగాని నేనెందుకు చచ్చి పోతాను? నే నేమీ చచ్చిపోను."

"మరి ఈ వీలునామా దేనికి?"

"అది వీలు నామా అని నిర్ధారణ ఏదీ?"

"నన్ను ఒంటరిగా దిగవిడిచి మీరు వెళ్లిపోతారా?"

"వెడతాననీ, మళ్లీ తిరిగి రానని ఇంకా నిశ్చయం కాలేదుగా!"

"కాను, కాలేదు ఈకానిచోట నన్ను ఒక్కతెను దిగవిడిచి—"

అటూ అచల వెక్కి వెక్కి యేడ్చింది.

సురేశ్ లేస్తూ లేస్తూ మళ్లీ కూచున్నాడు. తీవ్రమైన హృదయంలోని వేగాన్ని నిగ్రహించుకున్నాడు.

"అచల నేను నీతో ఉన్నా నువు ఒంటరిదానివే! ఇంతకన్నా నీకు వచ్చే నిరాశ్రయస్థితి లేదు"

అచలా కన్నుల్లోనించి అశ్రుబిందువులు రాలాయి. ఆమె పెదవులు కంపించాయి పళ్లతో అధరాన్ని నొక్కిపట్టి ఆ వొణుకుడును అరికట్టాలని ప్రయత్నించింది. చివరకు భగ్నకంఠయై రోదించింది

"నావద్ద ఇంకా ఏమి వున్నది నీకు కావలసినది?" అంటూ దుఃఖంఆపు కోలేక పైట చెరగు ముఖాన కప్పుకుని లోనికి వెళ్లిపోయింది.

నౌకరు వచ్చాడు "బండీవాడు..."

"కాసేపు ఆగమని చెప్పు"

మరికాసేపటికి సొంత అశ్వరక్షకుడు వచ్చాడు—"చాలసేపవుతుంది, బండీ తయారు చేసిపెట్టాను"

"బండీ ఎందుకు?"

"అమ్మగారు పాతయింటికి ఒక్కసారి వెళ్లిరావాలన్నారు! బండీ తయారు చేసిపెట్టాను! వారిగది తాళం వేసిఉంది! ఎంత పిల్చినా పలకలేదు గుర్రం విప్పివెయ్యమంటారేమో కనుక్కు పోదామని వచ్చా!"

"అయితే ఉండు"

వెనక ద్వారం తెరచేఉంది. సురేశ్ అంగుండా ఆమెగదిలోకి వెళ్లాడు. ఒకమంచంమీద కూచున్నాడు. ఎదురుగా శుభ్రసుందరశయ్యపై అచల బోర్లా పడుకుని వెక్కి వెక్కి యేడుస్తున్నది! అతడు వచ్చినట్టు ఆమెకు తెలియదు ఆమెశరీరలత, ఆవిడుపు, అప్పటి ఆమెతీరుచూస్తోంటే సురేశ్ కు ఒక నిగూఢ సత్యం గోచరమైంది; ఉదయసూర్యకాంతిలో తళతళలాడుతూ ఆకుల అంచున వెలిగే మంచు బిందువు అనంత అపూర్వ సౌందర్యాన్ని చేతితో పట్టుకుందామని ప్రయత్నించాడు తాను. ఎంత పొరపాటు! ప్రాప్తంలే

లేనిదానికోసం ప్రాకులాడి పరిహాసాస్పదుడై నాడు. అమంచు బిందువు భూమిపై జారిపడి మామూలు నీటిబిందువువలెనే ఇనికిపోయి ఊరుకుంటుంది! భగవంతుడు దానికి ఏర్పరచిన స్థానము ఆకుమీద. అక్కడినించి దాన్ని ఈ ఐశ్వర్య మరుభూమికి తెచ్చి ఎలాపోషించటం?

సురేశ్ కన్నులు చెమ్మగిల్లినవి. "అచలా!"

ఆమె ఉలికి పడ్డది. కాని అలాగే పడిఉంది.

"నీబండి సిద్ధంగా ఉంది. ఇవాళ రాంబాబుగారి యింటికి వెళ్లాలనుకున్నావుటగా?"

దీనికి కూడా అచల జవాబు చెప్పలేదు.

"వెళ్లకపోతే గుర్రాన్ని విప్పివెయ్యమని చెప్పు. నేనూ ఈ చీకటి రాత్రి ఎక్కడికీ వెళ్ల దలుచుకోలేదు" అని చెప్పి సురేశ్ తనగదిలోకివెళ్లాడు.

పది పదిహేను నిమిషాలు గడిచాయి. ఏమిటో ఆలోచిస్తూ కూచున్నాడు ఏమాలోచిస్తున్నాడో రేతనికే తెలియదు ఇంతలో చీర కుచ్చెళ్ల రాపిడి వినిపించింది. అచలలోనికి వచ్చింది. కన్నీటి చారలు పోయేట్టుబాగా నీళ్లతో ముఖం కడుక్కుంది. ఒకధనవంతుని యిల్లాలిలా ముస్తాబై వచ్చింది, "ఇవాళ వారింటికి ఒక్కసారి వెళ్లాలి!"

ఆమె ఇంతగా సింగారించు కున్నది! తనకోసం కాదు రాంబాబు గారింటికి వచ్చిన అతిథులకోసం. ఆసంగతి సురేశ్‌కు తెలుసు, కాని ఆచీర, సొమ్ములు— ఆసింగారమంతా అతన్ని ముగ్ధపరచింది.

"అక్కడికి వెళ్ల వలసిన అవసరం ఏముంది" అని అడిగాడు.

రాత్రుని కలకత్తానించే జ్వరంతో వచ్చిందట పెద్దనాన్న గారికీ నుస్తీగానే ఉందిట"

"వాళ్లు వచ్చాక నువు ఒకసారైనా వెళ్లి చూడలేదా?"

"ఊహు"

వాళ్లైనా ఎవరూరాలేదా?"

"ఊహు"

"రాంబాబు కూడారాలేదు?"

"ఊహు"

ఇటీవల పరిసర గ్రామాల్లో ప్లేగువ్యాధి వ్యాపించియున్నప్పటినించీ సురేశ్‌బాబు ఆగ్రామస్థులకు సహాయంచేయటంలో నిమగ్నుడైయున్నందువల్ల ఇంటి వ్యవహారాలేమీ అతడు పట్టించుకోటంలేదు.

"అయితే వెళ్ళిరా; చప్పున రావాలి మళ్ళీ" అన్నాడు.

"మీరుకూడా రారండి"

"నేనెందుకూ ?"

"మీకు జ్వరం వచ్చినప్పుడు వాళ్ళు ఎంత ఉపచారం చేశారో జ్ఞాపకం ఉందా? మీరు డాక్టర్లు వస్తే మంచీ, చెడ్డా చెప్పగలరు"

"అయితేపద, వస్తున్నాను అంటూ సురేశ్ దుస్తులు మార్చుకునేందుకు తన గదికి వెళ్ళాడు.

అచలాదేవి బయటికి వచ్చింది. సురేశ్‌బాబు కోసం వేచియున్న అద్దెబండివాడికి కిరాయి ఇచ్చేసి పొమ్మంది. వాడుభయభయంగా సురేశ్ కేసిచూస్తూ"...రేపు..."అంటూ ఏమో అడగబోయాడు.

"రేపూవద్దు; ఎల్లుండీ వద్దు బాబుగారు ఎక్కడికీ వెళ్లరు. అనిఅచలాదేవే జవాబుచెప్పింది.

ఇద్దరూ సొంతబండీ ఎక్కిబయలుదేరారు. ఎవరూ ఏమీ మాటాడలేదు, ఇద్దరూకిటికీల్లోనించి బైటికి చూస్తూ కూచున్నారు చివరకు—

"అచలా !" అనిపిల్చాడు సురేశ్‌బాబు.

"ఏమిటి ?"

"నేనిప్పుడు ఏమాలోచిస్తున్నానో ఎరుగుదువా ?"

"ఊహూ"

"నా ప్రస్తుతపు ఊహాలు పూర్వపుటూహాలకు పూర్తిగా వ్యతిరేకంగా ఉన్నాయి. ఇదివరకల్లా నిన్ను ఎలా పొందగలనా అని ఆలోచిస్తూండేవాడిని ఇప్పుడు. నిన్ను ఎలా వదిలించుకుందామా అని ఆలోచిస్తున్నాను. నువ్వు నాకు మరీ భారమైపోయినావు"

సురేశ్ ఇలా అంటాడని ఆమె ఎన్నడూ అనుకోలేదు. ఆమాట ఆమెకు కటువుగానే ధ్వనించింది. హృదయం గాయపడ్డది. ఆ పలుకుల నామె విశ్వసించనూలేకపోయింది అస్ఫుటంగా—"నాకు తెలుసునుకాని—"

"నేను పొరపాటే చేశాను. హృదయంలేని దేహం దుర్భరం—అని నేను కలలోకూడా అనుకోలేదు."

"నన్నిక్కడ వదిలేసి వెళ్ళిపోతారా అయితే?"

"ఔను. అలాంటిపనే చేస్తాను" అని సురేశ్ ఏమీ సంకోచించకుండా జవాబుచెప్పాడు.

అచల మాటాడలేదు. అటువంటి సురేశ్‌కు తానిప్పుడు భారమైందా? తనకోసం పడిచచ్చిన సురేశ్ ఇవాళ తన్ను విడిచిపెట్టి వెళ్లిపోతాడా?

నిజానికి ఈ సురేశ్ తన అపారవిషాదానికి మూలకారణం. నిన్నటి వరకూ అతని గాలి సోకితే విషవాయువు సోకినట్టుగా ఉండా మెకు. ఆకాశం మేఘాచ్ఛన్నమైఉన్నది రాస్తా నిర్జనంగా ఉంది. గలగల చప్పుడు చేసుకుంటూ బండి చరచరా సాగిపోతున్నది. అందులో ఇద్దరూ మౌనంగానే ఉన్నారు.

సురేశ్ గుండెలో ఏమి ఆలోచనలు రేగుతున్నాయో అతనికే తెలియాలి! అతడు పలికిన నిష్ఠురవాక్యంవల్ల అచలాదేవి హృదయంమాత్రం భయవిహ్వలమైంది, సురేశ్ వెళ్లిపోతాడు. ఇక తాను ఈ విశాలప్రపంచంలో ఏకాకిని. ఈ భావం విద్యుత్ప్రవాహంలా ఆపాదమస్తకం కంపింపజేసింది. ఈ సంసారసముద్రంలో తన నావ బుడుంగుమంటోంది. దిక్చక్రము కూడా కనిపించని మహాసముద్ర మధ్యంలో తానున్నట్టు తోచింది. శరీరమంతా మంచుగడ్డవలె అయింది ఇక తనకెవరూ లేరు. తన్ను ప్రేమించేవాడుగాని, ద్వేషించేవాడుగాని, రక్షించేవాడుగాని, భక్షించేవాడుగాని ఎవడూ లేడు. తాను ఒక్కతే

అకస్మాత్తుగా అశక్తమైపోయిన ఆమె కుడిచేయి సురేశ్ ఒడిలోనికి పోయింది. అప్పుడామెకు స్పృహవచ్చి ఉలికికపడ్డది కన్నుతాను సంబాళించుకుని "ఇప్పుడు మీరు నన్ను ప్రేమించటంలేదన్నమాట !" అని అడిగింది.

సురేశ్ ఆమె చేయిని తన చేతులోనికి తీసుకున్నాడు.

"ఈ ప్రశ్నకు జవాబు ఒక్కసారిగా చెప్పలేకపోతున్నాను అచలా! కాని ప్రేమభూతాన్ని మోసేశక్తి నాలో ఇక లేదు. అంతమాత్రం నిజం."

"నన్నింకెక్కడికైనా తీసుకు వెళ్లు..." కరుణ కంఠస్వరాన అచల పలికింది.

"బంగాళీజాతి వాళ్లులేని ప్రదేశానికా?"

"ఔను సిగ్గు ఆనేది నాదరికి రాకుండా ఉండేచోటుకు"

"అక్కడ నువు నన్ను ప్రేమించ గలుగుతావా అచలా ?" అంటూ హృదయావేగం పట్టలేక ఆమెశ త్తమాంగాన్ని తనగుండె కదుముకున్నాడు. పెదవులు ముద్దు పెట్టుకున్నాడు.

అచల ముఖం పాలిపోయింది. ఆమె పెదవి... తేలుకుట్టినట్టు మండి పోయింది. అన్నది —

"ఔను ఒకప్పుడు నిన్ను ప్రేమించాను. లేదు—లేదు ఛీ ఎవరేనా చూచిపోతారు" — అంటూ కౌగిలి విడిపించుకుని సరిగా కూచుంది. కాని ఆమె చేయి సురేశ్ పిడికిలిలోనే ఉండిపోయింది. అతడు దాన్ని పరమ స్నేహ పూర్వకంగా నలుపుతూ నిట్టూర్పు విడిచాడు.

రామబాబుగారింటి ముందు బండీ ఆగింది. ఇద్దరూ బండిదిగారు. అచలాదేవి దృష్టి మేడమీద వరండావైపు ప్రసరిల్లింది. అక్కడ చాలమంది స్త్రీలుఉన్నారు! రాత్రిసికూడా అక్కడే ఉంది. చాలకాలానికి ఒకరొకరు చూచుకుని నవ్వుకున్నారు. రాంబాబు బండీ దగ్గరకు వచ్చాడు. స్నేహ పూర్వకంగా స్వాగతం చెప్పాడు —

"రా అమ్మా! లోపలికిరా"

వ్యగ్రవ్యాకులమైయున్న దాయన కంఠస్వరం అచల అతన్ని చూచింది మరుక్షణమే రాతిబొమ్మలా అయిపోయింది. ఇద్దరిచూపులూ కలిశాయి! ఇద్దరికళ్లూ నిర్నిమేషములై యొప్పినవి. అచలాదేవి ఒడలిమీద రత్నాలంకారాలు మామూలుగా మెరుస్తూనే ఉన్నవి. వాటి ప్రకాశం సన్నగిల లేదు కాని వాటిమధ్యన వికసించినకమలం మాత్రంముడుచుకుని పోయింది.

సూర్యుడస్తమించాండు! చీకటి పడుతోంది. అపరిచిత పురుషుని చూచి అచల లజ్జాన్విత యైనదని రాంబాబు ఊహించాడు. ప్రేమగా ఆమె చుబుకము పుణికి—పరవాలేదు లేఅమ్మా! నువుపాదాభివందనం చెయ్య నక్కరలేదు, మేడమీదికి పద—అన్నాడు.

అచల యేమీపలుకలేదు పదాలు తొట్రిలనవి. లోపలికి వెళ్లిపోయిది

"సురేశ్ బాబూ! అతడు..." అటూ పరిచయంచెయ్యబోయాడు రాంబాబు.

"ఔనౌను మేమిద్దరమూ ఒకటే క్లాసులో...చిన్నప్పటినించి మే మిద్దరమూ..."అంటూ సురేశ్ బాబు నవ్వబోయి ముఖం వికృతంగా పెట్టి—

"ఏం? మహేష్! అకస్మాత్తుగానువు..." అన్నాడు

మహేష్ ముఖం తిప్పుకుని లోనికి వెళ్లాడు.

వృద్ధుడు హతబుద్ధుడై సురేశ్ కేసి చూచాడు. అందుకు జవాబుగా ఒకనవ్వు నవ్వుదామనుకున్నాడు సురేశ్. కాని నవ్వలేకపోయాడు.

మెట్లమీదినించి ఏదోబరువైన వస్తువొకటి జారిపడి నట్టు చప్పుడు వినిపించింది ఇద్దరూ విచలితులైనారు. రాంబాబు లోనికి పరిగెత్తాడు అచల

పోర్లాబడింది. రెండు మూడు పెగ్గులెక్కి ఆమె మూర్ఛపడి నేలకొరిగింది.

# 41

ఇంటికి తిరిగివస్తూ బండిలో కూచుని అచల అనుకుంది మూర్ఛపడిన దాన్ని తెలివిరాకుండా ఉన్నట్టయితే బాగుండిపోను, ఎలాగూ నా చేతులతో నన్ను హత్య చేసుకోలేనుకదా! అలా దానంతట అదే మృత్యువు నన్ను కబళించి వెయ్యకూడదూ! తేలిగ్గా మరణించే ఉపాయంలేదా?"

సురేశ్ ఆమెను ముద్దుపెట్టుకున్నాడు. "ఎక్కడికైనా వెళ్లిపోదామన్నావుగా! వస్తావా?"

"పోదాంపద"

"లేవటినించి ఇక్కడ ఎవరికీ నాముఖం చూపించలేను"

"కాని మహీమ్ ఎవరికీ ఏమీ చెప్పడు"

సురేశ్ ఒక దీర్ఘనిశ్వాసం విడిచాడు— "ఔను నేను మహీమ్ స్వభావాన్ని ఎరుగుదును ఎవరితోనూ ఈ విషయం చెప్పడు"

ఆమాట విని అచలాదేవి శరీరం వణికింది. ఆతరువాత ఇల్లు చేరే వరకూ ఎవరూ మాటాడలేదు.

బండీలోనించి అచలను చేయూతయిచ్చి సురేశ్ దింపాడు." నువ్వు నీగదికి వెళ్లి నిద్రపోవటానికి ప్రయత్నంచెయ్యి. నేను కొన్ని జరూరు ఉత్తరాలు రాసుకోవాలి" అనిచెప్పి తన గదిలోకి వెళ్లాడు.

అచలవెళ్లి పక్కమీద పడుకుంది. తన వయస్సెంత? ఈ అనుభవిస్తూన్న వ్యధ ఎలాంటిది? ఈదుర్గతి తనకు భగవంతుడెందుకు రాసిపెట్టాడు? ఏమి మహాపాపం చేసింది తాను?

ఈరకమైన ఆలోచనలలో మృణాళిని తలుపుకువచ్చింది.

నిజానికి తాను కాపురానికి వెళ్లిన కొత్తలో భర్తకూ తనకూ సరిగా పడలేదు. కాని ఆతనికి జబ్బుచేసింది ఆరోజుల్లో పరిస్థితులు మారాయి. భర్తృవాల్లభ్యం లభించింది తనగుండె ఆనందంతో వికసించింది. భవిష్యత్తులో తన సంసారం సుఖప్రదం కాగలదని ఊహాసౌధాలు కట్టుకున్నది ఆసంతోషంలో ఇతర్ల దుఃఖాలయెడ కరుణ భావం కలిగింది. ఒకరోజున వెళ్లి మృణా

శిని కౌగలించుకుని—"అక్కా! నువ్వుగనక మా సమాజానికి చెందియున్నట్లయితే నీ జీవితం ఇలా వ్యర్థమై పోతూ ఉంటే ఊరుకోను" అన్నది.

మృణాళిని నవ్వి—"ఏం చేస్తావేమిటి? మళ్లీ పెళ్లి చేస్తావా?" అని అడిగింది.

"ఎందుకు చెయ్యను? కాని ఇప్పటికైనా శాస్త్రాలమాట యెత్తక నామాట విను. శాస్త్రాలంటే నాకు మహాచెడ్డ భయం"

మృణాళిని అలాగే నవ్వుతూనే ఉంది. "సరే, నీకలాగే నేనూ ఆలోచించటం నేర్చుకుంటాననుకో. నీకోరికే ఒప్పుకుంటాననుకో. ఎవరో ఒకరు పెళ్లికొడుకు దొరుకుతాడనుకో..." అంటూ అర్థోక్తిలో పకపకా నవ్వింది.

ఆనవ్వు చూచి అచలకు చాల కోపం వచ్చింది. "నువ్వు ఎప్పుడూ కూడా మా సమాజపు ఆచారాలను ఆసహ్యించుకుంటూనే మాటాడతావు. మా సమాజపు పెద్దలంతా మూర్ఖులే నంటావా?"

మృణాళిని నాలుక కరుచుకుంది. "ఛీ, ఛీ, నేనెప్పుడూ అలాఅనను. మనశాస్త్రాన్ని మీరొక సామాజిక విధానంగా భావిస్తారు. అందుచేత మంచి చెడ్డలు బాగా విచారిస్తారు. యుక్తులతో, తర్కంతో మీరావిషయంలో నిర్ణయానికి వస్తారు. కాని మాకు వివాహం ఒకధర్మం. భర్తను హిందూస్త్రీ ఈశ్వరుడిగా గ్రహిస్తుంది. ఈవిషయం తర్కానికతీతమైన దమ్మా!"

అచల ఆశ్చర్యాన్వితఅయింది. "అయితే మానవ ధర్మంమారదా?"

"ధర్మాన్ని గూర్చిన అభిప్రాయాలు మారుతూవుంటాయి. అసలు వస్తువు ఎలా మారుతుంది. ఎన్ని వివాదాలు రేగినా అన్ని జాతులవారికీ మూల సూత్రం ఒక్కటే. భర్తలోవుండే గుణదోషాలను మేమూ గమనిస్తూనే వుంటాము. అభిప్రాయభేదాలు వస్తూవుంటాయి. కాని అందరమూ మానవ మాత్రులమే గుణదోషాలు అందరిలో ఉంటాయి. అయినా మాకు భర్తే దైవము, ధర్మము; కనుక అయనే నిత్యుడు. బ్రతికివున్నప్పుడూ నిత్యుడే, మరణించినా నిత్యుడే. ఎప్పటికీ ఆ ఒక్కడే భర్త మరొక భర్త లేడు."

"సరే, నువ్వు చెప్పినట్టు మీ సామాజిక ధర్మం చాల గొప్పదే నుకుందాం. అయితే ఆ నిషేధాలన్నీ ఎందుకూ? ఎక్కడికీ వెళ్లకూడదు; స్వేచ్ఛ లేదు. జీవితమంతా సంకెళ్లే. ఎందుకీ దాగియుండవలసిన అవసరం స్త్రీకి? పరీక్షకు నిల్చినప్పుడుగదా సతీత్వపు విలువ?"—ఆవేశంగా పలికింది అచల.

మృణాళిని మందహాసం చేసింది. "సామాజిక నిషేధాలను విధించిన వారినే అడుగు ఆ ప్రశ్న — మేము కేవలం మా తల్లిదండ్రులు చెప్పినట్టుగా మాత్రమే నడుచుకుంటూవచ్చాం. కాని ఒక్కమాట చెబుతాను. స్త్రీ తన భర్తను దైవంగా స్వీకరించిననాడే ఆమె పరీక్ష ఆరంభమయినట్టే. నా భర్తను నువ్వు చూచావుగా! ముసలివాడు, బీదవాడు, రూపగుణాదులు సామాన్యములే. అయినా ఆయనే నాకు ఇహపరలోకాలు రెండూను" — మృణాళిని కన్నులు అశ్రుసిక్తములైనవి. కన్నులు మూసుకుని ఆమె ఆత్మావలోకనము చేసుకుంటున్నట్టుగా కనిపించింది. మరికొంతసేపటికి కన్నులు తెరచి చిరునవ్వుతో ఇలా అన్నది. "తండ్రికి తన కుంటికొడుకుమీదే ఎక్కువ ప్రేమ అని చెబుతారు. పక్కింటి సుందరవాని అవయవసౌష్ఠవం చూచినప్పుడు ఆతని మనస్సుకు బాధకలుగుతుంది, నిజమే. అంతమాత్రాన ఆతనికి తన కొడుకు మీద ప్రేమలో ఆవంతకూడా తగ్గదు. చనిపోయేటప్పుడు తనఆస్తి సర్వమూ ఆ కుంటివానికే యిచ్చిపోతాడు. మాకు యివ్వబడిన శిక్షణ, మా సంస్కారాలు, మా ఆలోచనలూ వేరు అచలా! నేను చెప్పిన ఈ ఉపమానం నీకు అర్థం కాకపోవచ్చు. కాని ఒక్కమాటమాత్రం నువ్వు పూర్తిగా విశ్వసించవచ్చు. ఫల దృష్ట్యా చలించే దైవాన్ని నమ్మలేని స్త్రీ ఎంత స్వేచ్ఛ అనుభవిస్తున్నా బందిఖానా ఉన్నటువంటిదే; పరీక్షాసమయం వచ్చేటప్పటికి అధఃపతితయైపోతుంది తప్పదు"

ఈనాడు తనగతి అక్షరాలా అలాగే అయింది. ఆనాడు మృణాళిని మాటలు తనకు అర్థంకాలేదు. ఈనాడో ఏదోఒక అజ్ఞాతశక్తి తన్ను పాతాళానికి లాక్కుపోతూవుంటే మృణాళిని బోధించిన మాటలు అనుభవానికి వచ్చాయి. స్వాతంత్ర్యం ఉపాసించే సమాజంలో తాను పుట్టింది, పెరిగింది. భర్తను స్వయంగా వరించి, వివాహమాడింది. పరీక్షాసమయం వచ్చినప్పుడు... దుఃఖసమయంలో... భర్తకు తానేవిధంగానూ ఉపయోగించలేదు. మిథ్యన మనసులో ఘోరవిపత్తు వచ్చి తన్ను ముంచేసింది. అత్యంత ప్రేమాస్పదుడైన పెద్దనాన్నగారి బలవంతముచేత తాను ఆతుపాను రేగిన నాటి రాత్రి సురేశ్‌బాబు శయ్యపై ఆత్మహత్య చేసుకోకుండా ఒక్క పాతివ్రత్యశాస్త్రమే తన్ను రక్షింప గలిగినది. ఆపాతివ్రత్యమే మృణాళిని... భర్త బ్రతికివున్నంత కాలమూ, చనిపోయిన తరువాతనూకూడా... నిత్యమని భావించింది. తనకు బోధించటానికి ప్రయత్నించింది. ఆనాడు తానా సత్యాన్ని అనష్ఠా

క్షన చేసింది. తర్కంతో మభ్యపెట్టింది. ఆగుప్తధర్మం సజీవమై తనలో ఏనాడూ ప్రకాశించలేదు.

ఈనాడు నిరర్థక అభిమానంతో, ప్రచండభావావేశంతో ఆమె వేగిపోతున్నది ఆసమయంలో మహీమ్ తనకేసి బరపిన స్తబ్ధ నిష్ఠురదృష్టి చురకత్తిలా తన గుండెలో గుచ్చుకుంది

చాల రాత్రి గడచిపోయింది. మనోవేదన క్రమేణా తగ్గింది. కన్నీళ్ల ప్రవాహం ఆగింది. నిద్రాదేవివచ్చి ఆవేశించింది.

మెలకువ వచ్చేసరికి చాల పొద్దెక్కింది సురేశ్ ఇంటికి వచ్చాడో, లేదో తెలియదు లేచి బైటికి వచ్చింది అచల.

"ఉదయాన్నే బాబుగారు పల్లెటూళ్లకు వెళ్లారు" అని చెప్పాడు నౌకరు.

"ఎవరన్నా తోడు వెళ్లారా?"

"లేదు నేనూ బయలు దేరాను. కాని వారు వద్దన్నారు."

"అందుకని బండీ మాటాడి పంపించి వచ్చావన్నమాట! నన్నెందుకు లేపలేదూ?"

నౌకరు మాటాడలేదు

"బండి నువ్వే పిల్చుకు వచ్చావా?"

"బండివాణ్ణి ఉదయాన్నే రమ్మనిమని బాబుగారు బండివాడికి నిన్ననే చెప్పారు. వాడే వచ్చాడు"

నిన్న రాత్రి జరిగిన సంఘటన వల్లనే సురేశ్ బాబు తెగించి వెళ్లాడని అచల నమ్మలేదు వెళ్లాలన్న సంకల్పం అతనిలో ఉంది తాను భయపడిపోయినందువల్లనే నిన్నటి రాత్రిమటుకు ఆగిపోయాడు.

"మళ్లీ ఎప్పుడు తిరిగి వస్తామన్నారు? ఏమైనా చెప్పారా?"

"రెండుమూడు రోజుల్లో వచ్చేస్తానన్నారు"

అచల మరేమీ ప్రశ్న వెయ్యలేదు. నిన్న మెట్లమీదినించి పడ్డందువల్ల తగిలిన గాయం ఎట్లాఉందో ఆమె ఇంతవరకూ చూచుకోలేదు ఇవాళ మరింత బాధగా ఉంది. ఒంట్లో ఎలాఉందో ఒక్కసారి కనుక్కుపోదామని బహుశా రామబాబు వస్తాడేమో! ఆమెకు భయంగా ఉంది. మహిమబాబు ఎప్పటికీ ఏవిషయమూ చెప్పడు. ఆ పెను బాగా నమ్మకమే; కాని దైవవశాత్తు ఏది ఎలాపోయి ఎలావస్తుందో నని గుండె పీకుతూనే ఉంది. సమస్త ఇంద్రియాలూ దరవాజా దగ్గర పహరాకాస్తూనే ఉన్నాయి. ఇలాగే అరోజంతా

గడచి పోయింది. రాత్రిపడింది. రాంబాబు ఇంకేమి వస్తాడులే.— అని నిరుద్విగ్నయై ఆమె పడుకుంది టేబిల్ మీద మందుల పట్టీ పుస్తకం ఒకటి పడి ఉంది. అది అందుకుని చూస్తూ చూస్తూ ఎప్పుడు నిద్రపట్టిందో ఆమెకే తెలియదు.

## 42

"బాబుగారు రేపో, ఎల్లుండో వచ్చేస్తారు, లేకపోతే అతావులెల్లుండి తప్పకుండా వస్తారు"— అని నౌకరు చెప్పాడు. కాని అచలకు నమ్మకం చిక్కలేదు

ఈమూడు రోజుల్లో ఒక్కరోజైనా రాంబాబు రాలేదు ఆయన వస్తాడేమోనని అనుమానం కలిగితే ఆమెశరీరం యావత్తూ పులకరించిపోతున్నది. ఆమూడురోజులూ ఆమెకు దేభయం 'ఆయన అస్వస్థిగా ఉన్నాడు; బహుశః జ్వరం ఎక్కువైందేమో' అన్న భావమే ఆమెకు పోలేదు. మూడో నాడు మాత్రం అక్కడినించి ఒకనౌకరు వచ్చాడు. కాని వాడు ఇంట్లోకి రాలేదు. అచలాదేవితో మాటాడలేదు బైటవున్ననౌకరుతో ఏదోమాటాడి వెళ్ళిపోయాడు? — ఈ ప్రశ్నలు అచలాదేవిని కలత పెట్టసాగినవి. కాని నౌకర్ని పిల్చి కనుక్కోటానికి అంతరాత్మ ఒప్పుకోవటంలేదు ఈయిల్లు సరంజామా, నౌకర్ల సర్వం విడిచి ఎక్కడికైనా పారిపోతే బాగుండునని పించిదామెకు.

చివరకు నౌకర్ని పిలిపించింది. "మజౌలీగ్రామం ఎంతదూరంఉంటుందో తెలుసునా నీకు?"

"ఒకసారి బాబుగారితో వెళ్ళివచ్చాను. ఆరు, ఏడు కోసులు ఉండొచ్చు" అన్నాడు రఘువీర్.

"నాతోకూడా వస్తావా, వెళదాం?"

రఘువీర్ ఆశ్చర్యపోయాడు—

"అక్కడ తీవ్రంగా ప్లేగువ్యాధి ప్రబలిఉంది అమ్మగారూ!"

"నీకు భయంగాఉంటే నాతోకూడా ఎవరన్నా వస్తారేమో కనుక్కో. డబ్బు ఎంతకావాలంటే అంత ఇస్తాను"

"మీకు భయం లేకపోతే నాకుమాత్రం భయమెందుకండి అమ్మా! కాని దారి...రాళ్లూ రప్పలూ బండీ వెళ్లదు."

"పోనీ, డోలీఒకటి మాటాడి పట్టుకురా; ఆలశ్యం చెయ్యకు."

రఘువీర్ డోలీ తెచ్చాడు. ఒక కంబళీ, కర్ర పుచ్చుకుని తానూ కాలినడకన బయలుదేరాడు. ఇంటికావలాకు నౌకర్లను నియోగించి అచలాదేవి బయలుదేరింది అప్పుడామె మనస్సులో గత సంఘటనలన్నీ స్వప్నంలో లా గిర్రున తిరిగాయి. తనగతి ఇలా ఔతుందని ఎన్నడూ అనుకోలేదు గదా!

అచలాదేవి మజౌలీపల్లె చేరేసరికి సూర్యాస్తమయమైంది. త్రోవలో ఉన్న పల్లెటూళ్లన్నీ చాలవరకు ప్లేగువ్యాధి చే పాడుబడిపోయాయి. ఎక్కడ చూచినా పీనుగుపెంటలే; శవాల్ని వల్లకాటికి మోసుకుపోయేవాళ్లే. అచలకు రుద్రభూమిలో ప్రయాణంచేస్తున్నట్లనిపించింది.

మజౌలీ చేరాక వారినీ వీరినీ విచారించగా డాక్టరు సురేశ్ ఉన్న చోటు తెలిసింది.

ముందర రఘువీర్ లోనికివెళ్లాడు. వసారాలో మంచంమీద పడుకున్నాడు సురేశ్. ఒక ముసలి స్త్రీ విసురుతూ పక్కన కూచుంది.

"బాబూ!"

సురేశ్ ఉలికిపడి కళ్లుతెరచి చూచాడు "ఎవరు? రఘువీర్!"

రఘువీర్ నమస్కారంచేసి దగ్గరకు వచ్చాడు కాని పాలిపోయిన సురేశ్‌బాబు ముఖం చూస్తుంటే అతని నోట మాటరాలేదు.

"నువు ఇక్కడికి రావటం ఏమిటి?"

రఘువీర్ ద్వారంకేసి చూపుతూ—"అమ్మగారు..." అన్నాడు.

"నిన్నిక్కడికి వెళ్లి రమ్మన్నదా?" అని సురేశ్ అడిగాడు ఆశ్చర్య పడుతూ మంచంమీద లేచికూచుని—

"లేదుబాబూ! ఆమెకూడా వచ్చారు."

సురేశ్ ఒక నిమిషంసేపు గుడ్లు ఒప్పజెప్పి చూచాడు. మెల్లిగా మళ్లీ పడుకున్నాడు.

అచల లోపలికి వచ్చింది. పక్కమీద ఒకమూల కూచుంది. "రా, కూచో" అని మాత్రం మర్యాదార్థంగా అన్నాడు సురేశ్.

చిన్నప్పటినించి అతడు ఆవేశానికి దాసుడు. ఆత్మ సంయమన మెరగడు. కాని ఇటీవల రాంబాబు గారింటిలో మహేష్ తనవైపు తీక్షణదృష్టి

విసిరి, మారుమాటాడకుండా, ముఖం త్రిప్పుకుని వెళ్ళిపోయాడు ఆ క్షణంతో అత్మ సంయమనావశ్యకత సురేశకు జీవితంలో ప్రప్రథమంగా గోచరించింది. ఇప్పుడు అచలాదేవి హృదయంలో ఎంత తీవ్రమైన తుపాను రేగుతూవున్నదో అతడెరుగును. తనహృదయంలో ఆక్షణాన రేగిన ఉన్మత్త ఆవేగంతో ఘూర్ణుపడుతూ కళ్ళుమూసుకుని అలాగే మౌనంగా ఉన్నాడు. హృదయంలోని పశ్చాత్తాపాన్ని లేశమాత్రమూ బైటికి ప్రకటించ నీయలేదు.

చివరకు రఘువీర్ బైటికి వెళ్ళాడు. సురేశ్ కళ్లు తెరచాడు. "నా ఉత్తరం అందిందా?"

"లేదు" అన్నది అచల వంచిన తల యెత్తకుండానే.

"ఉత్తరం అందకుండానే వచ్చేశావా? ఆశ్చర్యంగా ఉందే. అయినా నువ్వు రావటం ఒకందుకు మంచిదే. మరొకసారి నిన్ను చూడగలిగాను" అంటూ సురేశబాబు ఒక క్షణంసేపు ఆమె నమితవదనం విలోకించి మళ్లీ అన్నాడు— "నా మూలాన నీకు చాల దుఃఖం కలిగింది. అమరణాంతమూ అది వదలిపోయేదు దుఃఖంకాదు. నేనే అపరాధం చేశాను. నువ్వు మహిమ్ను ఇంత అధికంగా ప్రేమిస్తున్నావని నేను అనుకోలేదు"

అచల వంచిన తల యెత్త లేదు. సురేశ్ మళ్లీ ఇలా అన్నాడు—" అదీగాక మానవుల మనస్థైర్యంలో నాకు నమ్మకంలేదు. దేశకాలాలను బట్టి నడుస్తుంది; ప్రేమకూడా అంతే— అనుకున్నాను. నీ శరీరాన్ని పొంది నీ మనస్సును కూడా పొందగలననీ, నీ ప్రేమకూడా దుష్ప్రాప్యము కాదనీ అనుకున్నాను. నా సర్వస్వంనీకిచ్చి నిన్ను లోభ పెట్టగలననుకున్నాను. ఎప్పటికైనా నా అదృష్టం తిరిగి నీవు ప్రసన్నురాలవై నన్ను మన్నిస్తావనుకున్నాను"

అచల నేలకేసి చూస్తూకూచుంది "గ్రామంలో అందరూ ప్లేగుభయం వల్ల పారిపోయారు. ఇక్కడ మోహవని ఐపోతే వెడతాం...ఇంకే దేశానికైనా... దేహరీలో ఇంకా ఒక్క క్షణం కూడా ఉండలేం"—అన్నదిఆమె లజ్జాన్వితయై మృదుల కంఠాన.

"నాకూ తెలుసు అసంగతి" అని సురేశ్ ఒకనిట్టూర్పు విడిచాడు. మరికాసేపాగి మెల్లగా— "ఇవాళ ఉదయమే రెండు ఉత్తరాలు రాశాను; నీకు ఒకటి, అతడు ఇంకా దేహరీలోనే ఉంటే ఉత్తరం అందగానే మహిమ్కొకటి తప్పకుండా వచ్చేస్తాడు" అన్నాడు.

"వారికెందుకు రాశారు"—భయవిస్మయాలతో అచల ప్రశ్నించింది

"చిన్నప్పటి నించీ నాకు ఏ సమస్య వచ్చినా అతడే చిక్కు విడదీసి పరిష్కరిస్తూ ఉండేవాడు. అంతటి ధైర్యం అతనిలోనే ఉంది. అతడే మళ్ళీ ఇప్పుడు నాకు కావలసి వచ్చాడు"

అచలాదేవి గుండె దడదడ లాడింది. నేలకేసి చూస్తూ కూచుంది. సురేశ్ ఇంకా ఇలా అన్నాడు—"ఉత్తరంలో అన్ని విషయాలూ రాశాను చదువుకుంటే అతనికే తెలిసిపోతుంది. ఆనాడు నా వీలునామా నీ చేతి కిచ్చాను, జ్ఞాపకం ఉంది కదూ! అందులో రాసినట్టు నా ఆస్తి అంతా నీ అధీనంలోనే ఉంటుంది నీకు కావలసినంత నువ్వు ఉంచుకోవచ్చు—కాని నువ్వు ఉంచుకోవలసిన అవసరం లేదు. నేనే బ్రతికివుంటే నా సొమ్మంతా బీదలకు చెందవలసినదే. అలాగే నేను చచ్చిపోయినా నా ఆస్తి అంతా బీదలకు సంక్రమించటమే నా కోరిక నా వస్తువ ఒక్కటి కూడా నువ్వు ఉంచుకోవద్దు అచలా! నీకు శాంతి చేకూర వలెనని నా ఆశ! నన్ను పూర్తిగా మరచిపో ప్రపంచంలో మనం అనేక దుఃఖాలు సహించ గలుగుతున్నాము. ఏ నాటి కైనా నావల్ల కలిగిన దుఃఖాన్ని నువ్వు మరచిపోయి సుఖశాంతులు పొంద వలెనని నా కాంక్ష"

సురేశ్ మాటలు వింటోంటే అచలకు భయమనిపించింది. "అలా మాటాడకండి. ఏదీ ఒక్కసారి లేచికూచోండి. ఇక్కడినించి తొందరగా పారిపోయే ఉపాయం ఆలోచించండి"

ఆమె భయం, ఆవేశం అర్థమైకూడా సురేశ్ మాటాడలేదు. ఇంత సేపటినించీ వినుతూ కూచున్న ముసలావిడ అడిగింది—"బాబూ! లోపలికి వస్తారా! దీపం ఇక్కడికే పట్టుకురానా?"

ఈ మాటకుకూడా సురేశ్ జవాబు చెప్పలేదు. అచల మరీ ఉద్విగ్న అయింది. "ఇదివరకు చెప్పినమాటే మళ్ళీ చెబుదామనుకుంది కాని ఇంతలో కళ్ళు తెరచాడు—ఇంతవరకూ నీకు అసలు విషయం చెప్పాను కాదు. అచలా! నేను చనిపోతున్నాను బ్రతుకుతానన్న ఆశ లేదు"

ఏదో అవ్యక్తధ్వని అచలాదేవి కంఠం వెలువడివచ్చింది. రాతి బొమ్మలా కూచుండిపోయింది.

"నేను బుద్ధిపూర్వకంగా చచ్చిపోతున్నానని ఎవరూ అనుకోకండి, అది అబద్ధం. అలా మీరనుకుంటే మరణవేదనకన్నా ఎక్కువ బాధ అనుభవిస్తాను. అందరూ చనిపోయినట్టే నేనూ చచ్చిపోతున్నాను. మృత్యువు

నించి తప్పించుకోలేను: కాబట్టి చచ్చిపోతున్నాను. చచ్చిపోవాలని నాకు కోరికేమీ లేదు."

అచల ఏమీ పలుకలేదు. మాటాడ గల శక్తి ఆమెలో లేదు. భీతహరిణమువలె ఉన్న ఆమె మూర్తిని సురేశ్ చూచాడు—"ఇక్కడికి రాకుండా ఉండలేకపోయాను. అందుచేతనే ఆనాడు నీతో చెప్పకుండా కూడా వచ్చేశాను. వచ్చి చూస్తే—ఈ గ్రామస్థులంతా అంతకుముందే ఎక్కడికో పారిపోయారు. ఈయింట్లో ఒక నౌకరు చనిపోయాడు. వాడి దహనక్రియలు నేనే జరిగించాను. ఆ తరువాత ఇంటికి వెళదామనుకున్నాను. ఇంతలో ఒక కుర్రవాడు ఏడుస్తూ వచ్చాడు వాళ్ల అమ్మకు నుస్తీగా ఉందట. వెళ్లి అపరేషన్ చేసి వచ్చాను; అడ్డంపడ్డాను. ఎన్ని ఆపరేషన్లు చేశాను? ఎంతజాగ్రతగా ఉంటాను? అయినా ఈసారి పెద్దమ్మవారు నెత్తిమీద కూచుంది. నాబొటనవ్రేలు కోసుకుపోయింది. వెంటనేఇక్కడికి వచ్చి కట్టు కట్టుకున్నాను. బయలుదేరి ఇంటికిరావటానికి వీలుంటేరాలేక పోయానా? నిన్నరాత్రినించీ జ్వరం వస్తున్నది ఉదయమే మీ యిద్దరికీ ఉత్తరాలు రాసి పంపించాను"

అచలాదేవి కన్నీళ్లు అపుకుని వ్యాకులచిత్తయై—"నేనుఎక్కివచ్చిన డోలిలో మీరుకూచుని... వెడదాంపదండి.తక్షణంవెడదాం, ఒక్కనిమిషం కూడా ఇక్కడ ఇక ఉండవద్దు"

"మరినీవో !"

"నేను నడుస్తాను."

"నడుస్తావా ? ఇంతదూరం ?"

"మీకాళ్లు పట్టుకుని బ్రతిమాలుతున్నాను. ఏమీ అడ్డుచెప్పకండి; తక్షణం బయలుదేరండి"—అంటూ అచల ఏడుపు ఆరంభించింది.

సురేశ్ ఒక దీర్ఘనిశ్వాసంవిడిచాడు—"సరే, అలాగే...కానీ వెళ్ల వలసిన అవసరంలేదు"

అచలలేచిబైటికి వచ్చింది ఒకచెట్టుక్రింద కూచుని రఘువీర్ శనగలు తింటున్నాడు.

"రఘువీర్ ! బాబుకు బాగాజ్వరంగా ఉంది. వెంటనేఇంటికితీసుకు పోవాలి; డోలీవాడికి ఎంత డబ్బుకావలసినా ఇస్తామనిచెప్పు"

ఆమెగారి వ్యాకుల కంఠస్వరంవిని రఘువీర్ ఉలికిపడ్డాడు.

"కాని వాడు ఇక్కడ్కి మాయలేదు అమ్మగారూ!"

అప్పుడే తెల్లవారుతూ ఉంది. పిలుపువిని అచల ఉలికిపడ్డది. ద్వారం దగ్గిర రఘువీర్ నిల్చి యున్నాడు. ఎవరోవచ్చారని చెప్పటానికి అతడు వచ్చాడు.

"ఏమిటి రఘువీర్ !" అంటూ అటు కేసి చూచింది అచల. మహిమ్ లోనికి అడుగు వేశాడు ఇద్దరి. చూపులూ కలిశాయి

ఆమె కంపించింది. చూపులు నేలకు దించుకుంది. క్షణమాత్రంగా మహిమ్‌బాబు ద్వారం దగ్గిరే స్తంభించిపోయాడు. తిన్నగా లోపలికి వచ్చాడు.

"ఎలాఉంది సురేశ్‌కు ?" — అని అడిగాడు మృదువుగా.

అచల తలయెత్త లేదు. జవాబు చెప్పలేదు తనకేమీ తెలియదన్నట్టుగా నిల్చుంది.

మహిమ్‌బాబు చేరవకువచ్చి సురేశ్ నుదుటిమీద చెయిపెట్టి చూచాడు, సురేశ్ కన్నులు తెరచాడు. ఆకన్నులు నిస్తేజములు. చూచి మహిమ్‌బాబు విచలితుడైనాడు. ఆతని నోటివెంట మాట రాలేదు కానేపు ఆగి — "ఎలాఉంది సురేశ్!" అని అడిగాడు.

"ఏమీబాగులేదు. నేను వెళ్లిపోతున్నాను. నువు వస్తావనే అనుకున్నాను. దగ్గర కూచో —"

మహిమ్‌బాబు మంచంమీద కూచున్నాడు "దేహరిలో డాక్టరు ఉన్నాడు. నా బండిలో ఎలాగో —"

"వద్దు లాభంలేదు నన్ను శాంతగావెళ్లిపోనీ..."

"కాని ఇంత వరకూ"

"ఔను, ఇంతవరకూ తెలివితోనే ఉన్నాను. అయినా మాటిమాటికి ఏదో మరుపువస్తూనేఉంది. బ్రతికి వున్న న్నినాళ్లూ నేను బీదజనులకు సరిగా అక్కరకు వచ్చానుకాదు. నామరణానంతరం నా సంపదయైనా వారికి చెంద వలె ఈమాట చెప్పటానికే నిన్నిక్కడికి పిలిపించాను. అంతేగాని... క్షమా పణవేడుకుని కావ్యరచనచేసే శక్తి నాలో లేదు"

మహిమ్ మాటాడలేదు, సురేశ్ ఇంకా ఇలా చెప్పసాగాడు — "అటువంటి విషయాల్లో నాకు విశ్వాసంలేదు; నాకు నచ్చవుకూడాను నీక్షమాపణ నేను ఆశించను నావిల్లునామా రాశాను! అచలాదేవికి నేనేమీ ఇవ్వలేదు. ఏదోఇచ్చి ఇంకా ఆమెను అవమానించటం నాకిష్టంలేదు. కాని అవసరమైతే మాత్రం ఆమెకు కావలసినంత తీసుకోవచ్చు.

మహీమ్ వ్యాకులచిత్తుడైనాడు. "నీవిల్లునామా విషయంలో నాకెం దుకు జోక్యం పెడతావు?"

"నా విల్లునామాలోని అంశాలు పూర్తిగా జరుగగలందులకు నీజో క్యం అవసరం నీకు ఆశ లేదు. దేనిమీదా లోభంలేదు — అచలా! నువ్వు రాత్రి అంతా మేలుకునే ఉన్నావు. వెళ్ళి ముఖంకడుక్కో; వెళ్లు"

అచల లోనికి వెళ్ళి పోయింది సురేశ్ మహీమ్ కేసి చూస్తూ — "మహీమ్! ఒక్క విషయం తలుచుకుంటే నాకు చాలా దుఃఖమనిపిస్తున్నది అచల నిన్నెంతో ప్రేమిస్తున్నది, ఆసంగతి నేనూ గుర్తించలేకపోయాను; నీకూ తెలియదు; ఆమెకూ నా యెరుగదు. నీ దారిద్ర్యస్థితి అప్రేమను... పోనీ, ఆసంగతి అంతా ఇప్పుడెందుకని? అనుంగ వస్తువును నేను ధూళిమా సరితము చేశాను. నేనూ పొందలేకపోయాను; నీకూ లభింపనీయలేదు, ఏంచె య్యను? — మా బొమ్మను కాస్త కనిపెట్టిఉండు ఆమెపాపం చాలా దుఃఖి స్తుంది" అన్నాడు,

ఆయింటి ముసలమ్మ మందుసీసా తెచ్చింది. "వద్దు; ఇప్పుడుమందు అక్కర్లేదు, కాసిని మంచినీళ్లు చాలు — నేనొక నాటకం రాశాను మహీమ్! నా డ్రాయర్‌లో ఉంది; చదువు" అన్నాడు సురేశ్.

మహీమ్ అతనిముఖంకేసి చూడలేక నేలచూస్తూకూచుని వింటు న్నాడు. ఏకోమాటాడాలని నోరు తెరవబోయాడు. కాని సురేశ్ అడ్డం వచ్చాడు. "మహీమ్! నేనుకాసేపు నిద్రపోతాను. ఇంతలో నువ్వు ముఖం కడుక్కొని కాఫీ అదీ త్రాగు" అంటూ కళ్లుమూసుకున్నాడు

"ఒక్కమాట ఉన్నది సురేశ్!"

"ఏమిటి?"

"నువ్వు భగవంతుని ఎన్నడూ స్మరించలేదు. అతడు..."

"నాకు అక్కర్లేదు" అంటూ ముఖం వికృతంగా పెట్టి దుప్పటి కప్పు కుని పడుకున్నాడు సురేశ్. ఒకదీర్ఘనిశ్వాసాన్ని బలవంతాన అణచు కున్నాడు మహీమ్.

మహీమ్ బయలుదేరి వెళ్ళిన రోజున రాంబాబు ఇంట్లో లేడు. ఇంటికి రాగానే మహీమ్‌బాబుకు సురేశ్ రాసిన ఉత్తరం చదువుతున్నాడు. తక్ష ణం బయలుదేరి, బారిసాదుకువా, గుర్రాన్ని చావమోది, మజ్లీగ్రామం చేరు కున్నాడు. ఆయన ఎవరో పోలీసు ఉద్యోగి కావాలనుకొని ఒకదుకాణదారు స్వయంగా వెంటబెట్టుకొని సురేశ్ బాబు బస చూపించి వెళ్లాడు.

అప్పటికే అశ్వాసం ముగిసిపోయింది సురేశ్ ప్రాణం విడిచి అప్పటికి రెండుగంటలైంది. శవాన్ని బైటికి చేర్చారు అక్కడ ఒక అరుగు మీద అచలాదేవి కూచునిఉంది.

ఆదృశ్యం రాంబాబు చూడలేక పోయాడు, 'అరె, అయ్యో' అంటూ దుఃఖావేశ పరవశుడై ఏడ్చాడు. అచల ఆయనకేసి ఒకసారి తలెత్తి చూచింది మళ్లీ తల వంచుకుంది రాంబాబు ఆర్తకంఠధ్వని ఆమె చెవుల వరకే వెళ్లింది అంతకన్నా లోతుకు వెళ్లలేదు.

ఏడుపువిని మహీమ్ బైటికి వచ్చాడు, "మీరు రావటం మంచిదైంది రాంబాబూ! లేకపోతే ఒక్కడినీ చాల అవస్థ పడవలసి వచ్చేది"

రాంబాబు కన్నీళ్లు తుడుచుకున్నాడు, ఏం చెయ్యాలో, ఏమి మాటాడాలో ఆయన కేమీ పాలు పోవటంలేదు

"మా రఘువీర్ కట్టెలు సంపాదించాడు. ఇక్కడికి నదిఎంతో దూరం లేదు. మన ముగ్గురమూ శవాన్ని మోసుకు పోవాలి మనకు సాయపడేందుకు ఊళ్లో జనం కూడా ఎవరూ లేరు."— అన్నాడు మహీమ్.

నువ్వూ, నేనూ... మూడోవాడేడి" అన్నాడు రాంబాబు

"రఘువీర్ ఉన్నాడుగా!"

"ఛీ ఛీ బ్రాహ్మణ శవాన్ని వాడు ముట్టుకోవటం నా కిష్టంలేదు మన యిద్దరమే మోసుకుపోదాం, ఫర్వాలేదు.

"సరే అలాగే" అని మహీమ్ ఏదో పనిమీద లోనికి వెళ్లాడు రాంబాబు వసారాలో స్తంభానికి ఆనుకుని మౌనంగా కూచున్నాడు

ఆయన చాల పెద్దవాడు! తన హయాంలో ఎన్నో చావులు చూచాడు ఎంతమంది దుఃఖితులనో పరామర్శించాడు. సురేశ్ మృతి ఆయన్ను పూర్తిగా విచలితుని చేసింది. ఒకసారి అచలాదేవి అతని వక్షంమీద వాలి భోరున ఏడ్చింది. ఆయన ఆ సన్నివేశాన్ని మరచి పోలేదు. ఆయనలోని పితృహృదయం వేదనతో కుమిలి పోతున్నది అచలాదేవిని తానెలా ఓదార్చగలడు? ఏమీపాలు పోవటంలేదు. మిక్కిలి శోకాతురుడైనాడు మనిషి, ఒకసారి అచలాదేవిని ఒడిలోకి తీసుకుని 'భయపడకమ్మా, ఇంకా నేను బ్రతికే వున్నానుగా' అని ఓదార్చ వలెనని ఆయన హృదయం ఆతృత పడుతున్నది.

కాని అచలాదేవి అటుకేసి తిరిగి మౌనంగా... ఎవరితోనూ తన కేమీ సంబంధం లేనట్టుగా కూచుంది ఇన్నాళ్లనించీ ఆమె తనమనో వేదన అణుచుకుంటూ తానే అనుభవించింది. ఒక్కసారి కూడా మనసులో ఉన్నది

ఆ ముసలి వాడికి చెప్పుకో లేరేమ, ఇప్పుడు కొత్తగా భర్త చనిపోతే ఎంత ధైర్యంగా, విచారమున్నది లేకుండా, రాయిలా, కూచుందే! ఎంత కఠినమైన మనస్సు! రాంబాబుకు ఆమె తరవాత చూస్తూంటే... ఇన్నాళ్లనించి ఆమె పట్ల తనకున్న వాత్సల్యమంతా ఇగిరి పోతున్నది

సూర్యాస్తమయమైంది. సహీమ్ లోపలనించి వచ్చాడు. రాంబాబుతో సహా శవాన్ని మోసుకు పోయేందుకు ఉద్యమిస్తూ — "అచలా! నువ్వు వెళ్లి లోపల కూచో. మేము తిరిగి వచ్చేసరికి ఆలస్యం కావచ్చు" అన్నాడు.

అచల ఏమీ పలుకలేదు. రాంబాబు పొర్లివస్తూన్న దుఃఖాన్ని నిగ్రహించుకుని అన్నాడు — "అమ్మాయీ! చెప్పటానికి నాకు నోరు రావటం లేదు. నాగుండె పగిలి పోతున్నది. కాని చెప్పక తప్పదు. ఆయనదాని అంతిమ కర్తవ్యం నువ్వు నెరవేర్చాలి. ముఖాగ్ని —" అర్ధోక్తిగా ఆగిపోయి, అపులేక ఏడ్చాడు.

అచలాదేవి ముఖం, కన్నులు అత్యంత నీరసంగా ఉన్నవి. క్షణంసేపు రాంబాబుకేసి స్థిరంగా చూచింది. అన్నది —

"అవసరమైతే ముఖాగ్ని సమర్పిస్తాను. కాని నేను వారిభార్యను కాదు."

రాంబాబు వజ్రాహతునివలె కుంగిపోయాడు. నిర్నిమేషదృష్టిని ఆమెకేసి చూస్తూ —

"నువు సురేశ్ బాబు భార్యవు కాదూ!"—అని అడిగాడు

"ఆయన నాభర్త కాదు"—అని అవిచలితస్వరాన జవాబిచ్చింది అచల.

అచలాదేవి తనయింటో అడుగు పెట్టిననాటి నించీ, ఆమె మూర్ఛపోయిన సమయంవరకూ— సమస్త సంఘటనలూ రాంబాబు హృదయంలో గిర్రున తిరిగాయి. అయితే ఈమె ఎవరు? ఎవరిబిడ్డ? ఏమిజాతి? వేశ్య కాదుకదా! తానామెను 'బిడ్డా' 'అమ్మా' అని ఆప్యాయంగా పిల్చాడు; ఆమె వండిన కూడు తిన్నాడు; ఇంట్లో దేవుడికి కూడా ఆమెచేత నివేదన చేయించాడు రాంబాబు శరీరం అంతా ఏదో వేదనతో నిండి పోయింది. ప్రేమతో, వాత్సల్యంతో, కరుణతో ఆమెను అభిషేకం చేశాడు. ఇప్పుడు ఆ ఆపేక్ష అంతా...ఎడారిలో నీటి చుక్కలువలె...గుండెలో ఇంకి పోయింది.

మహీమ్ కూడా స్తంభితుడైనాడు "అయితే మరిఏంచేద్దాం? మనం శవాన్ని తీసుకుపోదాం పదండి" అన్నాడు.

"ఏం." అంటూ మహీమ్‌ను అనుసరించాడు. ఏదో నడిచి వెడుతున్నాడే గాని బాహ్య జ్ఞానమే ఉన్నట్టు లేదు మనిషికి జాతిపోయింది; ధర్మం భ్రష్టమైంది ఈమానవజన్మ వ్యర్థమై పోయింది, అన్నమాటలు మాత్రం ఆయన చెవిలో శబ్దిస్తున్నవి.

సురేశ్ బాబు దహనక్రియ ముగియగనే రాంబాబు ఇంటికివచ్చి, వెంటనే బండీవాణ్ణి పిల్చి తిరుగు ప్రయాణానికి తయారు కమ్మన్నాడు.

"ఇప్పుడే బయలుదేరి వెడతారా ?" అన్నాడు మహీమ్.

"ఔను. రేపు ఉదయంబడికే నేను కాశీవెళ్లి పోవాలి. ఇప్పుడే ఇక్కడనించి కదలకపోతే... నాకురైలు అందదు"

రాంబాబు మనోభావం మహీమ్ గ్రహించాడు. ఆయన ప్రాయశ్చిత్తం చేసుకునేందుకే కాశీ వెడుతున్నాడని అతనికి తెలును, అందుకోసం సంకోచిస్తూనే అన్నాడు —

"నేను ఈప్రాంతాలను కొత్తవాణ్ణి నాకేమీ తెలియదు. దయవుంచి యీమెను కూడా కాస్త తీసుకు వెడితే......"

రాంబాబు మండిపడ్డాడు —"దయ? నీకుమతిపోయిందా మహీమ్ బాబు !"

మహీమ్‌బాబు ఇకఆయనతో వాదించదలచుకోలేదు. "బహుశః ఈమెఇక్కడ రెండు మూడురోజులనించీ అన్నపానాదులు లేకండా ఉంది. ఈమె నిక్కడ ఈభయంకరప్రదేశంలో ఒంటిగా దిగ విడిచి పోవటం... అన్నాడు వినయంగా, భయంభయయంగా.

నిష్ఠానిధియైన ఆబ్రాహ్మణుని హృదయంమరింత కఠినమై పోయింది.

"ఓహో, నువుకూడా బ్రాహ్మమతస్థుడివే గా ! మరచిపోయాను. నువు బ్రహ్మజ్ఞానివైతే కావచ్చు. నేను అధఃపతితుడిని కావాలన్న కోరిక నీకు లేకపోతే ...ఈకులట విషయంలో 'దయ' 'మాయ' అంటూ అలాటి విషయాలేవీ నాకుచెప్పకద్దు" అని తీవ్రంగా పలికి వెంటనే బండీలో ఎక్కి కూచున్నాడు. "ఇప్పుడిక బ్రహ్మజ్ఞానంతో పనిలేదు, ప్రాణం కాపాడు కోవాలంటే వచ్చి బండీ యెక్కు" అన్నాడు.

మహీమ్ ఒక్క నమస్కారం చేశాడు, రాంబాబు బండీసాగిపోయింది గుండెచీల్చుకుని వచ్చిన ఒక దీర్ఘ నిశ్వాసం విడిచాడు మహీమ్!

అచల లోపల కూచుని ఉంది. బండి సాగిపోయిన చప్పుడు విన్నది, రాంబాబు లోపలికి రానే లేదు, ఒక్క మాట కూడా ఆమెతో మాటాడలేదు దాని తాత్పర్యం ఆమెకు సుస్పష్టమే.

సురేశ్ బాబు మృత్యువు వల్ల కలిగిన భయం కూడా చల్లారింది మహిమ్ లోనికి వచ్చాడు ఆమెకు చాల సమీపంగా వచ్చి నిల్చున్నాడు. ఆమె చెక్కిళ్లు లజ్జారుణములు కాలేదు.

"ఇకనీ ముందు కార్యక్రమం ఏమిటి?" అని అడిగాడు మహిమ్.

"నేనా?" అంటూ తలెత్తి అతని ముఖంలో చూచింది అప్పుడామె హృదయంలో ఏమేమి భావాలు లేగినవో ఆమెకే తెలియాలి "నాకేమీ పాలు పోవటంలేదు. మీరేమి చేయమంటే అలాగే చేస్తాను" అన్నది

మహిమ్ ఆశ్చర్య పోయాడు. శంకితుడైనాడు. ఆమె చూపులో చాంచల్యంలేదు. స్వచ్ఛంగా ఉంది ఆకన్నుల్లో ఆమె హృదయం చాల వరకు ప్రతిఫలిస్తోంది. ఆమె హృదయంలో భయంలేదు, చింతలేదు. భావిజీవిత స్వరూపమే ఆమెకు కనిపించినట్లు లేదు భవిష్యత్తును గురించి ఆమె ఏమీ నిర్ణయించుకున్నట్లు లేదు నిర్వికారయై నిల్చుంది అత్యాచారము సహించి అవమానితయై చివరకు ఇంత విరాగి ఐపోయిందా? మహిమ్ ఆశ్చర్య పోయాడు.

"ఇలా చెయ్యమని నేనెందుకు నిర్ణాజ్ఞాపించాలి? నేను చెప్పినట్లే నువ్వెందుకు చెయ్యాలి" అన్నాడు మహిమ్ స్వాభావిక కంఠస్వరాన.

"మీరుతప్ప నాకిప్పుడెవరూ లేరు ఎవరువాతో మాటాడను." అంటూ అచల అతని ముఖంలోకి తదేకంగా చూస్తూ నిల్చుంది.

"నేను మిమ్మల్ని పోగొట్టుకున్న తరువాత భగవంతుని ఎంతగానో ప్రార్థించాను!— 'ఓ ఈశ్వరా! నేనిక బ్రతకలేను నన్ను త్వరలో తీసుకుపో' అని. కాని ఆయన నా ప్రార్థన వినలేదు ఇప్పుడు మీరుకూడా వినటంలేదు. ఇక నేను ఏమిచెనేః?"

మహిమ్ ఏమీ మారుపలుకలేదు, బైటికి వెళ్లాడు, కాని ఆమె నిరాశాపూర్ణ కంఠస్వరం అతని గుండెలో ప్రతిధ్వనిస్తున్నది. నిరభిమానంగా, నిస్సంకోచంగా, సిగ్గువిడిచి ఆమె పలికినమాట అతనికి మరపు రావటంలేదు. ఇప్పుడు తానేమి చెయ్యాలి? తనను మించిన భారాన్ని తనమీద దించి సురేశ్ పరలోకానికి వెళ్లిపోయాడు

ఇంతలో రఘువీర్ అక్కడికి వచ్చాడు. "బాబూ మనంమూడుకోసు లదూరం కాస్త నడచి వెళ్లామంటే అక్కడ ఎద్దుబండ్లు దొరకవచ్చు. అంత వరకూ అమ్మగారు ఓపిక చేసుకుని..."

అచల ఆమాట విన్నది.

"పదండి అయితే" అంటూ లేచినిల్చుంది కాని ఆమె కాళ్లు వొణికాయి. పడబోయింది మహిమ్ చేతులు చాచి పట్టుకున్నాడు, కాని అతనికి సిగ్గయింది. విరక్తి కలిగింది. సంకోచించాడు. "పోనీ, ఇవాళ కాకపోతే రేపువెడదాం" అన్నాడు.

"ఎందుకూ? మీకు మళ్లీ దేహారీనించి వెళ్లిపోడానికి ఆలస్యమౌతుందని అనుకుంటున్నారుగా!" అన్నది అచల.

"మరి నువ్వు చాలాబలహీనంగా—"

"ఉహు, బలహీనంగాలేను, మీ చెయిపట్టుకుని ఎందూరం నడవమన్నా నడువగలను"

"పద" అన్నాడు మహిమ్ రఘువీర్ ముందు నడిచాడు. మహిమ్ ఒక్కనిట్టూర్పు విడిచాడు. అందరూ కాలినడకన సాగిపోయారు.

## 44

దేహారీ చేరుకున్నారు అచల ఒక పెద్ద కవరుతీసి మహిమ్‌కు ఇస్తూ —"ఇదే వారి విల్లునామా"— అన్నది.

మహిమ్ దాన్ని అందుకున్నాడు. అందులో తనకొక ఉత్తరంకూడా వుండవచ్చు. అందులో సురేశ్ ఏమి రాశాడో! ఏమి నిగూఢ రహస్యం అందులో తాను తెలుసుకోవలసినది వున్నదో! చింపి చదువుకోవలెనన్న కుతూహలం మహిమ్‌బాబు హృదయంలో తుపానువలె సందడిచేసింది కాని ఉత్సుకత అణచుకొని కవరుజేబులో పెట్టేసుకున్నాడు

"మీరు ఇవాళే దేహారీవిడిచి వెళ్లిపోతున్నారా?" అనిఅడిగిందిఅచల.

"ఔను ఇంకా నేనిక్కడ ఉండటం మంచిదికాదు"

"నే నిక ఎప్పుడూ ఇక్కడ ఉండవలసిన దాన్నేనా?"

మహిమ్ కాసేపు మౌనముద్రవహించి చివరకిలా అన్నాడు. "అయితే నువ్వెక్కడికేనా వెళ్లాలని ఉందా?"

"నిన్న టినించీ అదే ఆలోచిస్తున్నాను. పశ్చిమ దేశాల్లో నావంటి అభాగినులకు ఆశ్రమాలేవో ఉంటాయని విన్నాను. మనదేశంలోకూడా అలాంటివి ఏమన్నా......"

అర్ధోక్తిలోనే ఆమె ఆగిపోయింది. కన్నులవెంట అశ్రువులు ధార కట్టినవి.

మహీమ్ హృదయంలో కరుణ ఉత్పన్నమైంది, అన్నాడు మెల్లిగా- "ఏమున్నాయో నాకు ఏమీ తెలియదు. ఐనా విచారిస్తాను"

"ఎప్పుడైనా ఉత్తరం రాస్తే మీరు జవాబు రాయరా?"

"అవసరమైతే రాస్తాను, రైలువేళ అయింది; వెళతాను"

అచలాదేవి ఆ సమయాన...తన జీవితంలో ప్రథమపర్యాయంగా... తన దుఃఖమంతా పతిచరణాల ముందు మర్పించి...అతని పాదముస్తోకిన నేల మూద్రాడి ప్రణామం చేసింది మహీమ్ వెళ్ళిపోయాడు. ఆమెద్వారం చెంత ప్రమోహువలె నిల్చుంది

మహీమ్‌బాబు వెళుతూ ఇలా ఆలోచించుకున్నాడు "ఇక రాంబాబు గారింట్లో ఒక్క క్షణం కూడా ఉండటానికి వీల్లేదు. ఈపట్నంలో కాని ఇంకొకచోటనైనా ఉండటం అనవసరం. ఇవాళ్టే ప్రయాణం కట్టివెళ్లి పోవటం మంచిది"

మహీమ్‌బాబు ఏకాంతంకోసం తహతహలాడినాడు. ఉత్తరంలో ఏమున్నదో చదువుకోవాలి. అంతేగాక కాస్త అంతర్దృష్టి ప్రసరించుకుని ఆత్మావలోడన చేసుకోవాలి.

వివాహాత్ పూర్వపు ప్రేమగాథ అతనికిఅస్పష్టంగా గుర్తుకు వచ్చింది. అతరువాత అచలాదేవిమూలాన్ని తనజీవితంలో ప్రళయం కమ్మింది. పూర్తిగా ధీరంగా సహించి యుండగల శక్తి భగవంతుడు తనకు ప్రసాదించలేదు. బయటనించీ, లోపలనించీ కూడా తనయిల్లు తగులబడి పోయింది. బూడిదయై పోయింది.

నిర్జనస్థలం—ఏకాంతప్రదేశం—మహీమ్‌కు అవశ్యం కావలసి వచ్చింది.

రాంబాబుగారింటికి వచ్చాడు. సామాను సర్దుకున్నాడు. రైలు రావటానికి ఇంకో గంట ఆలస్యం ఉంది రాంబాబు కాశీనించి ఎప్పుడు తిరిగివస్తాడో! కాశీలో ప్రాయశ్చిత్తం చేసుకుని వచ్చే వరకూ అన్నం తిననని శపథం చేసివెళ్లాడు.

రాంబాబుకు ఒక ఉత్తరం రాసిపెట్టి వెడదామని మహిమ్ కాగితం, కలం తీసుకున్నాడు. నాలుగు పంక్తులు రాశాడు. వాక్యాలు వ్యంగ్యపూర్ణములుగా దొర్లినవి. అచలాదేవి అస్ఫుట అంతఃస్వరం వినిపించింది అతనికి. చైతన్యం ఉన్నట్టూ లేదు, లేనట్టూ లేదు.

రాంబాబుతో మహిమ్‌కు ఎక్కువ పరిచయం లేదు. అయినా ఆయన మంచి దయాళువు; ఉదారుడు; మర్యాదస్థుడు; నిశ్చల భక్తుడు; ధర్మనిష్ఠ కలవాడు. అచలను సొంతబిడ్డలా ఆదరించాడు. అన్యగోత్రీకురాలు వండిన కూడు తిననివాడు అచల చేత వండించుకుని తిన్నాడు. ఆ సంగతి ఆయనే ఒకసారి మహిమ్‌కు చెప్పాడు.

ఇందులో అచలాదేవి తప్పేమిటో తరువాత ఆలోచించవచ్చు. ఆమె చేతికూడు తిన్నంత మాత్రాన దగ్ధమైపోయిన ఈ మహనీయుని ధర్మం ఏమి ధర్మం? ధర్మమనేది అత్యాచారమునించి తనన్నూ, ఇతరులనూ రక్షించవలె. తన్ను ఒక్కడిని మాత్రమే మృత్యువునించి రక్షించటానికి ఉపయోగించేటువంటిది ధర్మమనిపించుకుంటుందా? అటువంటి ధర్మంవల్ల ప్రపంచానికి ఏం లాభం? రాంబాబు స్నేహమర్యాదనైనా పాటించలేదు; ఒక నిస్సహాయురాలై యున్న అబలను మృత్యుముఖంలో విడిచి వెళ్ళిపోవడానికి కూడా సంకోచించలేదు. పైగా తన బ్రాహ్మణ్యాన్ని పాడుచేసిన వ్యక్తియని ఆమెమీద మండిపడ్డాడు. ఇదా ధర్మం? ఆయన 'ధార్మికుడా? ధర్మమనేది మానవునికి ఆఘాతాలను సహించగలందులకుగాను ఒక కవచము వంటిదై ఉండాలి

మహిమ్‌కు అప్పుడు వెంటనే తన సంగతి జ్ఞాపకం వచ్చింది. తాను మాత్రం ఏంచేస్తున్నాడు? తానూ అలాగే పారిపోతున్నాడుగా! కాని ఆ ఆలోచన బలవంతంగా అణచుకున్నాడు. ఉత్తరం పూర్తి చేశాడు. సామాను సర్దుకుని స్టేషన్‌కు వెళ్లాడు.

రైలు వచ్చింది. మహిమ్ ఒక పెట్టెలో ఎక్కబోతున్నాడు. ఆ పెట్టెలో నించే ఒక ముసలాయన ఒక వితంతువు సహాయంతో దిగుతున్నాడు.

"అరె, మహిమ్ ఇక్కడ ఉన్నాడే!" అన్నాడు ముసలాయన ఆశ్చర్యంగా.

మృణాళిని మహిమ్‌బాబుకు పాదాభివందనం చేసింది. "ఎక్కడికి వెడుతున్నావు బావా?"

మహిమ్ రైల్లో ఎక్కి కూచున్నాడు. ఇద్దరూ విస్మితులై చూస్తూ ఉన్నారు.

"నేను కలకత్తా వెడుతున్నాను. 'సురేశ్‌బాబుగారి ఇల్లు' అని చెబితే బండీవాడు మిమ్మల్ని తీసుకువెడతాడు. అక్కడే అచల ఉన్నది" అన్నాడు మహిమ్.

కేదారబాబు కింకర్తవ్యతావిమూఢుడై ఏగాదిగా చూస్తూ నిల్చిపోయాడు.

"సురేశ్ మరణించాడు. అచల ఏదైనా ఆశ్రమంలో చేరతానంటున్నది. నేనేమీ ఇదమిద్ధంగా చెప్పలేకపోయాను. మృణాళినీ! నువ్వు ఆమెకు ఏదో దారి చూపగలవు" అన్నాడు మహిమ్

"ఎందుకుచూపను బావా? నాకు చిన్నప్పటినించీ శిక్షణగరపిన వాడివి నీవే. ఆశ్రమమో. ఆశ్రయమో, ఎక్కడ లభిస్తుందో వదినెకు నేను చెప్పగలను. కాని అదికూడా నువ్వు ఇచ్చినదే కాగలదు" అన్నది మృణాళిని మహిమ్‌బాబు ముఖంలోనికి చూస్తూ —

మహిమ్ ఏమీ మాటాడలేదు. ఆమె తీక్షణదృష్టిని తప్పించుకునేందుకు ముఖం పక్కకు తిప్పుకున్నాడు.

రైలు కదిలింది కేదారబాబు స్ఖలితహస్తాన్ని అందిపుచ్చుకుని — "రండి పెదనాన్నగారూ! వెడదాం" అన్నది మృణాళిని.



# శేషప్రశ్న

విశ్వవిఖ్యాతిగాంచిన శరత్ రచనలలో ఇది ఒకటి. కేవలం సాంఘిక వ్యవస్థల సమగ్రపరిశీలనే కాక— రాచకీయముగ, వైజ్ఞానికముగ, సామాన్య మానవునికైనా ఎలాంటి సంస్కృతి అవసరమో, శరత్‌బాబు స్వీయదృక్పథంలో విపులీకరించాడు.

మనరాజకీయ నాయకులెందరో దీనినే శరత్‌బాబు ఉత్తమ రచనగా శ్లాఘించారు.

దేశకాల పరిస్థితుల కనుగుణంగా సాహిత్యం సృష్టి కావాలని ఆందోళన జరిగే ఈరోజుల్లో - ఈనవలను తెలుగులో ప్రకటించ గలుగు తున్నందులకు గర్విస్తున్నాం. ఇలాంటి సాహిత్యానికి ఈరచన కేవలం ఉదాహరణమేకాక ఆదర్శ ప్రాయంకూడా.

ఇది శరత్‌బాబు నవలలో విశిష్టమైన నవల.

అనువాదం.

'విషనాగు'





# పాపి కొండలు

మానవుని సాంఘిక జీవితంలో సామాన్యంగా తటస్థపడే విషమ పరిస్థితుల విపుల చిత్రీకరణే "పాపికొండలు"

నైతిక పథంనుంచి పురుషులు పతితులు కావటానికి స్త్రీల ప్రవర్తనకూడా దోహద మౌతుందంటే, తొందరగా విశ్వసించలేము. కాని Sentimentalగా ఆలోచిస్తే అసత్యమనీ అనలేము.

ప్రతిఒకరూ తప్పకచదవవలిసిన, చదవతగిన కథలసంపుటి.

రచన

## శ్రీసూరి



# శరత్ సాహిత్యం



| | |
|---|---|
| చరిత్రహీనులు (రెండుభాగాలు) | 5—0—0 |
| శుభద | 2—0—0 |
| పూజారిణి | 1—8—0 |
| గృహదహనం (రెండుభాగాలు) | 3—0—0 |
| శరత్ కథలు (నాలుగుభాగాలు) | |
| ఒక్కొక్కభాగం | 1—0—0 |
| సరయు | 1—0—0 |
| ఆడబ్రతుకు | 1—0—0 |
| స్వామి | 1—0—0 |
| విరాజ్‌బహూ | 1—4—0 |
| కాశీనాథ్ | 0—8—0 |

వాసుదేవా ప్రెస్, హైదరాబాద్.